## సరదాగా....

### రోజుకొకటి...

ఆ రోజు శాంతారాం పెళ్ళిరోజు! ముచ్చటగా మూరెడు మల్లెలు కావాలన్న భార్య శాంతి కోరిక మేరకు బజారుకు వెళ్లాడు శాంతారాం. పూలకొట్టు దగ్గరికి వెళ్ళి మూరెడు మల్లెలెంత? అనడిగాడు. పూలమ్మి పది రూపాయలు అని చెప్పటంతో కాసేపు ఆలోచించాడు శాంతారాం. తరువాత ఓ రూపాయి పెట్టి పది విడిపూలు పట్టు కెళ్లాడు ఇంటికి. తన చేతిలో పెట్టిన పది విడిపూలను చూసుకొని, 'పిసినిగొట్టుతనానికి ఓ హద్దు ఉండాలి. మూరెడు మల్లెపూలు తెమ్మంటే రూపాయిపెట్టి పది విడిపూలు తెస్తారా?' కోపంగా అంది భార్య.

శాంతారాం ప్రశాంతంగా శాంతివైపు చూసి, "సర్లే, ఈ పువ్వులు ఫ్రిడ్జ్‌లోపెట్టి రోజుకొకటి జడలో గుచ్చుకో" అంటూ సోఫాలో కూర్చొని మిగిలిన డబ్బు లెక్కపెట్టుకోసాగాడు.

### ఒక ప్రశ్న?

ముగ్గురు స్నేహితులు కలిసి ఓ పార్టీకి వెళ్లారు. ఎంట్రన్స్‌లోనే వాళ్ళకో బాక్స్ దర్శనమిచ్చింది. దానిముందు బ్లాక్ అండ్ బ్లాక్, టాప్ టు బాటమ్ ధరించిన ఒక దృఢకాయుడు నిలబడి ఉన్నాడు. అతడి దగ్గరకెళ్లి బాక్స్ గురించి అడిగారు. ఆ దృఢకాయుడు 'ఈ పార్టీలో ఎవరిని ఎవరూ పేరు పెట్టి పిలుచుకోరు. ఈ బాక్స్‌లోంచి తీసిన చీటీలో ఎవరికి ఏ పేరు వస్తుందో, పార్టీ అంతా వాళ్ళు అదే పేరుతో కంటిన్యూ అవుతారు' అని చెప్పాడు. ఇదేదో బాగానే ఉందే! అనుకుంటూ ముగ్గురూ చీటీలు తీశారు. ఒకరికి పింక్ అని, ఇంకొకరికి గ్రీన్ అని, మరొకరికి ఆరెంజ్ అనే పేర్లు వచ్చాయి. వాళ్లు ఆ పేర్లని షర్ట్‌లకు పిన్ చేసుకొని పార్టీలోకి ఎంటరయ్యారు. ఒక టేబుల్ చూసుకుని దాని ముందు కూర్చున్నారు. చిత్రంగా వాళ్లు ముగ్గురూ గ్రీన్, పింక్, ఆరెంజ్ షర్టులే ధరించారు. కూర్చున్నాక పింక్ అన్నాడు, 'చూడండ్రా, మనం వేసుకున్న షర్టుల రంగు, మన పేర్లు ఒకటే! కాకపోతే ఎవరి పేరూ ఎవరి షర్టు రంగుతోనూ కలవటం లేదు, అంతే' అన్నాడు. గ్రీన్ షర్టు వేసుకున్నతను, అవును, నువ్వన్నది నిజమేరా పింక్, నా షర్టు కలరు, నీ పేరు కూడా ఒకటి కాదు' అన్నాడు. ఇంతకీ ప్రశ్న ఏంటంటే ఎవరు ఏ రంగు షర్టు వేసుకున్నారు? లాజిక్ తీయండి మరి.

**సమాధానం**

గ్రీన్ షర్టు వేసుకున్నతని స్టేట్‌మెంట్‌ని బట్టి చూస్తే, పింక్ పేరున్న వ్యక్తి ఆరెంజ్ షర్టు వేసుకున్నాడు. ఆరెంజ్ పేరున్న వ్యక్తి గ్రీన్ కలర్ షర్టు వేసుకున్నాడు. గ్రీన్ పేరున్న వ్యక్తి పింక్ కలర్ షర్టు వేసుకున్నాడు.
















8

## విచిత్ర గ్రామాలు... వింత పోకడలు!

దేవుడు దొంగతనం చేశాడంటే మీరు నమ్ముతారా? కానీ ఆ గ్రామస్థులు నమ్మడమేకాదు, ఆ దేవుడిపేరు ఎత్తితేచాలు ఊరునుంచి బహిష్కరిస్తారు! మరో గ్రామంలో మరణించిన వారికి పెళ్ళిళ్ళు చేస్తారు. ఇంకోచోట సకలసదుపాయాలున్న గ్రామాన్ని జనం ఖాళీచేసేశారు. ఆ వింతలేంటో చదవండి.

30

### రివ్యూ

మాతృభాషకు పూర్వవైభవం తేవాలని లక్ష్యం నిర్దేశించింది యునెస్కో. 21వ తేదీ ఫిబ్రవరి, మాతృభాషా దినోత్సవం సందర్భంగా రాజశుక సమీక్ష మీ కోసం..

72

### ఇంటర్వ్యూ

తెలుగు చిత్ర పరిశ్రమలో అవకాశాలు తెలుగునటులకే దక్కాలనీ, తారల్ని దిగుమతి చేసే పద్ధతి మారాలనీ అంటున్న నటి సత్యప్రియ ఇంటర్వ్యూ...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: సురభి
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### వండర్‌ఫుల్ డాక్టర్

గొంతులో గురగురగా ఉంది. నొప్పిగా ఉంది. ఏదో ఎలర్జీ. తగిన చికిత్సకోసం డాక్టర్ని కలిసేందుకు క్లినిక్‌కి వచ్చింది బాల. అప్పటికే రోగులు అక్కడ చాలామంది ఉన్నారు. వరుసలో కూర్చుని ఉన్నారు. నర్సు వచ్చి పిలిస్తే ఒకొక్కరుగా వెళ్తున్నారు. తన వంతు వచ్చేటప్పటికి అరగంటపైగానే పడుతుందనుకుని, టైం వేస్ట్ చేయడం ఇష్టం లేక బ్యాగులో నవల తీసుకుని, కాలు మీద కాలేసుకుని, చదువుతూ కూర్చుంది బాల. చదవడంలో మునిగిపోయిన బాలకు టైమే తెలియకుండాపోయింది. ఇంతలో నర్సు వచ్చి పిలిచిందామెను. కాలు మీది కాలు తీసి, ఒక్కసారిగా లేచి నిల్చోవడంతో నొప్పి కలిగింది బాలకి. పాదాన్ని నేలన మోపలేకపోయింది. అయినా పిలిచిన వెంటనే వెళ్ళకపోతే మళ్ళీ అరగంటపాటు కూర్చోవాల్సి వస్తుందని, నొప్పి అనిపిస్తున్నా, కాసేపటికి దానంతటదే తగ్గిపోతుందని కుంటు కుంటూ డాక్టర్‌రూంకేసి నడచింది. బాల అలా నడవడాన్ని అక్కడ కూర్చున్న ఇద్దరు స్త్రీలు గమనించారు. పాపం అంటూ జాలిపడ్డారు.

అయిదు నిమిషాల అనంతరం హాయిగా, మామూలుగా నడుచుకుంటూ డాక్టర్ దగ్గర నుంచి బయటకి వచ్చింది బాల. ఇందాక ఆమె నడకను చూసి జాలిపడ్డ స్త్రీలిద్దరూ ఇప్పుడు ఆమెను చూసి ఆశ్చర్యపోయారు. ఆశ్చర్యపోతూనే ఒకామె మరొకామెతో అన్నదిలా.

"నేను చెప్పలేదూ! ఈ డాక్టర్ ఆషామాషీకాదు, చాలా వండర్‌ఫుల్ డాక్టర్. ఎలాంటి నొప్పినైనా అయిదంటే అయిదునిమిషాల్లో ఇట్టే చేత్తో వెన్నను తీసినట్టుగా తీసి పారేస్తాడు."

### బాధ

చూడడానికి అందంగా ఉన్నాడతను. బాగా డబ్బున్నవాడిలా ఉన్నాడు. ఖరీదైన రెస్టారెంట్లో కూర్చుని కావాల్సినవన్నీ తిన్నాడు. ఇంకా ఏమైనా కావాలా సార్? అని అడిగిన సర్వర్‌తో బిల్ అన్నాడతను. బిల్ తీసుకుని వచ్చి ఇచ్చాడు సర్వర్. దానిని చూసి, టిప్‌గా సర్వర్‌కి ఇరవై రూపాయల నోటిచ్చి, క్యాష్‌కౌంటర్‌కేసి నడిచాడతను. అక్కడ కూర్చున్న వ్యక్తి చేతికి బిల్ ఇచ్చాడు. అన్నాడిలా.

"గుర్తుందా? లాస్ట్ ఇయర్ సరిగ్గా ఇదే రోజు ఇదే టైంకి నేను ఇక్కడకు వచ్చి కావాల్సినవన్నీ తిన్నాను. అయితే బిల్ చెల్లించలేకపోయాను. దాంతో మీరు రచ్చరచ్చ చేశారు. పదిమందిలో నన్ను తిట్టి, కొట్టి, మెడబట్టి గెంటేశారు."

"సారీసార్! తప్పు అయిపోయింది." అన్నాడు కౌంటర్‌లోని వ్యక్తి.

"ఇట్సోకే! మీ పని మీరు చేశారు. మిమ్మల్ని నేను తప్పుపట్టను. కాకపోతే..."

"చెప్పండి సార్"

"మళ్ళీ మీకు అదే ట్రబుల్ ఇస్తున్నాను, నాకదే బాధగా ఉంది."

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 51

22-2-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# బాధ్యత

అనగనగా ఒక రాజు. ఆ రాజుపేరు ఇంద్రసేనుడు. యుక్తవయసు వచ్చిందతనికి. పెళ్ళి చేద్దామన్నారు పెద్దలు. అంతలో నారాయణపురాధీశుని కుమార్తె ఊర్వశి స్వయంవరం వినవచ్చింది. ఆ స్వయంవరంలో ఊర్వశిని సొంతం చేసుకుని రమ్మన్నారు పెద్దలు, ఇంద్రసేనుణ్ణి దీవించి పంపారు. పేరుకే కాదు, అందచందాల్లోనూ అప్సరస్త్రీ ఊర్వశిలాగానే ఉంటుంది రాకుమార్తె. ఆమెను చేపట్టేందుకు అనేకమంది ప్రయత్నిస్తున్నారు. ప్రయత్నిస్తున్న ప్రతివారూ ఇంద్రసేనునిలా వీరాధి వీరులూ, సౌందర్యవంతులే! అయితే అదృష్టం కలిసొచ్చింది, ఇంద్రసేనుణ్ణి ఊర్వశి వరించింది.

భార్యాభర్తలన్నా, ఈడూజోడు అన్నా ఊర్వశీ ఇంద్రసేనులే అన్నారు నగరవాసులు. నదీతీరాల్లోనూ, ఉద్యానవనాల్లోనూ వారిని చూసినవారంతా రతీమన్మథులే ఊర్వశీ ఇంద్రసేనులై జన్మించారని చెప్పుకున్నారు. అందానికి అందం ఊర్వశి. అనురాగానికి అనురాగం ఇంద్రసేనుడు అన్నారు. ఊర్వశి ముఖం చూడనిదే నిద్రలేచేవాడు కాదు ఇంద్రసేనుడు. అలాగే ఆమె చేతిని ముద్దు పెట్టుకోనిదే సభాప్రాంగణానికి కూడా నడిచేవాడు కాదు. అనుక్షణం ఇంద్రసేనునికి ఊర్వశి తలపే! రోజులు అలా గడుస్తుండగా ఒకనాడు శత్రురాజుల్ని ఎదుర్కొనేందుకు ఇంద్రసేనుడు యుద్ధానికి వెళ్ళాడు. అతను అటు యుద్ధానికి వెళ్ళడం ఏమిటి, ఇటు ఊర్వశికి చర్మవ్యాధి సోకింది. చర్మచిత్రకం ఆమెను చుట్టుముట్టింది. అందమైన చర్మం తొలగిపోయి, ఆ స్థానంలో తెల్లతెల్లని, ఎర్రెర్రని మచ్చలు ఏర్పడ్డాయి. అద్దంలో తనని తానే చూసుకోలేకపోతోంది ఊర్వశి. భయపడుతోంది. తనని చూసి ఇంద్రసేనుడు ఇంకెంత భయపడతాడోనని ఆందోళన చెందింది. ఆత్మహత్యతప్ప దిక్కు లేదనుకున్నది.

శత్రురాజుల్ని ఓడించి ఇంద్రసేనుడు తిరుగు ప్రయాణమయ్యాడు. ఊర్వశిని ఎప్పుడెప్పుడు చూస్తానా అని ఉవ్విళ్ళూరసాగాడు. అయితే మార్గమధ్యంలో ప్రమాదానికి లోనయ్యాడతను. రథం తిరగబడడంతో ముళ్ళచెట్లమధ్యపడి, కళ్ళు పోగొట్టుకున్నాడు. అంధుడయ్యాడు. అంతఃపురానికి ఈ వార్త తెలిసినంతనే ఆత్మహత్యా ప్రయత్నాన్ని విరమించుకున్నది ఊర్వశి. రాజు సమస్య ముందు తన సమస్య చిన్నదని తలచింది. రాత్రింబవళ్లు రాజు పరిచర్యల్లో తల మునకలైంది. ఊర్వశి అందాన్ని కోల్పోయిన సంగతి ఇంద్రసేనునికి తెలియదు. తెలియక ఎప్పటిలాగే పొద్దునే లేచి ఆమె ముఖాన్నే తడిమి చూసి సంతృప్తి చెందుతున్నాడు. అలాగే సభాంగణానికి వెళ్ళేటప్పుడు కూడా ఆమె చేతిని ముద్దుపెట్టుకుంటున్నాడు. వద్దువద్దన్నా వినడం లేదు రాజు. అనురాగంలో అరమరికలు చూపించడం లేదు. చర్మం పూర్తిగా తొలగిపోయింది. కురూపిగా మారిపోయింది ఊర్వశి. అయినా ఆమె నుంచి దూరంగా తొలగిపోలేదు రాజు. బిగికౌగిట ఆమెను బంధించి మరీ పడుకుంటున్నాడు. అంధుడైన రాజును తను మోసం చేస్తున్నదా? నిజాన్ని ఎందుకు చెప్పలేకపోతున్నది? అని మథనపడుతూ మథనపడుతూ కొన్నాళ్ళకి తనువు చాలించింది ఊర్వశి. చనిపోయింది. కొద్దిరోజులు గడిచాయి. ఆనాడు ఓడిపోయిన శత్రురాజులు మళ్ళీ విజృంభించారు. ఇంద్రసేనుణ్ణి యుద్ధానికి రమ్మన్నారు.



రాజు అంధుడు. యుద్ధం అనివార్యం. ఇప్పుడెలా? అని మంత్రివర్గం మల్లగుల్లాలు పడుతోంటే సభాంగణానికి చేరుకున్నాడు ఇంద్రసేనుడు. యుద్ధానికి సన్నద్ధమయ్యాడు. మీరు అంధులు మహారాజా! ఆ సంగతి మీరు మరచిపోతున్నారు అన్నారు మంత్రులు. ఎవరు చెప్పారు, నేను అంధుణ్ణి అని అన్నాడు ఇంద్రసేనుడు. కత్తిని గాలిలో ఝళిపించి, తన మీదికి వచ్చిన మంత్రిని మట్టికరిపించాడు. ఆశ్చర్యపోయారంతా. ఇదెలా సాధ్యం? అని అడిగారు. నా పంచప్రాణాలకన్నా నాకు ఊర్వశి ఎక్కువ. ఆమె అంటే నాకు ఎనలేని అనురాగం. ఆమెకు చర్మవ్యాధి సోకింది అని చారులు ద్వారా తెలుసుకున్నాను. వ్యాధికన్నా నేను దూరం కావడం భరించలేదామె. అందుకే ఇన్నాళ్ళూ అంధునిగా నటించాను. భర్తగా నా బాధ్యత నేను నిర్వర్తించాను. కాలం కలసిరాలేదు. అందుకు చింతించి లాభం లేదు అన్నాడు ఇంద్రసేనుడు. భర్తగానే కాదు, రాజుగా కూడా నా బాధ్యత నేను నిర్వర్తించకతప్పదు. కదనరంగానికి కదలండి అన్నాడు. గుర్రాన్ని అధిరోహించి, ముందుకురికాడు ఇంద్రసేనుడు.

## మాట్లాడే రెజ్యూమె

రెండు మూడు పేజీల సీవీలు పట్టుకుని కంపెనీల చుట్టూ కాళ్లరిగేలా తిరగడం, వాళ్ల పిలుస్తారని కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూడటం ఉద్యోగార్థులకు మామూలే. అయితే దీనికొక బెస్ట్ సొల్యూషన్ కనిపెట్టింది హ్యాపీమైండ్స్ మ్యాన్ పవర్ సొల్యూషన్స్. దానిపేరే సెల్ఫీ వీడియో రెజ్యూమె! వీడియో రెజ్యూమె ద్వారా ఆయా సంస్థలు అభ్యర్థిని ఎంచుకునే వీలు కల్పించింది. ఉద్యోగార్థులు గూగుల్ ప్లే స్టోర్ నుంచి హ్యాపీ మైండ్స్ యాప్ డౌన్‌లోడ్ చేసుకుని అందులో ఆప్షన్లను ఫాలో అవుతూ, మీ గురించి మీరు బ్రీఫింగ్ ఇవ్వడమే. యాప్ ద్వారా మొబైల్‌లోని రియర్ వ్యూ కెమెరా ఓపెన్ అవుతుంది. రికార్డు బటన్ ప్రెస్ చేసి, మీ క్వాలిఫికేషన్, గత అనుభవం క్లుప్తంగా వివరించి, ఆ వీడియోని అప్‌లోడ్ చేస్తే చాలు. అలా అప్‌లోడ్ చేసిన వీడియో రెజ్యూమెను హ్యాపీ మైండ్స్ తమతో టై అప్ అయిన కంపెనీలకు చేరవేస్తుంది.

ఇపుడు చాలా కార్పొరేట్ సంస్థలు క్వాలిఫికేషన్, అనుభవంతోపాటు అభ్యర్థి బాడీ లాంగ్వేజ్, వాయిస్, ఐ కాంటాక్ట్, కాన్ఫిడెన్స్ గమనిస్తున్నాయి. అలాంటివన్నీ సాధారణ సీవీలో పొందుపరచలేం. ఇలా వీడియో రెజ్యూమెలో అయితే సంస్థలు తమకు కావల్సిన కాండిడేట్‌ని సులభంగా ఎంచుకోగలుగుతాయి. వీడియోల ద్వారా హెచ్ఆర్ పని మరింత సులభతరమవుతుంది. ఎందుకంటే వీడియో ప్రొఫైల్ చూడటం వల్ల



ప్రిలిమినరీ రౌండ్ ఇంటర్వ్యూ చేయాల్సిన అవసరం ఉండదు. ప్రొఫైల్ నచ్చితే తర్వాతి రౌండ్‌కి సెలెక్ట్ చేసుకోవచ్చు.

హైదరాబాద్‌కి చెందిన హ్యాపీమైండ్స్ సొల్యూషన్స్ ఇండియాలోనే మొట్టమొదటిసారిగా వీడియో రెజ్యూమె కాన్సెప్ట్ ప్రవేశపెట్టింది. అటు రిక్రూటర్ల సమయాన్ని, అభ్యర్థుల వ్యయప్రయాసలను ఒక్క యాప్ ద్వారా పరిష్కరించగలిగింది. గంటలకొద్దీ జరగాల్సిన ఇంటర్వ్యూలు ఎంతో సులభంగా, తక్కువ సమయంలో జరుగుతున్నాయని సంస్థ ఫౌండర్ కమ్ సీఈవో లీలాధర్ రావు తెలిపారు. ప్రస్తుతానికి 21 కార్పొరేట్ కంపెనీలతో హ్యాపీమైండ్స్ టై అప్ అయిందన్నారు. చాటింగ్ ద్వారా విద్యార్థుల సందేహాలకు సమాధానాలిచ్చే ప్లాట్‌ఫాం కూడా ఇందులో ఉంది.

రిక్రూట్‌మెంట్ ప్రాసెస్ సులభతరం చేయడంతోపాటు జాబ్ సీకర్స్, రిక్రూటర్స్ సమయాన్ని సేవ్ చేస్తున్న హ్యాపీ మైండ్స్... త్వరలో ఇండియా అంతటా విస్తరించాలనేది ఫ్యూచర్ ప్లాన్‌గా పెట్టుకుంది.

# మెయిల్ బాక్స్

## మొదటిపేజీ సందేశాత్మకం

మొదటిపేజీలో 'కనబడుటలేదు' జరిగింది రాసినట్టుగా ఉంది. ఈ శీర్షికలో వెలువడుతున్న మినీ కథలన్నీ సందేశాత్మకమైన వాస్తవాలుగా ఉంటున్నాయి. ధన్యవాదాలు శర్మాజీ! కోట శ్రీనివాసరావు గారి అనుభవాలు ఆసక్తికరంగా ఉన్నాయి. కోడి రామకృష్ణగారు గొప్ప సృజనశీలురేకాక మంచి నటుడని తెలుసుకున్నాం.

-మల్లీశ్వరి, హైదరాబాద్

## చక్కగా రాశారు

ప్రేమా? ఆకర్షణా? శీర్షికతో రాసిన వ్యాసం బాగుంది. హరివంశం ద్వారా పితృదేవతలు, పూజలు, ప్రభావాలు వంటి తెలియని విషయాలు తెలిశాయి. చాలా బాగుంది. ఆరోగ్యమే మహాభాగ్యం ప్రతి వారం ఆకట్టుకుంటోంది. మలివయసులో తోడుగా వ్యాసం బాగుంది. ఈ తరం యువకులు తెలుసుకోవాల్సిన విషయాలు చక్కగా రాశారు.

-రావర్ల లోకబాంధవ, మచిలీపట్నం

## నిజాలు చెబుతున్న సినీవాలి

సినీ స్టూడియోల్లో జరిగే అన్యాయాలు, సంఘటనలు, సినీతారల జీవితాలను వెలుగులోకి తెచ్చిన సీరియల్ సినీవాలి. అత్యద్భుతంగా పాఠకులకు అందజేస్తున్నారు. ఒకప్పుడు మద్రాసు స్టూడియోలో నేను లైట్‌బాయ్‌గా పనిచేశాను. ఇలాంటి ఘటనలు సినీపరిశ్రమలో ఎన్నో జరిగాయి.

ప్రభాకరజైని గారి సీరియల్ 'సినీవాలి' చిత్రసీమలో జరుగుతున్నవాటిని దృశ్యకావ్యంగా చూపిస్తున్నారు. జరుగుతున్న కథకు జీవం కల్పించిన జైని అభినందనీయులు. కలలుకంటున్న సినీ జనానికి ఇదొక నీతిచంద్రిక.

-గొట్టాపు దుర్గారావు, ఏలూరు

-పక్కి బాలకృష్ణారావు, విజయనగరం

## స్వర్ణోత్సవం

ఆన్‌లైన్‌లో టైగర్ సరదా, డైరెక్ట్ మార్కెటింగ్, కస్టమర్స్ ఫీడ్‌బ్యాక్‌లతో మార్నింగ్ కాఫీ నవ్వించింది. పెళ్ళంటే రెండు వ్యక్తిత్వాలు పెనవేసుకుని పరస్పరం గౌరవించుకోవడం అని మొదటిపేజీ కథ 'స్వర్ణోత్సవాలు'లో బహుచక్కగా చెప్పారు. సాంకేతికంగా, శాస్త్రీయంగా, ఆర్థికంగా ప్రపంచం ఎంతో ముందుకు పురోగమించినా మార్పు తెలియని మలానా లాంటి ఊళ్ళు ఉండటం ఆశ్చర్యమే. కొత్త ఆవిష్కరణలవల్ల ఎంతమేలున్నా కీడును ఫేస్ బుక్ లాంటి వ్యవహారాల్లో చూస్తూనేఉన్నాం.

-ప్రసన్న, పేర్రాజుపేట

## వృక్షబలి

చెట్ల ఇక్కట్లను వృక్షబలి కథలో చాలా చక్కగా చెప్పారు రచయిత్రి గొల్లపూడి రాజ్యలక్ష్మిగారు. స్వీయానుభవం అన్నంత చక్కగా వివరించారు. పచ్చనిచెట్టు కొట్టడం పాపమే. ఇప్పటి కాలనీలన్నీ ఫ్లాట్స్ మయం. చెట్లు పెంచుకునేవారి పొడ పొరుగువారికి గిట్టడంలేదు.

-యం.రమణకుమారి, హైదరాబాద్

## చిట్టిబాబు ఇంటర్వ్యూ అద్భుతం



సినిమా ఇంటర్వ్యూలు చాలా బాగుంటున్నాయి. ఈ వారం కోట శ్రీనివాసరావు, చిట్టి బాబు ఇంటర్వ్యూలు అద్భుతం. వారి అనుభవాలు వెరీ ఇంట్రెస్టింగ్. చదువు కోసం సినిమా వదులుకున్నాడు చిట్టిబాబు. గొప్ప విషయం. షిర్డీ సాయి దేవాలయాలు నిర్మిస్తూ వాటిని నిర్వహించడం మాకు తెల్సిన కొత్తవిషయం. వారి అన్నదాన దాతృత్వానికి ఇదొక చిహ్నం. ఆయన అన్నయ్య రాజబాబు 86 పెళ్ళిళ్ళు చేయించడం, 67 మందిని డిగ్రీవరకు చదివించడం, రాజమండ్రిలో స్కావెంజర్ కాలని కట్టడం విస్మయ పరిచాయి. కథల ఎంపిక ముగ్ధుల్ని చేస్తోంది. ఆరోగ్యం, యువత, సోషల్‌వెల్ఫేర్, తారల చిట్‌చాట్‌లు, ప్రపంచ వింతలు గొప్పగా ఆకర్షిస్తున్నాయి.

-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం

## మూడు తరాల వారధి

మూడు తరాల నటుల వారధిగా హాస్య నటుడు చిట్టిబాబు 'ఈ వేషం శాశ్వతం కాదు' అంటూ వ్యక్తం చేసిన అభిప్రాయాలు, ఆయన చేస్తున్న సేవా కార్యక్రమాలు బాగున్నాయి. హరివంశం బాగుంది. రివ్యూ ద్వారా కోడళ్ళరాజ్యం తెలిసింది. మొత్తానికి మన ప్రజాస్వామ్యంలో మూకుమ్మడి కుటుంబ రాజ్యమే.

-వాస్తు రామచంద్ర, నెల్లూరు

## పెళ్ళికి అర్థంచెప్పిన స్వర్ణోత్సవం

మార్నింగ్ కాఫీ దొందుకు దొందాలో స్పార్క్ అదిరింది. మొదటిపేజీ స్వర్ణోత్సవాలు, భార్యాభర్తల అనుబంధానికి సరైన అర్థం చెప్పింది. వెట్టి సీరియల్ బాగుంది. సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు ఊహించని మలుపులతో కొనసాగడం విశేషం. మనమీదే నర్రేయ్‌లో రోజూ ఇళ్ళల్లో జరిగే వైనాల్ని సరసిగారు ప్రతిబింబించారు. చిట్టిబాబు ఇంటర్వ్యూ బావుంది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

## ఉపయుక్తమైన శీర్షిక టీనేజ్‌ట్యూన్స్

పితృదేవతల్ని ఎందుకు పూజించాలో హరివంశం చదివాక తెలిసింది. మాకు తెలియని ఎన్నో విషయాలు హరివంశం ద్వారా తెలుసుకుంటున్నాం. అందం చూసి ఆకర్షణలోపడి అదే ప్రేమ అనుకుంటూ సమస్యల్లో చిక్కుకుంటున్న టీనేజర్ల గురించి బాగా వివరించారు టీనేజ్ ట్యూన్స్‌లో. ఇదొక బహుజనాదరణ పొందిన ఉపయుక్తమైన శీర్షిక. నవ ఆలోచనలతో జీవితాన్ని నవకోణాల్లో వీక్షించేందుకు తోడ్పడుతున్న ఉపయుక్త వ్యాసాలు అందించడమే నవ్య పంథా. కీపిటప్!

-శుభ, కాకినాడ

## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స**
హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

ఏ పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తలతిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

ADVT

# విచిత్ర గ్రామాలు వింత పోకడలు!

**ఈ సమాజం వింతల మయం! కొన్ని విషయాలు నమ్మశక్యం కూడా కావు! దేవుడు దొంగతనం చేశాడంటే మీరు నమ్ముతారా? కానీ ఆ గ్రామస్థులు నమ్మడమే కాదు, ఆ దేవుడిపేరు ఎత్తితేచాలు ఊరునుంచి బహిష్కరిస్తారు! ఇదిలా ఉంటే మరో ఊళ్లో మరణించినవారికి పెళ్ళిళ్ళు చేస్తారు, ఇంకో పట్టణంలోనేమో జనం సకల సదుపాయాలూ కల్పించినాగానీ గ్రామం వదిలివెళ్ళిపోయారు. అలాంటి వింత గ్రామాలు, విచిత్రపోకడల గురించి మీరూ తెలుసుకోండి.**

అదో పట్టణం. దానికి దయ్యాల పట్టణమని పేరు. అలా అని పాడుబడ్డ పట్టణం కాదు. దయ్యాల పట్టణం కదా దయ్యాలేమైనా ఉన్నాయనుకుంటే పొరబాటు పడినట్లే లెక్క! అక్కడ భారీ అపార్ట్‌మెంట్లు, షాపింగ్‌మాల్స్, సినిమా థియేటర్లు, రెస్టారెంట్లు, బ్యాంకులు, పార్కులు అన్నీ ఉన్నాయి. విచిత్రం ఏంటంటే ఒక్క మనిషి కూడా అక్కడ కనిపించడు. అయినా ఇప్పటికీ అక్కడి ఇళ్లల్లో రాత్రిళ్లు దీపాలు వెలుగుతూనే ఉంటాయి. ఆ వింత ఊరు చూడాలంటే కెనడా వెళ్ళాల్సిందే!

### మనుషులు లేని పట్టణం

కిట్‌సౌల్ట్ అనే ఆ పట్టణంలో అన్నీ ఉన్నా ప్రజలు మాత్రం ఉండరు. ఎందుకుండరో తెలుసుకోవాలంటే ఆ పట్టణం వెనుక జరిగిన ఓ కథ చదవండి మరి. కొన్నేళ్ళ ముందు అక్కడ అసలు ఆ ఊరే ఉండేది కాదు. అదంతా కొండ ప్రాంతం. అయితే 1979లో ఆ పరిసర ప్రాంతాల్లో మోలిబ్డినమ్ ఖనిజ నిక్షేపాలు పెద్ద ఎత్తున బైట పడ్డాయి. ఆ గనుల్లో తవ్వకాలకోసం వేరే ప్రాంతాల నుంచి వందలసంఖ్యలో కార్మికుల్ని అక్కడికి తీసుకు వచ్చారు. కార్మికుల నివాసంకోసం అక్కడ మూడు వందల ఇళ్లతో అపార్ట్‌మెంట్లు నిర్మించారు. క్రమంగా రెస్టారెంట్లు, బ్యాంకులు, ఆసుపత్రి, స్విమ్మింగ్‌పూల్ ఇలాంటి ఇతర సదుపాయాలన్నీ అందుబాటులోకి వచ్చాయి. టెలిఫోన్, డిష్, టీవీ కేబుల్స్ ఏర్పాటు చేశారు. దీంతో అన్నిహంగులున్న కిట్‌సౌల్ట్ పట్టణం తయారైంది. అయితే మూడేళ్ళ తర్వాత హఠాత్తుగా ఆ పట్టణం ఖాళీ అయిపోయింది. మోలిబ్డినమ్ ఖనిజానికి డిమాండ్ తగ్గి అక్కడి గనులు మూతపడడంతో కార్మికులందరూ అక్కడి నుంచి వెళ్ళిపోయారు. అప్పటినుంచి ప్రజలు లేని పట్టణంగా మిగిలిపోయింది. దయ్యాల పట్టణంగా పేరు వచ్చింది

నలభైఏళ్ళకుపైగా అక్కడ ఒక్కరు కూడా లేకపోయినా ఆ పట్టణం పాడుబడిపోలేదు. అక్కడి వీధులు శుభ్రంగా ఉంటాయి. పార్కులన్నీ రెగ్యులర్‌గా మంచి మెయింటెనెన్స్ చేస్తున్నట్టు అందంగా ఉంటాయి. కొళాయి తిప్పితే స్వచ్ఛమైన నీరు వస్తుంది. చీకటి పడిందంటే వీధి దీపాలు, ఇళ్ళల్లో దీపాలు వెలుగుతుంటాయి. ఇదంతా ఎలా సాధ్యం? అని ఆశ్చర్యం కలుగుతోందికదూ! ఈఊరు ఇంకా ఇలా సజీవంగా ఉండడానికి కారణం మన భారతీయుడే. కృష్ణన్ సుందరిన్ అనే ఎన్నారై అమెరికాలో పారిశ్రామిక వేత్త. ఆయన ఈ పట్టణాన్ని ఏడు మిలియన్ డాలర్లకు కొనుక్కున్నాడు. పాడుపడ్డ ఆగ్రామాన్ని దత్తత తీసుకుని 25 మిలియన్ డాలర్లు వ్యయంచేసి కొత్తరూపు తీసుకువచ్చాడు. ఆ పట్టణాన్ని పరిశుభ్రంగా ఉంచి మెయింటెనెన్స్‌చేసి కాపాడేందుకు 12 మందిని ఉద్యోగంలో నియమించాడు. వారు నిత్యం ఆ పట్టణంలో తిరుగుతూ గ్రామాన్ని సంరక్షిస్తుంటారు. ఆ



పట్టణాన్ని లిక్విఫైడ్  గ్యాస్ ఉత్పత్తి కేంద్రంగా మార్చాలన్నది కృష్ణన్ ఆలోచన. అదేకనుక నెరవేరితే మళ్ళీ ఆ పట్టణం జన సంచారంతో కళకళలాడుతుంది.

### అక్కడ తాకట్టు పెట్టేదేంటో తెలుసా?

కొన్ని గ్రామాల కట్టుబాట్లు వింటే అమ్మో ఇలాంటి ఊళ్ళు కూడా ఉంటాయా? అని ఆశ్చర్యం కలుగక మానదు. ఆ ఊళ్ళో ఎవరిదగ్గరైనా అప్పు తీసుకోవాలంటే ఏదైనా తాకట్టు పెట్టాల్సిందే. దాందేముంది తాకట్టేకదా, బంగారం, భూమి లేకపోతే ఏ వస్తువో తాకట్టుపెడితే సరిపోతుందనుకునేరు. అక్కడే ఉంది ట్విస్ట్. ఆ గ్రామంలో అలా తాకట్టు పెడితే కుదరదు. అప్పు తీసుకుంటే ఆడవాళ్ల నగ్న చిత్రాలు తాకట్టు పెట్టాలి! ఏంటీ ఛీ..ఛీ అనుకుంటున్నారా! అవును మీరు చదివింది నిజమే. చైనాలో ఒక గ్రామంలో ఎవరైనా అప్పు చేయాలంటే ఆడవాళ్ల నగ్నచిత్రాలు, వీడియోలు తాకట్టు పెట్టాల్సిందేనట. ఒకవేళ ఆ అప్పు తీర్చలేకపోతే ఆ ఆడవాళ్లను శారీరకంగా వాడుకుని ఆ చిత్రాలు ఇంటర్నెట్లో పెడతారట! ఇది అక్కడ ఎంతో కాలంగా జరుగుతోందట. ఇటీవలే ఒక మహిళ పోలీసులకు ఫిర్యాదు చేయడంతో ఈ విషయం బైటపడింది

### ఆ పేరంటే పడదు

హనుమంతుడంటే చాలామందికి ఇష్టం. అతులిత బలశాలి, పూజ్యనీయుడు. కానీ ఆ ఊళ్ళోమాత్రం పూజలు కాదు కదా కనీసం హనుమంతుణ్ణి తలవను కూడా తలవరు. పైగా ఎవరైనా ఆ పేరు ఉచ్ఛరిస్తే చాలు, కొట్టినంత పనిచేస్తారు! ఏకంగా ఊరినుంచే బహిష్కరిస్తారు! ఎందుకిలా? ఆ ఊరు ప్రజలు ఆంజనేయుణ్ణి ఎందుకంత ద్వేషిస్తారు? అంటే వాళ్లు చెప్పే సమాధానం, ఆంజనేయుడు తమఊళ్ళో దొంగతనం చేశాడని!! హనుమంతుడేంటీ? ఆ ఊళ్ళో దొంగతనం చేయడం ఏంటీ అనుకుంటున్నారా? అవును! హనుమ దొంగతనం చేశాడట. రామరావణ యుద్ధ సమయంలో రావణాసురుడి కొడుకు మేఘనాథుడి ఆయుధ ప్రయోగం వల్ల లక్ష్మణుడు మూర్ఛిల్లాడు. అతన్ని బతికించడానికి సంజీవని పర్వతం తీసుకువస్తాడు హనుమంతుడు. ఆ సంజీవని పర్వతం ప్రస్తుత ఉత్తరాఖండ్‌రాష్ట్రం ఆల్మోరాజిల్లాలో ఉన్న ద్రోణగిరి పక్కనే ఉండేదట. ద్రోణగిరి గ్రామంలో భూటియాతెగ ప్రజలు సంజీవని పర్వతాన్ని దేవతగా భావించి పూజించేవారు. తాము దేవతగా పూజించుకునే సంజీవని పర్వతాన్ని దొంగతనంగా తీసుకుపోయిన ఆంజనేయుడంటే వారికి విపరీతమైన కోపం, ద్వేషం. ఆ ఊళ్ళో ఆంజనేయుడికి సంబంధించిన పేరు వినబడినా , పూజలుచేసినా చాలా తీవ్ర నేరంగా పరిగణిస్తారు. ఎవరైనా హనుమంతుడికి పూజలు చేసినట్టు తెలిస్తే వారిని ఏకంగా ఊరినుంచే బహిష్కరిస్తారు.

### చనిపోయినవాళ్ళకు పెళ్ళి!

పెళ్ళంటే ఎంత హడావిడో చెప్పనక్కర్లేదు. కానీ ఆ ఊళ్ళో మాత్రం చనిపోయినవారికి పెళ్ళిళ్ళు చేస్తారు. చనిపోయిన వాళ్ళకి ఎలా పెళ్ళిళ్ళు చేస్తారనేగా మీ ప్రశ్న! అది తెలుసుకోవాలంటే ఉత్తరాఖండ్ రాష్ట్రంలోని షహరన్పూర్ జిల్లా మోహన్పూర్ గ్రామానికి వెళ్ళాల్సిందే! చిన్నవయసులోనో లేదంటే వివాహం కాకముందే మోహన్పూర్ గ్రామంలో ఎవరైనా చనిపోయినా లేక బతికున్నవారికైనా వివాహం చేసుకునే వయసు వచ్చేసమయానికి చాలా ఖచ్చితంగా వివాహం చేస్తారు. ఇదెలా సాధ్యం అవుతుంది? అనుకుంటున్నారా? ఆడపిల్ల లేదా మగపిల్లాడు కానీ వివాహానికి ముందే చనిపోయినా గానీ, వారి వివాహవయసు సమయం నాటికి సరిపడా సంబంధం వెతుకుతారు. అంటే మరణించినవారిలో వారికి తగినజోడి ఎవరున్నారో వెతికి తెలుసుకుంటారు. ఆ ఇద్దరి బొమ్మలూ తయారు చేస్తారు.  ఆ బొమ్మలకు అంగరంగ వైభంగా వివాహం చేస్తారు. ఇంకా విచిత్రమైన విషయమేమిటంటే ఈపెళ్ళిలో కానుకలు ఇచ్చిపుచ్చుకోవడాలు కూడా ఉంటాయి.

**- సంతోషి**

## అగ్నిప్రమాదాల మిస్టరీ గ్రామం!



ఇటలీలోని కనేటోడి కరోనియా గ్రామం మిస్టరీకి మారుపేరుగా చెప్పవచ్చు. దాదాపు పది సంవత్సరాల నుంచి ఆ గ్రామంలో తరచు అగ్నిప్రమాదాలు సంభవిస్తూనే ఉన్నాయట. అయితే దీనికి కారణాలు ఏమిటన్నది మాత్రం ఎవరికీ తెలియడం లేదు. 2004 లో ఆ గ్రామంలోని చాలామంది ఇళ్ళల్లో రకరకాల అగ్నిప్రమాదాలు సంభవించాయి. ఎలాంటి కారణం లేకుండానే ఈ అగ్ని ప్రమాదాలు జరగడం వింతైన విషయం. ఎంతోమంది నిపుణులు, పరిశోధకులు వచ్చి ఎన్ని పరిశోధనలు చేసినా ఆ అగ్నిప్రమాదాలకు కారణం తెలుసుకోలేకపోయారట. అగ్ని పర్వతాలకు సంబంధించిన శాస్త్రవేత్తలు కూడా పరిశోధనలు చేశారు. వారికి కూడా విషయమేంటో అంతుపట్టలేదు. చివరకు ఇది ఉగ్రవాదుల పనేమో అనే దిశగా పరిశోధనలు చేశారు. ఏమాత్రం ఫలితం లేకపోయింది. ఈ అంతుపట్టని అగ్నిప్రమాదాలతో పాటు నీళ్ళ పైపుల్లో మంటలు రావడం, ఇస్త్రీకి పెట్టుకున్న బట్టలు వాటంతటవే కాలిపోవడం, వంట చేస్తుంటే, పాత్రలు కాలిపోవడం, తెలియకుండానే వస్తువులు మండిపోవడం, చూస్తుండగానే మంటలు పుట్టడం లాంటి ఎన్నో వింత సంఘటనలు గ్రామంలో జరగడం ప్రారంభించాయి. ఇది ఇతర గ్రహవాసుల ప్రభావమని కొందరు, దుష్టశక్తుల ప్రభావమని మరి కొందరు... ఇలా విభిన్న కారణాలు చెప్పుకోవడంతప్ప ఖచ్చితమైన కారణం మాత్రం ఇప్పటికీ తెలియలేదు.



## పాతికేళ్ల తర్వాత నీళ్ళల్లోంచి బైటపడ్డ గ్రామం!

నీళ్ళలోంచి గ్రామం బయటపడడం ఏంటి? అనుకుంటున్నారా? అయితే మీరు అర్జెంటీనాలోని ఈ గ్రామం గురించి తెలుసుకోవాల్సిందే! 1920లో లగో ఇపీక్యూయన అనే సరస్సు తీరంలో విల్లా ఇపీక్యూయన అనే గ్రామం ఉండేది.  ఇపీక్యూయన ఉప్పు నీటిసరస్సు పేరిటే ఆ గ్రామం ఏర్పడింది.

ఈ సరస్సులో స్నానంచేస్తే  ఎటువంటి రోగమైనా నయమైపోతుందని గ్రామస్థులకు బలమైన నమ్మకం. ఆ నమ్మకంవల్ల ప్రసిద్ధ పర్యాటక ప్రాంతంగా మారిపోయిందీ గ్రామం. దీంతో 1983 వరకు ఈ ప్రాంతం హోటల్స్, షాపులు, పార్కులు, మ్యూజియాలతో కళకళలాడుతూ ఉండేది. ఈ సరస్సులో నీటి మట్టం ఏడాదికేడాదికీ పెరిగిపోతూ ఉండడంతో, ప్రజలు ఆ గ్రామం ఖాళీచేసి వెళ్ళిపోయారు. ఆ తర్వాత గ్రామం 1983లో నీటిలో మునిగిపోయింది. 2009లో నీరు తగ్గడంతో 26 ఏళ్ళ తరువాత ఈ గ్రామం తిరిగి బైటపడింది. దీంతో గతంలో ఈ గ్రామంలో నివాసమున్న పబ్లోనోవక్ (81) అనే వ్యక్తిమాత్రం తన మూలాలు వెతుక్కుంటూ ఈ గ్రామానికి చేరుకున్నాడు. ప్రస్తుతానికి ఆయన ఈ గ్రామంలోనే నివాసం ఉంటున్నాడు.



# తొలిశ్వాస

జయంతి వెంకటరమణ

**ఉదయం నుండి ఆకాశం మబ్బుపట్టి ఉంది. సాయంత్రానికల్లా బూడిదరంగు మేఘాలు ఉత్తర దిక్కున ఆవరించేశాయి. గాలి కాస్త గట్టిగా కదిలితేచాలు వాన కురిసేలా ఉంది. కనకారావు ఆందోళనతో తన బట్టలషాపులోంచి ఆకాశంవైపు చూశాడు. వాన రాకుండా ఉంటే బాగుండును. వానొస్తే ఆ వచ్చే నాలుగు బేరాలు రాకుండాపోతాయని దిగులుపడుతూ ఆ మాటే అన్నాడు షాపులో కుర్రాడు చిట్టితో. చిట్టికి మాత్రం ఆనందంగా ఉంది. వానవస్తే క్యారియర్ సర్దుకుని ఇంటికి పోవచ్చని.**

**దిగులుపడుతూనే షాపులో దీపాలు వేసిన కనకారావు ఆకాశంవైపు మళ్ళీమళ్ళీ చూశాడు.**

రావిచెట్టుకింద భద్రయ్య బడ్డీకొట్టు దాపున నిలబడి రోడ్డువైపు ఆశగా చూస్తున్న ఆమె పరిస్థితీ అదే. 'వాన రాకుండా ఉంటే బాగుండును' అనుకుంది దిగులు పడుతూనే. ఆమెకో పేరుంది. కానీ ఆ పేరు ఏనాడో మరచిపోయింది. దారిన పోయేవాళ్ళు ఆమెవైపు దొంగచూపులు చూస్తూ "అది.....ఇది... బజారు లం..." అనుకుంటూ పోతారు. బాగా చీకటి పడితేగానీ ఎవరూరారు. అయినా ఆరు గంటలకే వచ్చి నిలబడుతుంది వెలుగుచీకట్ల మధ్య. ఆమె నిలబడేచోటు కనకారావు దుకాణానికి పాతిక అడుగుల దూరంలో ఉంటుంది. ఆమె అంటే కనకారావుకి తగని జుగుప్స. అదోరకమైన ద్వేషం. ఆ నికృష్టపు బతుకు బతికేకన్నా కష్టపడి నాలుగిళ్ళల్లో పాచిపని చేసుకున్నా బతుకు నడిచిపోతుంది కదా అనుకుంటాడు. ఆ మాటే చిట్టితో అంటే 'ఆ పనేదో మనషాపులోనే ఇవ్వొచ్చు కదా షావుకారూ' అంటుంటాడు. వాడి వయసు పదిహేనే గాని బాగానే ఆలోచిస్తాడు.

"పని ఇవ్వొచ్చురా. కానీ మర్యాదస్థులెవరూ మన షాపువైపు రారు. టౌనుకి కొత్తరూపం వచ్చి, సినిమా హాళ్ళు, నగలు, బట్టల దుకాణాలన్నీ అటువైపు పోతే మన ఏరియా దిక్కుమాలినదైపోతుంది. ఇక మనకు వ్యాపారమెక్కడుంటుంది? ఈ ఏరియా మనుషులు కూడా ఏచిన్న వస్తువుకైనా అటు షాపింగ్ మాల్స్‌కే పోతున్నారాయె. షాపు నడవడమే కష్టమవుతుంటే, ఇక దీన్ని షాపులో పెట్టుకోవాలా" చెప్పేశాడు కనకారావు. ఇప్పుడు ఆ ఏరియా అనాథలా ఉంది. ఒకప్పటి వైభవం లేదు.

కనకయ్య రోడ్డువైపు చూస్తూ "వాతావరణం బాగోలేకపోయినా, వర్షం వచ్చేలావున్నా అది వచ్చేసిందిరా. అసలు దాని దగ్గర ఏముందనిరా! అసలు ఈ వాతావరణంలో ఎవడు వస్తాడని అలా గారాలు పోతూ గుడ్లగూబలా చూస్తూ నిలుచుంది" అన్నాడు రేకుల్లో బట్టలు సర్దుతున్న చిట్టితో. గాలి గట్టిగా వీచింది. అది వర్షపుగాలి. దూరంగా ఎక్కడో వాన పడుతున్న సూచన.

## కోరిక తీరిందటగా!

**త**మన్నా సినిమాల్లోకి వచ్చి చాలా సంవత్సరాలే అయింది. టాలీవుడ్, కోలీవుడ్, బాలీవుడ్‌లో చాలా మంది హీరోలతో ఆడింది, పాడింది. కాకపోతే ఒకే ఒక్క హీరోతో నటించలేదట! అదీ కోలీవుడ్‌లో విక్రమ్‌తో నటించలేదన్న బాధ ఉండేదట! అది ఇప్పుడు తీరింది. నా కోరిక తీరే సమయం వచ్చింది అంటూ చెబుతోంది తమన్నా. కోలీవుడ్‌లో విక్రమ్‌తో ఓ సినిమా చేయబోతోందట! తెలుగు, హిందీలలో ఎటూ అవకాశాలు పెద్దగా లేవు. ఇక ఉన్న ఒకే ఒక్క ఆశ కోలీవుడ్. అక్కడ విక్రమ్‌తో చేసి తన ముచ్చట తీర్చుకోబోతోందట!



"మన షాపులో ఎన్నో కొత్త వెరైటీలు, డిజైన్లు ఉన్నాయనీ, లక్షల సరుకుందనీ అనుకుని మనం ఉదయం నుంచి రాత్రివరకు గద్దచూపులు చూస్తూ, కొంగ జపం చేస్తున్నాం కదా షావుకారూ! అప్పుడెప్పుడో తెచ్చిన చీరలు, చుడీదార్లు, డ్రస్ మెటీరియల్స్ తప్ప అసలు మన దగ్గరేమున్నాయని?" వీధి వరండాలో హేంగర్సుకి వేలాడదీసిన చీరలు లోపలికి తెస్తూ అన్నాడు చిట్టి.

"ఏంట్రోయ్! పెద్ద మాటలు? దానికీ మనకీ సాపత్యమా! అదో బజారు.."

"వద్దు షావుకారూ! వద్దు. పేర్లు తేడాగానీ అందరిదీ ఒకటే బాధ. ఆకలిబాధ. దానికోసమే కదా ఇన్ని వేషాలు! కడుపులునిండినా కూడా, బుర్రలు కొట్టి, కొంపలుముంచి, లక్షలూ, కోట్లూ రాబట్టుకునే నా కొడుకుల్ని తిట్టు బాగుంటుంది. కాలే కడుపుల్ని తిడతావేం!"

"ఏంట్రోయ్. మాటలు మీరుతున్నావు. పని మానుకుని పోవాలని ఉందేంటి?"

గాలి ఒక్కసారి చెవిలో గుయ్యిమంది.

"నువ్వు పొమ్మన్నా నేను పోను షావుకారూ! మళ్ళా పాతరోజులు రావాలి. షాపు జనంతో కళకళలాడాలి. షావుకారమ్మ పోయిన వైరాగ్యంతో సంవత్సరంపాటు షాపు మూసేశావు. లేకపోతే మనమిలా ఈగలు తోలుకునేవాళ్ళమా? 'ముంబాయి పోయి కాస్త సరుకు తీసుకురా. నలుగురు ఆడగుంటల్ని షాపులోపెట్టు. అప్పుడు ఏ షాపింగ్ మాల్ మనముందు నిలుస్తాదోచూడు అని షాపు తిరిగి తెరిచిన తరువాత చిలక్కు చెప్పినట్టు చెప్పా. విన్నావా? ఉన్న ఇద్దరాడపిల్లల్నీ తీసిపారేశావు. కూతుళ్ళిద్దరికీ మనువులు చేసేశా, ఇంకా ఈ సంపాదన ఎవరి కోసం? అని వైరాగ్గం పోయావేగానీ నలుగురికి ఉద్యోగాలిద్దాం, ఆళ్ళకి తిండి పెడదామన్న ఆలోచన లేదేం షావుకారూ! మనం బతకడమే కాదు, నలుగుర్ని బతికించాలి షావుకారూ!"

**గాలివాన ఉధృతి పెరిగింది. వరండాలో మనిషి అలికిడి. పెరటితోవలో వెళ్ళి వీధివైపు చూశాడు. ఆ చీకట్లో చీరపిండుకుంటూ స్త్రీ ఆకారం. ఆమే అయివుంటుందని సందేహిస్తూ, ఎవరూ? అని గట్టిగా పిలిచాడు. తడిసి ముద్దైపోయిందామె. రేకులున్న సందులో నిలబడేందుకు ఆశ్రయమిచ్చాడు. ఎంతకీ గాలివాన తగ్గలేదు. జాలిపడి ఆమెకు అన్నంపెట్టాడు. మరి ఆ తర్వాత..? ఆ రాత్రి ఏం జరిగింది? ఆమె జీవితం ఏమైపోయింది?**

కనకారావు ఏదో మాట్లాడేలోగా ఉత్తరంవైపు నుండి గాలి రివ్వున దూసుకొచ్చింది. గాలివెంట ఏటవాలుగా పెద్దపెద్ద చినుకులు, చెట్లకొమ్మలు ఊగే శబ్దాలు, వానహోరు ఒక్కసారి విరుచుకుపడ్డాయి. షాపు మూసేయక తప్పదన్న పరిస్థితిలో చిట్టి గబగబా క్యారియర్, బ్యాగ్ సర్దుకుంటూ "నేపోతా షావుకారూ! ఈ గాలివానకి మాయమ్మకి ఆస్తమా వస్తాది. చెల్లాయి భయపడతాది. నేపోతా" అంటూ బ్యాగ్ భుజాన్నేసుకున్నాడు చిట్టి. "ఆగరా! వాన కాస్త తగ్గనీ, పోదువుగాని" అంటున్నా వినిపించుకోకుండా "ఇదిప్పుడే మొదలైంది, తగ్గేవాన కాదు, నేపోతా" అన్నాడు చిట్టి.

"అయితే ఆగు. ఆటోలో పో" అంటూ వాడి జేబులో ఇరవైరూపాయలు కుక్కి, "ఇంకా అది అక్కడే ఉందేంట్రా! ఈ వాతావరణంలో బేరాలు రావుగానీ, ఇంటికెళ్ళమని చెప్పు" అంటూంటే చిట్టి అడ్డొచ్చి "ఏంటీ! దాని దగ్గరకి నేనెళ్ళి చెప్పాలా! బక్కగా, ఎముకల పోగులావుందిగానీ, అది ఆడది కాదండీబాబు, ఆడపులి. ఓసారి నాగేసు జేబులో డబ్బులేసుకుని దానికొంపకెల్తే, చంపేసినంత పని చేసిందట బాబూ! 'సరిగ్గా మీసాలు కూడా రానివాడివి, నీకు ఆడది కావాల్సి వచ్చినాదిరా! పుచ్చిపోతావురా నా కొడకా. పో. మళ్ళీ ఈ పక్కకొచ్చినా, ఆడదాని పేరెత్తినా సంపేస్తాన్రా! సన్నాసియదవానీ' అని తిట్టిందట బాబూ. నేపోను" అంటూ ఇంటికి పరుగుతీశాడు చిట్టి.

వాడు వెళ్ళిన మరుక్షణంలోనే, పెద్దమెరుపు మెరిసింది. పెద్ద ధ్వనితో ఉరుము ఉరిమింది. గాలి పెద్దదైంది. కరంటూ పోయింది. మెరుపుల్లో ఆ వెలుగుల్లో పరికించి చూశాడు. ఎక్కడా కనపడలేదామె. వాన పెద్దదైంది.

'ఇంటికెళ్ళి పోయుంటుంది' అనుకుంటూ షాపు మూసేశాడు.

'చిట్టికిన్ని తెలివితేటలు ఎక్కడివోగానీ, నిజమే చెప్పాడు. ఏ పాటు అయినా సాపాటు కోసమే కదా! ఆమె వీధిలో ఓ మరుగున బట్టలూడదీసుకునేందుకైనా సిద్ధపడుతున్నది తిండికోసమే కదా. మరి నేనో! ఒంటిని కప్పే బట్టలు అమ్ముకుంటూ, ఫ్యాన్‌కింద మర్యాదస్థుడిలా కూర్చున్నాను, దారిన పోయేవాళ్ళని 'రండి రండి' అని పిలుస్తూ. చిట్టి అన్నట్టు షాపులో ఎన్నిలక్షల స్టాకుందని? దాని ఒంటిమీద ఎన్నిరకాల చీరలున్నాయని! రెండేగా. ఒకటి పసుపుపూల ఎర్రచీర, ఇంకోటి తెల్లపూల నల్లచీర. వయోలెట్ షిఫానుచీర ఉండేదేమో. వీధి వరండాలో వేలాడదీసిన ఆ చీరచూసి బెరుకుగా 'ఈ చీర ఎంతవుద్ది బాబూ?' అని అడిగితే తనేమన్నాడు? రెండువందల యాభై. రెండువందల నలభైకొస్తుంది' అన్నాడు.

'నా కాడ అంతలేదు బాబూ ఎనభయ్యే ఉన్నాయి. ఎనభైకి వస్తాదా?' అంటే 'నాలుగు పెద్ద రుమాళ్ళు వస్తాయి' అని ఎగతాళిగా చెప్పాడు.

ఏమీ అనకుండా తలదించుకుని వెళ్ళిపోయింది. తరువాత బాధపడ్డాడు. తన కూతుళ్ళతోగానీ, భార్యతోగానీ అలా మాట్లాడగలడా? ఈసారి మళ్ళీవచ్చి అడిగితే ఎనభైకే ఇచ్చేద్దాం అనుకున్నాడుగానీ, ఆమె మళ్ళా రాలేదు. చీరవంక చూడనూ లేదు.

గాలివాన పెద్దదైంది. కనకారావు చీకటిలో, మెరుపుల వెలుగుల్లో పరికించి చూశాడు. ఆమె ఎక్కడా కనపడలేదు. భద్రయ్య కిళ్ళీబడ్డీ మూసేశాడు. ఉన్న రెండు గూడురిక్షాలూ ఇంటిదారి పట్టాయి. షాపుకట్టేసి ఇంట్లోకెళ్ళాడు కనకారావు. షాపు వెనుకే అతని ఇల్లు. ముందు ఒకగది, దాని వెనుక ఒక పెద్దహాలు, దాని వెనుకగదిలో ఓ పక్క దేవుడి మందిరం, ఇంకోపక్క వంట. మధ్యలో డైనింగ్ టేబులు. ఆ గది దాటితే ఓ పక్క బాత్ రూము, టాయిలెట్ గది. పెరటిలోంచి వీధిలోకెళ్ళడానికి పెద్దసందు, పైన రేకులున్నాయి. వాన ఉధృతి పెరిగింది. గాలి ఈడ్చి కొడుతోంది. ఆ గాలివానలో ఊగే చెట్టుకొమ్మలు రివ్వుమంటూ హోరెత్తిపోతున్నాయి.

చార్జిలైటు వెలుగులో క్యాష్ లెక్కచూసుకుని డ్రాయర్‌లో పడేసి వంటగదిలోకి వెళ్ళాడు. ఉదయం వండుకున్న అన్నం, ఉల్లి పులుసు ఉన్నాయి. వంకాయ కూర ఉందిగానీ తినలేనంతగా మాడిపోయింది. అన్నం, పులుసు వేడి చేసుకుని బంగాళదుంపలు వేయించుకుందామని టేబుల్ దగ్గర కూర్చోబోతుంటే, వీధి వరండాలో ఎవరో ఉన్న అలికిడైంది. వానలో తడవకుండా ఉండేందుకు ఎవరో నిలబడి ఉంటారులే అనుకుని మళ్ళీ పనిలో పడ్డాడు. పడమటివైపు నుంచి వానగాలి వస్తోంది. వరండాలో ఎవరున్నా తడిసిపోతారు. ఇంకా ఎవరో నిలబడిన శబ్దం! చేస్తున్నపని ఆపి పెరటితోవలో రేకులకింద నుంచి వీధివైపు వెళ్ళాడు. నెమ్మదిగా తలుపుతీసి వీధిలోకి చూశాడు. జల్లులు జల్లులుగా కురుస్తోంది వాన. ఎవరో వానలో తడుస్తూ చీకట్లో చీరకొంగు పిడుచుకుంటూ.. ఆమే అయ్యుంటుందని అనుమానిస్తూనే "ఎవరదీ..ఎవరూ" అన్నాడు కాస్త గొంతు పెంచి.




"నేనే బాబూ! వాన తగ్గంగానే ఎల్లిపోతా" అంది చీర కొంగు భుజంమీద వేసుకుంటూ. ఆలోచనలో పడ్డాడు కనకారావు. అంత తొందరగా వాన తగ్గేలా కనిపించలేదు.

"అక్కడ బాగా వాన పడుతోందికదా, ఈ సందులోకొచ్చి రేకులకింద నిలబడు" అన్నాడు. కాని అక్కడ కూడా వాన పడుతోంది. తనూ తడిసిపోతున్నాడు. అంతలో ఓ పెద్ద మెరుపు. పిడుగేమో అన్నంత ధ్వని. భయపడి లోపలికి వచ్చేసింది. సందు తలుపు గట్టిగావేసి నిలువెల్లా తడిసిపోయిన ఆమెను చూస్తూ "బాగా తడిసిపోయావు. ఇక్కడ కాదు. పెరట్లో స్నానాలగది ఉంది. అక్కడ ఉండు. వాన తగ్గగానే వెళ్ళిపోదువు గాని" అని దారి చూపించాడు.

ఇంట్లోకి వచ్చాడుగానీ, పూర్తిగా తడిసిపోయి చలికి వణుకుతున్న ఆమె రూపమే కనకారావు కళ్ళల్లో మెదులుతోంది. పనిలో నిమగ్నం కాలేకపోయాడు. తలమీంచి నీరు కారుతూ, బట్టలు శరీరానికి అంటుకుపోయి గజగజ వణుకుతున్న ఆమెరూపమే కనిపిస్తూంటే పాతచీర ఏదైనా ఇస్తే బాగుంటుందేమో అనిపించింది. భార్య బట్టలుండే బీరువా దగ్గరకెళ్ళాడు. కానీ ఓ బజారు స్త్రీకి తన భార్యచీర ఇవ్వడం నచ్చలేదు. చివరకి కొత్తబట్టలుండే బీరువా దగ్గరకెళ్ళి ఓ చీర, లంగా వెతికి పెరటిలోకి వచ్చాడు. ఇంకా గదిముందే నిలబడి ఉంది గజగజ వణుకుతూ. "ఇవి కట్టుకో. మా షాపులో బ్లౌజులుండవు" అంటూ ఓ టవలు, చీర, లంగా అందించాడు. మెరిసే కళ్ళతో వాటిని అందుకుని స్నానాలగదిలోకెళ్ళి తలుపేసుకుంది. కనకారావు ఇంట్లోకొచ్చాడు. దుంపముక్కలు బాగానే వేగాయి. పులుసు వేడి చేస్తుంటే స్నానాలగది తలుపు తీసిన శబ్దమైంది.

తలకు తువ్వాలు చుట్టుకుని, కొత్తచీరలో గుండెపై రెండు చేతులు అడ్డంగా వేసుకుని నెమ్మదిగా వంటగదిలోకి తొంగి చూస్తూ "పానం నిలబెట్టినావు బాబూ. చలికి వణికి చచ్చిపోతానేమో అనిపించినాది. ఇది కొత్త చీరలాగుంది. ఎంత ఖరీదో, నాకాడ అంతసొమ్ము లేదుబాబు" అంది వణికే పెదవులతో.

"ఫరవాలేదు. నాకేమీ ఇవ్వక్కర్లేదు"

"ఇచ్చి పానం నిలబెట్టినారు. మీ రుణమెలా తీర్చుకునేది బాబూ. ఒళ్ళమ్ముకుని బతికేదాన్ని మీకు తెలుసుగా" అంది గది గుమ్మందగ్గర నిలబడి తలవంచుకుని.

"నేను అందుకివ్వలేదు. అది సరే టీ ఉంది తాగుతావా?"

వండుకున్నది ఇద్దరికీ సరిపోకపోవచ్చు. అందుకనే టీ ఇచ్చి వాన తగ్గగానే పంపించేయవచ్చనే ఆలోచనతో అడిగాడు కనకారావు.

తలూపి, "ఓ! తాగుతా.. ఎంత వేడైనా ఇస్తావా?" అంది నిలబడి వణకుతూనే.

"ఇస్తాను. లోపలికివచ్చి ఆ బల్లమీద కూర్చో." అంటూ ఓ చెక్క స్టూలు చూపించాడు.

ఒద్దికగా స్టూలుమీద ఓ పక్కగా కూర్చుంటూ, "వంట మీరే చేస్తున్నారు, అమ్మగారు కన్నారింటికెళ్ళారా?" అడిగింది నెమ్మదిగా.

కప్పులో వేడి టీ పోసిస్తూ, "లేదు, దేవుడి దగ్గరకెళ్ళింది. తొందరేం లేదు, నెమ్మదిగా తాగు"

"అయ్యోపాపం! ఒంటరిబతుకా. శానా కట్టమే. మగపిల్లలు వేరెళ్ళినారా? ఆడపిల్లలకు మనువులైనాయా?" అని అడుగుతూంటే చీకాకు పడుతూనే సమాధానాలిచ్చాడు. స్టవ్ కట్టేసి గిన్నెలు సర్దుతూ, గ్యాస్‌బల్ల, స్టవ్, డైనింగ్ టేబుల్ శుభ్రం చేస్తుంటే "ఏ ఆడదీ నీకు సరిపోదయ్యా. అట్ల క్లీనింగ్ జేస్తన్నవు" అంది మెచ్చుకోలుగా.

వాన తగ్గలేదు, గాలీ తగ్గలేదు. అప్పుడప్పుడు మెరుపులు, ఉరుముల శబ్దాలు ఉండుండి రేకుల శబ్దాలూ. ఓ అరగంటైనా వాతావరణంలో మార్పు లేదు. కనకారావుకి ఆకలేయసాగింది. ఎదురుగా ఒక మనిషిని పెట్టుకుని భోజనం చేయడం నచ్చలేదతనికి. చివరికి "అన్నం ఉంది తింటావా?" అని అడిగాడు.

"పెట్టు తింటా" అంది ఉత్సాహంగా. "అలాగేలే" అంటూ పాతకంచం వెతికి కూర అన్నం పెట్టి ఓగిన్నెలో వేడి పులుసు వేసిచ్చాడు. వరండా అంతా నీటిమయం. డైనింగ్ టేబుల్‌మీద ఓ పక్కగా కంచంపెట్టి తినమన్నాడు. నిలబడి తింటానన్నా వినలేదు. వేడి వేడి అన్నం కనపడగానే కంచంమీదికి విజృంభించింది. నెమ్మదిగా తిను అన్నా వినలేదు. అయిదు నిమిషాల్లో కంచం ఖాళీచేసి కంచంలో గీతలుగీస్తూ, "పులుసు బాగుందయ్యా! కూసింత పొయ్యవా?" అంది తలపైకెత్తి ముఖంమీద పడుతున్న జుత్తు పైకి తోసుకుంటూ. కనకారావుకి జాలేసింది. కొద్దిగా అన్నం పెట్టి పులుసుపోసి, కూరముక్కలు వేశాడు.

గబగబా తినేసి తృప్తిగా తలెత్తిచూస్తూ నవ్వింది. "కడుపు నింపినవయ్యా! నాలుగుదినాల ఆకలి తీరిందయ్యా! నువ్వు దేవుడివయ్యా!" అంది తను తిన్నచోట శుభ్రం చేస్తూ.

"కాదులే. ముందు కంచం శుభ్రంచేసి ఆ పక్కనపెట్టి షాపులో బల్లమీద కూర్చో. నిద్రొస్తే ఆ పొడుగుబల్ల మీద పడుకో. వాన తగ్గగానే పోదువుగానీ. నీకిక్కడేం భయం లేదు."

నవ్వి అంది. "నాకు బయమా? ఏటిపోద్దని. గుండెమీద సెయ్యేసుకుని పండుతా" అంటూ గుండె మీద చెయ్యేసుకుని "అయ్యో! నా రైక నారైక" అంటూ పెరట్లోకి పరుగెత్తి తడి ఆరని రవిక తొడుక్కుని షాపులోకొచ్చింది. చార్జిలైటు వెలుగులో ఆమె బీరువాల్లోవున్న చీరలవైపు చూస్తుంటే, కనకయ్య మిగిలిన అన్నం, పులుసు పెట్టుకుని కొవ్వొత్తి వెలుగులో భోజనం అయిందనిపించాడు.

షాపులోకొస్తూ "ఎక్కడ మీ ఇల్లు?" అడిగాడు.

"ఆ కాలువగట్ల మీదున్న కొంపల్లో ఒకటి నాది. అందులో ఉన్నోళ్ళంతా నాలాంటోల్లే. సిగ్గు శరాలుండవు ఆళ్ళకి. ఒకరి కంచం ఎత్తకపోయే రకాలందరూ. లాడ్జిలకు పోతరు. మందు తాగుతరు. మటను చికెన్లు మెక్కుతారు. ఒక్కొక్క నా కొడుకు ఒక్కొక్క రకం. నీకెందులే అయ్యన్నీ. అయ్యంటే నాకు అసియ్యం. ఛీ! రోత! నాకు ఉంటే తింటా లేకుంటే పస్తుంటా" అంది తల వంచుకుని. వెంటనే తలెత్తి., "ఈ వోనకి నా కొంప ఉంటదో లేదో, అదే నా బెంగ దేవుడా! నా కొంప ఉంటదంటవా?" అడిగింది.

"ఉంటుందిలే! షాపులో పడుకో. నేను ఖర్చు పద్దులు రాసుకోవాలి" అంటూ చార్జిలైటుతో వంట గదిలోకెళ్ళాడు. ఆమె చీకటిలో మిగిలిపోయింది. కనకారావుని  చూస్తూ, 'ఈ షావుకారు మంచోడేనా? మంచిగా ఉంటా అర్ధరాతిరి మీదకొస్తాడా? ఏమో! మగాడు మగాడే, కావాలంటే తనురాదా!' అనుకుంటూ నిద్రకొరిగింది.

కనకయ్య క్యాష్ లెక్కచూసి బ్యాగ్‌లో వేసుకుని, తలుపులన్నీ గట్టిగా తాళాలు వేసుకోడానికి షాపులోకి వచ్చాడు. చార్జిలైటు వెలుగులో ఆమెను చూస్తే జుగుప్స కలిగింది. బోరవిడిచి వెల్లకిలా పడుకుంది. జుత్తు ముఖంమీద ఓ పక్కగా విస్తరించి ఉంది. కాళ్ళు బారజాపుకుంది. చీర మోకాళ్ల దాటిపోయింది.

"ఏయ్! ఓ పక్కకు తిరిగి సరిగాపడుకో. లేకపోతే పీడకలలొస్తాయి" అన్నాడు బల్లమీద చప్పుడు చేస్తూ. పిలవగా పిలవగా నెమ్మదిగా కళ్ళు తెరచి, "అయిపోనాదా! పైసలు ఆ బల్లమీద పెట్టిపో! ఒళ్ళు పుండైపోనాదికదరా సచ్చినోడా" అంటూ పక్కకు తిరిగింది. కాళ్ళు ముడుచుకుని, చేతుల్ని కాళ్లమధ్య ఉంచుకుని నిద్రకొరిగింది.

'ఛీ! కుక్క కుక్కే!' అనుకుంటూ తన గదిలో కొచ్చి నడుం వాల్చాడు కనకారావు.

'వాన కాస్త తగ్గగానే దీన్ని దీని కొంపకు పంపించేయాలి. నేరకపోయి ఇంట్లోకి రానిచ్చాను' అనుకుంటూ నిద్రలోకి జారాడు. అలా ఎంతసేపు నిద్రపోయాడో ఇంతలో మెలకువ వచ్చింది. కరెంటు వచ్చినట్టుంది. ఇంటినిండా దీపాలు వెలుగుతున్నాయి. ఫ్యాన్లు తిరుగుతున్నాయి. దిగ్గునలేచి దీపాలు, ఫ్యాన్లు ఆపుతూ షాపులోకి వచ్చాడు. ఫ్యానుకింద ఆమె మూలుగుతూ వణకుతోంది. 'అయ్యో! చలి వేస్తోంది కాబోలు' అనుకుంటూ దుప్పటి వెతికితెచ్చి కప్పుతుంటే ఆమె శరీరం వేడిగా తగిలింది. నుదుట తాకి 'అయ్యో! జ్వరమొచ్చినట్టుంది' అనుకుంటూ ఫ్యాను ఆపి! తన మందుల పెట్టెలోంచి టాబ్లెట్‌తీసి "ఏయ్! లే, లేచి ఈమాత్ర వేసుకో" అంటూ పిలిస్తే నెమ్మదిగా కళ్ళు తెరచి లేచి "సలి సంపేస్తన్నాది దేవుడా" అంటూ కనకారావును గట్టిగా పట్టుకుంది. ఒళ్ళు కాలిపోతోంది. కళ్ళు నిప్పుకణికల్లా ఉన్నాయి. "ఈ మాత్ర వేసుకో తగ్గిపోతుంది" అంటూ పడుకోబెట్టి రెండు దుప్పట్లు కప్పాడు. మాత్ర ప్రభావం వల్లనేమో నిద్రలోకి జారుకుంది. వాచీ చూశాడు. రెండైంది. కనకారావుకు నిద్ర రాలేదు.

"దీన్ని ఇంట్లోకి రానిచ్చి పొరపాటు చేశానా? ఇది ఎలాపోతే నాకేం! ద్వేషించే దానిపై ఎందుకీ కనికరం. అయిపోయిందేదో అయింది, ఉదయాన్నే ఈ జిడ్డుని దాని కొంపకు పంపేయాలి" అనుకుంటూంటే నిద్ర పట్టేసింది. మెలకువ వచ్చేసరికి ఆరైపోయింది. సన్నగా వానజల్లు.. గాలి తగ్గింది. వీధిలో పల్చగా జనసంచారం.

షాపుతెరిచే వేళవుతుంటే వెంటనే ఆమె గుర్తుకొచ్చింది. తన మంచంకిందవున్న పొట్టికాళ్ల మంచాన్ని బైటకిలాగి, దులిపి, పక్క సరిగ్గాపరిచి షాపులోకి వచ్చాడు. జ్వరం తగ్గినట్టుంది. వెల్లకిలా పడుకుంది. "లే!లే!" అంటూ బలవంతంగా లేపి "లోపల పడుకో, కస్టమర్లు వస్తారు" అంటూ మంచం చూపించాడు. "రేత్రంతా ఈడనే పండినానా!" అంది.

"ఔను. మా చిట్టి రాగానే నీ ఇంటికి పంపిస్తాను. కాసేపు లోపల పడుకో" అన్నాడు.

మాటల్లోనే వచ్చాడు చిట్టి. "షావుకారూ నేనీ పొద్దు రాను. మా యమ్మకి ఆస్తమా. చెల్లిని నేనే చూసుకోవాలి" అంటూ.

"అలాగేలేరా" అంటూ రాత్రి జరిగిందంతా చెప్పి "దీన్ని రిక్షాలో తీసుకెళ్ళి దానికొంపలో దించిరారా" అన్నాడు.

"దీని కొంప ఏడున్నది షావుకారూ. కాలువ పొంగి పల్లంలో కొంపలన్నీ మునిగిపోతేనూ!"

"మరెలాగురా?"

"ఈ పొద్దు ఆగు షావుకారూ! రేపు నీరు తగ్గుతాదేమో నేనే దీన్ని తీసుకుపోయి దింపుతా"

"సరే మరి. ఇంతకీ మీ అమ్మ ఎలాగుంది? ఈ వంద ఉంచుకో" అంటూ చిట్టిని పంపించి లోపలికి వచ్చేసరికి మంచంమీద కూర్చునివుంది.

"కాలువ పొంగినాదా? నా కొంప మునిగిందా? ఎట్టారా దేవుడా?" అంది తల పట్టుకుని.

"నీరు తగ్గనీ వెళ్దువుగానీ. జ్వరం తగ్గిందా? కాఫీ ఇస్తా. మాత్ర కూడా ఇస్తాను. వేసుకుని పడుకో"

"నువ్వు మంచోడివి దేవుడూ! నేనే చెడ్డదాన్ని. నీ సేత పనులు చేయించుకుంటున్నా. అంటగిన్నెలేమైనా ఉంటే పడెయ్. ఇల్లు తుడిచి, గిన్నెలు కడిగిపెడతా!"

"ఆ పనులన్నీ అయ్యాయిగానీ, నీకు జ్వరం తగ్గలేదు. మాత్ర వేసుకుని పడుకో" అంటూ మాత్ర, కాఫీ ఇచ్చాడు.

ఆ రోజంతా పడుకునే ఉంది. సాయంత్రానికి వాతావరణం మామూలుస్థితికి వచ్చింది. చిట్టి మధ్యాహ్నం డ్యూటీలో చేరాడు. కనకారావు తన ఇంటి డాక్టర్ని పిలిచి మందులు రాయించాడు. మందులచీటి అందిస్తూ, "ఇది నీ ఇంట్లోకి ఎలా వచ్చింది? జాగ్రత్త. నువ్వా ఒంటరి వాడివి. ఏ క్షణం ఎలా ఉంటుందో తెలీదు. రెండు మూడు రోజులు మందులువాడు. జ్వరం తగ్గుతుంది. తగ్గగానే పంపించెయ్" సలహా ఇచ్చాడు డాక్టరు.

సాయంత్రం చిట్టి కాలువగట్టుకెళ్ళి చూసి వచ్చాడు. "వీళ్ళ కొంపలన్నీ కూలినై. ఒక్క వస్తువూ లేదు. ఎవరో ఎత్తకపోయారు"

"నేనేడ పోయేదిరా దేవుడా!" అంటూ తల పట్టుకుంది.

"జ్వరం పూర్తిగా తగ్గనీ. ఏదో దారి కనిపిస్తుంది లే" ధైర్యం చెప్పాడు.

డాక్టరు చెప్పినట్టు జ్వరం తగ్గింది. తిండి ఒంట బట్టింది. కళ్ళలో మెరుపులొచ్చాయి. సత్తువ రాగానే ఇల్లు తుడవడం, గిన్నెలు తోమడం,




## ఆపకు నీ పయనం



నిశీథి నీ మీదకు తరుముకొస్తున్న వేళ
నిశ్శబ్దంగా తప్పుకో!
నిలబడి పోరాడాలని తలచేవో
నిన్నే మింగేస్తుంది అది!
అజ్ఞానం ఎదురైనప్పుడల్లా
అవరోధాలు తప్పవు!

మేఘం అడ్డం రాగానే
సూర్యకాంతికి తెరపడదా!
గుడిలో దీపం లేదని
గుడిని దాటి వెళ్లిపోకు
దీపం పెట్టే వ్యక్తిగూడ
మనిషేనని మరిచిపోకు
ఆశయ సాధనకోసం
ఆకాశం వైపు చూస్తే

శూన్యం నుండి దొరికేది
శూన్యమే!
అనుకున్నది సాధించేదాక
ఆపకు నీ పయనం
నీదంటూ ఒక రోజు
ఉండునులే ముందుముందు

-కోదాటి అప్పారావు
సెల్:99590 29216

కూరలు తరగటం బట్టలు ఆరేయడంలాంటి చిన్న చిన్న పనులు చేస్తోంది. కనకారావే ఇద్దరికీ వంట చేస్తున్నాడు. తనతోపాటు కాఫీ, టీ ఇస్తు న్నాడు. అప్పుడప్పుడు ఇడ్లీ, పండ్లు తెప్పించి పెడుతున్నాడు. బాగానే తేరుకుంది.

అలా అయిదురోజులు జరిగిపోయాయి. ఆ మర్నాడు రాత్రి, చిట్టి ఇంటికెళ్లిపోతూ రహస్యంగా, "షావుకారూ! చుట్టుపక్కల జనం అనుకుంటు న్నారు, నువ్వు దాన్ని ఉంచుకున్నావా?"

కనకయ్య గతుక్కుమన్నాడు. "అదేం మాటరా?"

"అవును షావుకారూ నన్ను పిలిచిమరీ అడుగుతున్నారు."

"నువ్వు నమ్మకు నిజంకాదు. మనింట్లోకి అదెందుకు వచ్చిందో నీకు తెలియదా?"

"తెలుసు షావుకారూ? వింటూంటే నాకే దుక్కమేస్తున్నాది" అందుకే అడిగా.

ఆరాత్రి కనకారావుకి సరిగ్గా నిద్రపట్టలేదు. ఒకేగదిలో పక్కపక్క మంచాల మీదుంటే, నిజమే వాళ్ళన్న దానిలో తప్పేముంది? నిజం ఎవరికి




తెలుస్తుంది?

ఎవరు చెప్పారో ఏమిటో ఆ మర్నాడు ఉద యమే టౌన్‌లోవున్న కనకయ్య చిన్నకూతురు వచ్చి హడావుడిగా తండ్రిని గదిలోకి లాక్కెళ్ళింది. "నువ్వు చేరదీశావని జనం అనుకుంటున్నది, ఆ ఇల్లు తుడుస్తున్నదేనా?" తండ్రిని అడిగేసింది.

"నువ్వు ఏమంటున్నావో అర్థం కావడంలేదు."

"ఉంచుకున్నావని అంటే బాగోదని అలా అన్నాను. ఏం? అదంత అందంగా ఉందా?"

"అదేం కాదు అమ్మలూ!" అంటూ గాలివాన నాటి రాత్రి జరిగిందంతా చెప్పాడు.

"ఇప్పుడది బాగానే ఉందిగా. ఇంకా దానికేం రోగం? పంపించెయ్. ఆలస్యంచేస్తే ఇక్కడే సెటిలై పోతుంది."

"పంపించేయాలనే నాకూ ఉంది. కాని ఎక్క డికి పంపాలో తెలియకుండా ఉంది"

"దానికింత ఆలోచనేంటి? ఎక్కడినుంచి వచ్చిందో అక్కడికే పోతుంది"

"ఆ మురికి కూపంలోకా?"

"పంది బురదలోకి కాక మరెక్కడికి పోతుంది? కుక్కని బంగారు సింహాసనంమీద కూర్చోపెట్టినా అది చెప్పులవైపే పోతుందని నువ్వే చెప్పేవాడివి కదా"

"అలా అని నిన్ను వదిలేశానా? బట్టలు, నగలు, డబ్బు పట్టుకుని రైలెక్కి నువ్వు పారిపోలేదూ? ఆ దగుల్బాజీ గురించి విన్నాను కాబట్టి, నా పర పతి, డబ్బు ఉపయోగించి నిన్ను లాడ్జి గదిలోంచి బలవంతంగా లాక్కొచ్చి ఓ పదిరోజుల్లో మంచి సంబంధం తెచ్చి పెళ్ళి చేశానా లేదా? నిన్ను అలా వదిలేసి ఉంటే నీ బతుకేమయ్యేది? నీలాగే ఆమె కూడా ఓ మగాణ్ణి నమ్మింది. నేను నిన్ను రక్షించుకో గలిగాను. కాని ఆమెను ఎవరూ రక్షించలేకపో యారు. ఆమె మురికికూపంలో పడిపోయింది నిజమే. కాని మంచిదార్లోకి తీసుకురావడం మన బాధ్యత. సాయం చేయగలిగితే చెయ్యి. అంతే గానీ రాళ్ళు రువ్వకు. ఆమెకు ఎలాంటి మంచి దారి చూపించాలా? అని ఇన్నాళ్ళూ ఆలోచిస్తున్నాను. నువ్వు రావడంతో నాకు ఆ దారి కనబడింది. ఆ మధ్య మీ ఏరియాలో పనిమనుషులు దొరకడం లేదని ఫోన్లో చెప్పావుగా! ఇప్పుడు ఈమెని తీసి కెళ్ళి నీ ఇంట్లో పనిలో పెట్టుకో. ఓ నాలుగిళ్ళు చూపించు. తన బతుకు తను బతుకుతుంది."

గతుక్కుమంది చిన్నమ్మాయి. "ఏంటన్నావు? ఈ వగలాడిని నాఇంట్లో పనిలో పెట్టుకోవాలా? నేను హాయిగా బతకడం నీకిష్టంలేదా నాన్నా? నా ఇద్దరు కొడుకులు 9, 10 తరగతుల్లో ఉన్నారు. ఇక మా ఆయన నా మొగుడు మాత్రమే కాదు, మగాడు కూడా. ఎన్ని కళ్ళు పెట్టుకుని వీళ్ళం దర్నీ కాపాడుకోను! అది అక్కడ దుకాణం తెరవ దని గ్యారంటీ ఏంటి? అది జరగని పని. వీల యితే మా ఇంటి పనులకి పదకొండు పన్నెండేళ్ళ వయసున్న ఆడపిల్లను పంపించు."

"చిన్న పిల్లల్ని పనుల్లో పెట్టుకోకూడదని నీకు తెలీదా? చిన్నపిల్లయినా ఆడపిల్లేగా."

"మరి నా ఇంట్లో అందరూ మగ పురుగులేగా?"

"నా బాధలేవో నే పడతానుగానీ, ముందు నువ్వు దాన్ని పంపించెయ్. ఇక్కడ ఉంచకు. ఇది ఈ ఇంటిని వదిలిన తరువాతే నేను మళ్ళీ వస్తాను" అంటూ విసవిసా వెళ్ళబోతుంటే "అమ్మాయి గారూ వెళ్ళిపోకండి. నేనిక్కడ ఉండను. మీతోనే వచ్చేస్తాను. మీ అపార్టుమెంటుకింద నాకొక చిన్నగదైనా చూపించండి. ఒక కుట్టుమిషను పాతదైనా ఇప్పిస్తే, మీ బట్టలు, పిల్లల బట్టలు, అందరివీ కుట్టిపెడతాను. నాకు ఎంబ్రాయిడరీ, జిగ్‌జాగింగ్ కూడా వచ్చు. ఈసాయం చేస్తే మీ రుణం అణాపైసలతో సహా తీర్చేస్తాను. నన్ను మీ అందరిలా బతకనియ్యండమ్మా! మీకు పున్నె మొస్తది. ఆ పాత బతుకు నాకొద్దమ్మా" అంటూ కాళ్లమీద పడబోయింది.

"లేవే కుక్కా! ఏంటే? నువ్వూ మాలాగా బతికే స్తావా? అందరి బతుకులూ ఇంకా చెడగొట్ట డానికే..!"

"అమ్మా! నేనెవరి బతుకులూ చెడగొట్టలేదు. హాయిగా టైలరింగ్ చేసుకుంటూ బతుకుతున్న నన్ను నీవు ఇంతదానివి, అంతదానివనిచెప్పి ఎగరేసుకుపోయి, అవసరం తీరిపోగానే నన్ను గిరాటేసింది ఒక మగాడేనమ్మా! ఇంటికి పోలేక, వేరే గతిలేక సిగ్గు విడిచి..."

చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తుంటే... "ఇప్పుడు తెలిసిందికదా! నువ్వు ఎక్కడికెళ్ళాలో... నాన్నా, ఇది ఈ ఇంట్లో ఉన్నంతకాలం నేనీ ఇంటి గడపతొక్కను" అంటూ విసవిసా వెళ్ళిపోయింది చిన్నమ్మాయి.

చిట్టి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఒసేయ్! ఏడవకే! మా ఇంటికి రాయే. మా ఇంట్లో నీకే బయంనేదు. మా యమ్మ, సెల్లి ఉంటారు. మాకున్నదే కలిసితిందాం" అన్నాడు.

కనకారావు గుండె కరిగిపోయింది. చిట్టికి ఉన్న మనసు తనకులేదని బాధపడుతూ, "ఒరేయ్! చిట్టీ, నువ్వు గొప్పోడివిరా. గొప్పోడివి. నీపాటి సాయం నేను చేయలేనంటరా! ఒసేయ్! అమ్మాయి, నీకు దారి కనిపించింది. ఎవరు ఏమైనా అను కోనీ! నీ విద్యే నీకు రక్ష. ఆ కుట్టు మిషనేదో నేనే కొనిస్తా. ఇంకా ఏం కావాలో అన్నీ ఇస్తాను. మా మేడమీద గదిలో టైలరింగ్‌షాపు పెట్టుకో. నీలాంటి ఇద్దరు ముగ్గుర్కైనా విద్యనేర్పు. అవసరం వున్న వాళ్ళే నీ దగ్గరకి వస్తారు. ఒకప్పుడు నిన్నుచూస్తే అసహ్యం, చులకనభావం ఉండేవి. చీకటిమాటున ఒళ్ళు అమ్ముకుంటున్నావన్నదే ఆ భావాలకు కారణం. జీవితంలో నువ్వు నిలబడు. నలుగుర్ని నిలబెట్టు. నాకంతే చాలు. నీ పేరేమోగాని నిన్ను నేను ఇకనుంచీ పావనీ! అంటాను పావనీ.." అన్నాడు ఆదరంగా.

"దేవుడూ! నువ్వు నిజంగా దేవుడివే దేవుడూ" అంటూ కనకారావు కాళ్లమీద పడింది పావని.

"నువ్వు బాగుపడు, నీలాంటివాళ్ళకి దారి చూపించు అనిచెప్పి, నువ్వు ఎందరికో బతుకు నిచ్చావు షావుకారూ" అన్నాడు చిట్టి, కనకారావు కళ్ళల్లోకి చూస్తూ.

"నిజం చెప్పావురా చిట్టీ. నువ్వన్నట్టు షాపులో కొత్త సరుకు తెప్పించి పెడతాను. నష్టమైనాగానీ, షాపులో ఉద్యోగాలిచ్చి నలుగురికి తిండి పెడ తాను. మనషాపు మునపటిలా కళకళలాడాలి. పాతరోజులు తిరిగి వస్తాయి. మనం ముందుకే వెళదాం. ఆమార్పు మనమే తెచ్చుకోవాలి. మనం బండరాళ్ళం కాదు. లే! పావని" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు కనకారావు.

పావని పైకిలేస్తూ తలమీద పడ్డ అశ్రువులు తుడుచుకుంటూ తృప్తిగానవ్వి హాయిగా ఊపిరి తీసుకుంది.

**సెల్: 7675000279**




# నీటిమీద నడిచే రోజులొచ్చాయ్!

పూర్వం స్వాములు కొందరు నీటిమీద నడిచి తమ మహత్తు నిరూపించుకునేవారని వినే వాళ్ళం. నీటిమీద నడవాలంటే ఇప్పుడు స్వామీజీయే కానవసరంలేదు. సాధారణ మనిషి కూడా నడిచేయొచ్చు. ఔను! పెరిగిన సాంకేతిక పరిజ్ఞానం నీటిమీద నడకను సుసాధ్యం చేసింది. చైనాలోని ఒక నదిమధ్యలో ఇలాంటి ఫ్లోటింగ్ పాత్ నిర్మించి గిన్నిస్ రికార్డు సృష్టించారు.

చైనాలోని హాంగ్షయ్ నదిమధ్యలో నీటి ఉపరితలం మీద వలయాకారంలో ఈ బాట నిర్మించారు. నేల మీద నడిచినట్లుగానే ఇక్కడ నీటిమీదనుండి నడిచివెళ్ళవచ్చు! 50 కిలో మీటర్లపైనే ఉంటుందీ బాట. నీటి కదలికల్ని బట్టి పైకి కిందకు కదలటం దీని ప్రత్యే కత. దీనివల్ల ఆ దారిపై వెళ్లేవారికి అచ్చం నీటిమీద నడుస్తున్న భావన కలుగు తుంది.

అంతేకాదు పిల్లలకోసం రకరకాల ఆటబొమ్మలు ఏర్పాటు చేశారు. అతిపొడవైన కదిలే నడక బాటగా దీనికి గిన్నిస్ రికార్డు దక్కింది.



# కేకలు పెట్టాల్సిందే!

ఝూమ్మంటూ దూసుకుపోయే ఆ రోలర్ కోస్టర్ ఎక్కాలంటే ధైర్యే సాహసే అనుకోవాల్సిందే! వామ్మో అంటూ కేకలు పెట్టా ల్సిందే! ఎందుకంటే ప్రపంచంలోనే అత్యంత ఏటవాలు రోలర్‌కోస్టర్ అది. కానీ అదెక్కి ఎంజాయ్ చేయాలంటే జపాన్ వెళ్ళాల్సిందే.

జపాన్‌లోని ఫుజియోషిడా యమనషిలో ఉందీ రోలర్‌కోస్టర్. దీనిపేరు తక బిష. అంటే ఎంతో ఎత్తులో గాల్లో తేలే కారు అని అర్థమట. ప్రపంచంలోనే అత్యంత ఏటవాలుగా తిరిగే స్టీపెస్ట్ రోలర్‌కోస్టర్‌గా పేరుపొందింది. కారులో కూర్చోగానే గంటకు వంద కిలోమీటర్ల వేగంతో దూసుకుపోతూ, ఏకంగా 121 డిగ్రీల కోణంలో తిరుగుతూ హఠాత్తుగా పైనుంచి కిందకు పరుగులు పెడు తుంది. ఏడు పెద్ద పెద్ద మలుపులు తిరుగుతూ నిమి షాల్లో రైడ్ పూర్తిచేస్తుంది. మరి ఈ రోలర్ కోస్టర్ ఎక్కాలంటే గుండెలు చిక్కబట్టుకోవాల్సిందే కదూ!



# రెగ్యులర్ అతిథి

ఇంటికి అనుకోని అతిథులు వస్తే అంతా హడావుడే! ఏం పెట్టాలా? ఏం చేయాలా? అని ఆలోచిస్తుంటారు. కానీ నార్వేలోని ఓ ఇంటికి మాత్రం మూడేళ్ళుగా అనుకోని అతిథి రోజూ ఉదయం, సాయంత్రం వచ్చి ఆ ఇంటావిడని పల కరించి పోతుంది. ఆమె పెట్టే కుకీస్ తింటుంది. ఆ అనుకోని అతిథి ఎవరని అనుకుంటున్నారా? అయితే చదవండి.

నార్వేలోని ఆర్లాండ్‌లో వృద్ధురాలు మెట్టె క్వామ్ తన భర్తతో నివసిస్తోంది. ఆ ఇంటికి పెద్దగా అతిథులెవ్వరూ రాకపోయినా, మూడేళ్లుగా ఓ జింక మాత్రం రోజూ ఉదయం, సాయంత్రం రెండుసార్లు ఆహ్వానించకపోయినా వచ్చివెళు తుంది. వృద్ధురాలు పెట్టే కుకీస్ తిని, పక్కనున్న అడవిలోకి వెళ్ళిపోతుంది. ఆ జింకకు 'ఫ్లిప్పెన్' అని పేరు కూడా పెట్టింది మెట్టె.

కేవలం శీతాకాలంలోనే ఫ్లిప్పెన్ ఆమె ఇంటికి వస్తుంది. ఎండాకాలంలో ఆ జింక వేరే ప్రాంతా నికి వలస పోతుందట. అలా ఏటా నవంబర్ నుంచి ఏప్రిల్ మధ్యలో ఫ్లిప్పెన్ రోజూ ఉదయం సాయంత్రం మెట్టె ఇంటి వంటగది కిటికీ వద్దకు వచ్చి అరుస్తుంది. వచ్చిన అతిథికి మెట్టె రుచికర మైన కుకీస్ పెట్టి పంపిస్తుంది. ఈ సన్నివేశం చూసేందుకు స్థానికులు తెగ ఆసక్తి చూపుతుం టారు.

జంతువు, పక్షి, తేనెటీగ... ప్రకృతిలో నివసించే ఏ జీవి అయినాసరే వాటికి అపకారం తలపెడితేనే తిరగబడ తాయి. వాటి జోలికి పోనంతవరకూ ఎలాంటి హానీ చేయవు. ఇదే విషయం నిరూపించేందుకు ఓ వ్యక్తి తేనెటీగలకు ఆవాసం కల్పిస్తున్నాడు. ఎక్కడనుకుంటున్నారు? తన గడ్డం మీద! నిజమేనండీ...

ఈజిప్టుకి చెందిన మహ్మద్ హగ్రస్ తన గడ్డాన్నే తేనెటీగలకు ఆవాసంగా మార్చాడు. గడ్డంపై ఆడ తేనెటీగల హార్మోన్లను పూసుకొని, మగ తేనెటీగలను ఆకర్షిస్తూ, వాటిని తన గడ్డం మీదే పెంచుతున్నాడు. అన్ని తేనెటీగలు అతని గడ్డంమీద వాలుతున్నా, ఏ ఒక్కటీ అతన్ని కుట్టవు. వాటికి హాని కలిగిస్తేనే అవి ప్రతిదాడి చేస్తాయితప్ప, వాటినిచూసి భయపడాల్సిన పని లేదంటున్నాడు ఈ ప్రకృతి ప్రేమికుడు. ఈజిప్టు

# భలే ఆవాసం!



ప్రజలకు తేనెటీగలపై అవగాహన కల్పిస్తూ, జీవ వైవిధ్యం మనుగడ సాగించాలంటే ఇవి ఎంత ఉపయోగకరమో, ఆహారోత్పత్తి ప్రక్రియలో వాటి పాత్ర ఎంతో కీలకమంటూ ప్రచారం చేస్తున్నాడు హగ్రస్.



# అమ్మకానికో ద్వీపం

ప్రతి ఒక్కరూ ఆన్‌లైన్ షాపింగ్‌వైపే మొగ్గు చూపుతున్నారు. చిన్న చిన్న వస్తువులే కాదు, ఎలక్ట్రానిక్స్ గృహోపకరణాలు సహ అన్నిరకాల వస్తువులను ఆన్‌లైన్‌లోనే ఆర్డర్ చేసేస్తున్నారు. సెకండ్‌సేల్స్ కూడా ఆన్‌లైన్‌లోనే జరిగిపోతున్నాయి. ఇటీవల ఓ పెద్దమనిషి ఒక ద్వీపాన్ని ఈబేలో అమ్మకానికి పెట్టాడు.

కరీబియన్ సముద్రతీరంలోని బెలైజ్ దేశ పౌరుడొకరు ఆ దేశ తీరప్రాంతంలో ఉన్న నాలుగు ఎక రాల వర్జీనియా కాయే అనే ప్రైవేట్ ఐలాండ్‌ను ఈబేలో అమ్మకానికి పెట్టాడు. ఆ ఐలాండ్‌లో కలపతో చేసిన ఎన్నో కళాఖండాలు ఉన్నాయట. అలాగే ఓ ఇల్లు, చుట్టూ పచ్చని చెట్లతో ఎంతో సుందరంగా ఉంటుం దట. ఐలాండ్ చుట్టూ డాల్ఫిన్స్ కూడా కనిపిస్తా యని పేర్కొన్నాడు. అందులో సోలార్‌విద్యుత్, జన రేటర్ ఉన్నాయట. బిడ్ ప్రారంభించి... ఎవరు ఎక్కువ ధర ఇస్తే వారికే ఇస్తానంటున్నాడు. ఇది అత్యంత సుందరమైన ప్రదేశం కూడానట!

-నర్మద వాసిరెడ్డి

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**'ఇన్నిమాటలు మాట్లాడిన తర్వాత ఆ ఒక్కమాటను గురించి చెప్పుకోకపోవటం మంచిగా ఉండదు. అదేమిటో చెప్పండి' చిరునవ్వుతో అన్నది పిచ్చమ్మి.**

**'తల్లీ.. పనిగట్టుకుని మీకు ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదనే అనుకుంటున్నాను. పూనకాలు, చిత్తభ్రమలు ఇవన్నీ మన సాంప్రదాయాలు చెప్పిన పురాణకథలలో నుంచి వచ్చాయి. కంటికి కనిపించని దేవతలు తమ కంఠాలను, మనల్ని ఉపయోగించుకుని వినిపించటమే అది" అన్నాడు డాక్టరు.**

'అయితే అవి నిజం కాదంటారా?' సూటిగా అడిగింది ఆమె.

'కంటికి కనిపించే కారణాలను మాత్రమే ఒప్పుకునే ఈనాటి వైజ్ఞానికశాస్త్రం అవి నిజం కాదనే అంటున్నాయి. అపోహలనే చెపుతున్నాయి'.

'శాస్త్రాలను పక్కనపెట్టండి. మీ అభిప్రాయం ఏమిటి?'

'దేవుడిని నమ్ముతాను తల్లీ... కంటికి కనిపించని ఏదో అతీతశక్తి మనల్ని నడిపిస్తూ ఉంటుందని నేను విశ్వసిస్తాను. కాబట్టి వాటి విషయంలో నేను ఖచ్చితమైన అభిప్రాయాన్ని వెల్లడించలేను'.

'అయితే ఇప్పుడు ఏం చేయదలచుకున్నారు?'

'మూడు మాత్రలు ఇస్తాను తల్లీ... రోజుకొకటి చొప్పున మూడురోజులు వేసుకోండి. నాలుగో రోజున మీ అభిప్రాయం చెప్పండి'.

'మాత్రలు ఇవ్వటమే తప్ప మీరు నా పరిస్థితికి కారణాన్ని విశ్లేషించలేకపోతున్నారు' నవ్వుతూ అన్నది పిచ్చమ్మి.

"మన మెదడు ఒక మహాయంత్రం వంటిది తల్లీ! ఎక్కడో ఏదో ఒక మూల ఏదో చిన్న పార్టు తుప్పుపట్టటమో, పాడయిపోవటమో జరిగినప్పుడు కొన్ని కొన్ని విచిత్రమైన విషయాలు బయటికి వస్తాయి. పాడయిపోయిందని అనుకుంటున్న భాగాన్ని సరిచేద్దాము. మిగిలిన మాటలు తర్వాత మాట్లాడుకుందాము".

రెండు క్షణాలు ఆలోచించి తల ఊపింది పిచ్చమ్మి. ఆ తరువాత తాత్సారం చెయ్యలేదు ఆ డాక్టరు. తనతో తీసుకువచ్చిన బ్యాగ్‌లో నుంచి మూడు టాబ్లెట్స్‌ని తీసి ఆమెకు అందించాడు. 'రోజుకు ఒకటి మాత్రమే... మూడు రోజుల పాటు' మరో సారి స్పెసిఫిక్‌గా చెప్పాడు.

ప్రత్యూషకి సైగచేసింది పక్కనే కూర్చుని ఉన్న ప్రణవి. వెంటనే ఆ మాత్రలను తను తీసుకున్నది ఆమె, 'నా దగ్గర ఉంచుతాను. రాత్రికి పడుకోబోయే ముందు మీకు ఇస్తాను' అంటూ.

'గుడికి పోయి వస్తానని చెప్పి వెళ్ళిన నా మనిషి ఏమై పోయాడో తెలియటం లేదు. మీకేమైనా

### జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠలరెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో పఠాన్‌తోపాటు బసవప్పను చూస్తాడు వెట్టి. సమయం చూసుకుని అందరినీ చావమోదుతాడు. ఆలయంలో పిచ్చిపూజారి ద్వారా కొన్ని విషయాలు తెలుసుకుంటాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించటానికి వెళతాడు వెట్టి. ఆ ఇంటి ఇల్లాలి తమ్ముడి ద్వారా ఒకప్పుడు బాజిరెడ్డికి సన్నిహితుడైన వ్యక్తిని కలుసుకుంటాడు. అతని ద్వారా చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు. విషయం తెలుసుకున్న బసవప్ప మనుషులు వెట్టి కోసం బయలుదేరుతారు. చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకున్న వెట్టి అడవిదారి గుండా నిష్క్రమిస్తాడు. పిచ్చమ్మిని చూడటానికి సైకియాట్రిస్ట్‌ని తీసుకుని వస్తాడు పెద్ద డాక్టరు.

ఆ తర్వాత...



ఐడియా ఉన్నదా డాక్టరుగారూ?' పెద్ద డాక్టర్‌ని అడిగింది పిచ్చమ్మి.

'అమ్మా! అతన్ని గురించి మాకంటే మీకే బాగా తెలుసు. మీరు చెపితే వినటానికి మేము సిద్ధంగా ఉన్నాము' అంటూ కుర్చీలో నుంచి లేచాడు అతను. 'మరి మేము వెళ్ళి వస్తాము తల్లీ. అవసరం అయితే ఫోన్ చెయ్యండి. చిటికెలో వచ్చి వాలుతాము' అంటూ ద్వారం వైపు కదలబోతుండగా, కాఫీ గ్లాసులతో వచ్చింది శివారెడ్డి భార్య.

'అప్పుడే వెళ్ళిపోతున్నారేమిటి? అయిపోయిందా మాట్లాడటం?' ఆశ్చర్యంగా అడిగింది.

'ఎప్పుడో అయిపోయింది తల్లీ. గంటలు గంటలు కూర్చుని అదేపనిగా డిస్కషన్ పెట్టుకోవటానికి ఇక్కడ ఉన్న సమస్య ఏమంత పెద్దది కాదు. మా డాక్టర్లతో పనిలేకుండానే ఈ తల్లి తన సమస్యను తనంతట తనే మూడు వంతులు పరిష్కరించుకున్నది. మిగిలిన ఒక వంతు గురించి మూడు మాటల్లో డిసైడ్ అయిపోయింది' అంటూ కాఫీని సిప్‌చేయటం మొదలుపెట్టాడు డాక్టర్.

'ఎంతోకాలం నుంచీ ఒకదాని వెనుక ఒకటిగా వచ్చిపడుతున్న ఇబ్బందుల్ని తలుచుకుని బాధ పడుతూ ఉండడంతోనే రోజులు గడిచిపోతున్నాయి. ఇంతకాలం తర్వాత రెండు మంచి మాటలు చెవుల పడ్డాయి. చాలా సంతోషంగా ఉంది' అన్నది శివారెడ్డి భార్య.

డాక్టరుగారు, శంకరయ్య, ప్రణవి, ప్రత్యూష అందరూ ఒకేసారి పిచ్చమ్మి వైపు చూశారు, కూడ బలుక్కున్నట్టు. అంతకుముందు అటువంటి మాటలు చెవులపడిన వెంటనే మారిపోయేవి ఆమె ముఖంలోని భావాలు... వెక్కిరింపో, వేళాకోళమో, భరించలేనంత ఆవేశమో ఏదో ఒకటి... చుట్టూ ఉన్న వారికి చెమటలు పట్టేసేవి.

కాలు మీద కాలు వేసుకుని, ఠీవీగా తల పంకిస్తూ చిన్నగా నవ్వుతోంది ఆమె. ముఖం చాలా నార్మల్‌గా ఉంది.

'శంకరయ్యా... డాక్టరు గారిని పంపించి రండి' అన్నది మృదువుగా.

ఖాళీ కప్పుల్ని కింద పెట్టి, ఒకరి వెనుక ఒకరుగా ఆ హాలులో నుంచి బయటికి నడిచారు డాక్టర్లు ఇద్దరూ.

ప్రధానద్వారం దగ్గరే ఆగి ఉన్న వారి కారుదాకా వెన్నంటి నడిచాడు శంకరయ్య. 'ఉంటాను డాక్టరు గారూ..' అంటూ నమస్కారం చేశాడు.

తల ఊపి తమ కారును వేగంగా మెయిన్ రోడ్డు మీదికి తీసుకుపోయాడు పెద్ద డాక్టరు. వందగజాల దూరం పోయిన తర్వాత ఉన్నట్లుండి రోడ్డు మధ్యలో ప్రత్యక్షమై, చేతుల్ని బార్లా జాచాడు ఒక మనిషి.

'ఓరి వీడి దుంపతెగ... వీడేమిటి రోడ్డుకు అడ్డంగా' అంటూ బ్రేకులు మీద కాలువేసి కారును ఆపాడు డాక్టరు.

'మా బాజిరెడ్డిసారు మిమ్మల్ని వెంటబెట్టుకు రమ్మన్నారు. రండి' అంటూ విండో దగ్గరికి వచ్చి నిలబడ్డాడు ఆ మనిషి.

'బాజిరెడ్డి సారా? రమ్మన్నాడా? మేము హాస్పిటల్‌కి పోవాల్సిన టైము..' అంటున్న డాక్టర్ వంక నిర్వికారంగా చూశాడు ఆ మనిషి.

'ఆ మాట మీరువచ్చి, సారుకు చెప్పి, వెళ్ళిపోండి. రండి!' అంటూ వెనుతిరిగి రోడ్డు పక్కనే స్టాండ్ వేసి ఉన్న తన స్కూటర్‌ని స్టార్ట్‌చేశాడు.

'ఏంటిసార్ ఈ డెవలప్‌మెంటు?' చిన్న కంఠంతో అడిగాడు పెద్ద డాక్టర్‌ని, సైకియాట్రిస్ట్.

'జయమ్మతల్లి తిక్కతిక్కగా మాట్లాడటానికి ఇటువంటివే కారణం. ఈ బాజిరెడ్డి మనిషికాదు, పిశాచం' లోగొంతుకతో అంటూ కారును పక్కకు తిప్పి, ఆ మనిషిని ఫాలో అయ్యాడు పెద్ద డాక్టర్.

●●●

'ఆ పిచ్చిది ఏమంటోంది? తనకి తగ్గిపోయిందని తనే అంటోందిట కదా... నిజమేనా?' తన ఆఫీసులో హుందాగా కుర్చీ వెనక్కివాలి కూర్చుంటూ అడిగాడు బాజిరెడ్డి.

సైకియాట్రిస్ట్ వైపు చూశాడు పెద్ద డాక్టరు. చదువు పూర్తిచేసుకుని కొత్తగా అంతకు మూడునెలల క్రితమే ఉద్యోగంలో చేరిన మనిషి అతను. కదిరి ఎస్టేట్‌కి సంబంధించిన మాటలు విచిత్రంగా ఉంటాయని తెలుసో తెలియదో, బాజిరెడ్డిని హేండిల్ చేయటంలో తేడావస్తే తమ ఫ్యూచర్ ఎలా మారిపోతుందో... కనీసం కనుసైగ చేసైనా అతన్ని ఎలర్ట్ చేద్దామని అనుకున్నాడు పెద్ద డాక్టరు.

'మీరు గమ్మున కూర్చోండి. అతన్ని మాట్లాడనీయండి' ఆయన మనసులోని మాటలు తనకు అర్థం అయినట్లు వెంటనే వార్నింగ్ ఇచ్చాడు బాజిరెడ్డి.

పక్కన ఉన్నది ఆర్డినరీ ఎముకల స్పెషలిస్టో, ఊపిరితిత్తుల డాక్టరో అయివుంటే... పెద్దడాక్టరు భయపడుతున్నట్టు పొంతనలేని సమాధానాలు ఇచ్చి ఉండేవాళ్ళు. కాని ఇపుడు ఉన్నది మానసిక వైద్యనిపుణుడు. మనుష్యుల మెదళ్ళను, వాటి వికారాలను అధ్యయనం చేసిన స్పెషలిస్టు!

'అయ్యా బాజిరెడ్డిసారూ... ఇప్పుడు నేను మీకు చెప్పబోతున్న మాటల్ని మీరు పొరపాటున కూడా బయటపెట్టకూడదు. పెట్టారంటే అక్కడ నేను చెప్పి వచ్చినవన్నీ అనర్థాలని అందరికీ తెలిసిపోతాయి' ముక్కుకు సూటిగా అసలు విషయం లోకి వచ్చేశాడు ఆ యువకుడు.

'చెప్పు... నేను ఎవరికీ చెప్పను' భరోసా ఇచ్చాడు బాజిరెడ్డి.

'జయమ్మగారి మనసులో ఎన్నెన్నో చిక్కుముళ్ళు ఉన్నాయి. అప్పుడప్పుడు ఆ ముడులు వదులై, అంతా ప్రశాంతంగా ఉన్నట్టు కనిపిస్తుంది గాని, యదార్థంగా అది జరగదు. ఆమెకు ఇప్పట్లో నయమవటం ఇంపాజిబుల్ అన్నాడు డాక్టరు.

నవ్వులమయమైపోయింది బాజిరెడ్డి ముఖం. గబుక్కున టేబుల్ కింద ఉన్న అరలో నుంచి ఒక నోట్లకట్టను తీసి అతని ముందు పడేశాడు.



'ఇప్పుడేకాదు... ఇంకెప్పుడయినా మిమ్మల్ని పిలిపిస్తే ఇప్పుడు చెప్పినట్టే చెపుతూ ఉండండి. మూడు రోజులు సరిపడే మాత్రలు దేనికి ఇచ్చినట్టు?' అని అడిగాడు.

పిచ్చమ్మి దగ్గర జరిగిన సంభాషణ యావత్తూ టేప్‌రికార్డులో ఫీడ్‌చేసి తనకు వినిపించబడినట్టు మాట్లాడుతున్న అతన్నిచూసి నివ్వెరబోయాడు పెద్ద డాక్టరు.

'ఆశ్చర్యం దేనికి డాక్టరు గారూ! ఈ ఎస్టేట్‌లో ఏ మూల ఏమి జరిగినా నాకు వెంటనే తెలిసిపోతుంది. మీ హాస్పిటల్లో కూడా... మర్చిపోకండి' అంటూ తల ఊపాడు.

తన ఎదుట పడిన నోట్లకట్టను, తిరిగి అతని ముఖం మీదికి  విసిరికొట్టమని చిన్న డాక్టర్‌కి చెప్పాలని అనుకున్నాడు పెద్ద డాక్టరు.

అటువంటి అవకాశం అతనికి లభించలేదు. ఆ పని చిన్న డాక్టరు చేయలేదు. కామ్‌గా తీసుకుని బయటికి వచ్చేశాడు.

'నీకు సిగ్గనిపించటం లేదా?' అని ఎత్తిపొడవబోయి ఆఖరిక్షణంలో ఆ మాటల్ని మింగేశాడు పెద్ద డాక్టరు.

'మన ఛారిటీ బాక్సులో వేయించండి. డొనేషన్ ఇచ్చిన పుణ్యం కొద్దిగానయినా దక్కుతుంది బాజిరెడ్డికి' నోట్లకట్టను డాష్‌బోర్డు మీద పడేస్తూ చెప్పాడు చిన్న డాక్టరు.

'నేను నీ గురించి చాలా చెడుగా అనుకున్నాను. ఐ లైక్ యూ మై బోయ్!' మెచ్చుకున్నాడు పెద్ద డాక్టరు.

'జయమ్మగారికి రేపు సాయంత్రానికల్లా తగ్గిపోతుంది. ఐ యామ్ ష్యూర్ ఆఫ్ ఇట్! తగ్గే చిహ్నాలు వాటంతట అవే కనిపించబట్టే ఆమె మనల్ని పిలిపించింది. ఈ బాజిరెడ్డి నక్కజిత్తులు ఇకమీదట సక్సెస్ అవటం చాలా కష్టం' నవ్వుతూ చెప్పాడు అతను.

'నిజం తెలిస్తే నీమీద కచ్చగడతాడు' అన్నాడు పెద్ద డాక్టరు.

'మరేం పరవాలేదు. అతను కళ్ళెర్రచేస్తే భయపడి పారిపోవటానికి నేను పరాయివాడిని కాదు. నాది కూడా ఈ ఏరియానే! కళ్ళెర్ర చేయటం నాకు కూడా చేతొచ్చు' అన్నాడతను.

కారును ముందుకు పోనిచ్చాడు పెద్ద డాక్టరు. ఎడమచేతిని జాచి అతని భుజాల్ని గట్టిగా అదిమిన తర్వాత ఆ పని చేశాడు.

●●●

తొమ్మిదిన్నర గంటల సమయంలో ప్రత్యూష, ప్రణవి ఉపయోగించుకుంటున్న బెడ్‌రూమ్ ముందుకు వచ్చింది సంపంగి.

తను అక్కడికి రావటాన్ని ఎవరైనా గమనించారో లేదో, రెండు నిమిషాలు నిలబడి చుట్టూ చూసి, నిశ్చయం చేసుకుంది. పిల్లి మాదిరి అడుగులు వేస్తూ ఓరగా వేసి ఉన్న తలుపుల్ని నిశ్శబ్దంగా నెట్టి, లోపలికి పోయింది.

బెడ్‌కి దగ్గరగా ఉన్న టేబిల్ మీదనే ఉన్నది ప్రత్యూష ఉపయోగించే హ్యాండ్‌బాగ్. ఆలస్యం చేయకుండా తెరిచింది. లోపల ఉన్న మూడు మాత్రల్ని బయటికి తీసి, పమిటె చెంగు చాటున జాకెట్‌లో దోపుకుని, హ్యాండ్‌బాగ్‌ని అంతకుముందు ఎలా ఉన్నదో అలాగే పెట్టి అర్జంటుగా బయటికి వచ్చేసింది.

పావుగంట తర్వాత నిశ్శబ్దంగా వెలిగింది ఆమె ఫోను. దాన్ని పట్టుకుని పరుగులాంటి నడకతో మెయిన్‌గేటు దగ్గరికి పోయి 'హల్లో' అన్నది.

'ఏమయిందే సంపంగీ?' అడిగింది బాజిరెడ్డి కంఠం.

'తెచ్చేశాను సారూ... నా దగ్గిరే ఉన్నాయి' అన్నది ఆమె.

'ఎన్ని?'

'మూడు'.

'మంచిది. తీసుకుపోయి మురుగ్గుంటలో పారేయ్. మందు అనేది ఆ పిచ్చిదాని నోట్లోకి  పోకూడదు' అన్నాడు డాక్టరు.

'మాత్రలు కనిపించకపోతే మళ్ళీ డాక్టరుకి ఫోన్ చేస్తారు కదయ్యా?' అనుమానంగా అడిగింది ఆమె.

'నీ దగ్గర ఏమైనా ఒళ్ళునొప్పుల మాత్రలుంటే వాటిని తీసి, ఈ మాత్రల కాయితాల్లో పెట్టి గట్టిగా అంటించేయ్. తీసుకుపోయి బాగ్‌లో పెట్టేయ్'

'తేడా కనిపిస్తుందేమోనయ్యా?' అనుమానంగా అడిగింది సంపంగి.

'మామూలు రోగాలకి సంబంధించిన మాత్రలైతే అందరికీ  తెలిసిపోతాయ్. ఇవి అటువంటివి కాదు. ఇట్టాంటి వాటిని మనం చూడనుకూడా చూసి ఉండము. అనుమానం పెట్టుకోకుండా చెప్పినట్టు చెయ్'.

'ప్రత్యూష చూస్తే నా ఒళ్ళు వాచిపోతుందయ్యా'

'బాగ్‌లో మాత్రలు కనిపించకపోయినా జరిగేది అదే! త్వరగా పెట్టేయ్' అంటూ ఫోన్ కట్ చేశాడు బాజిరెడ్డి.

తన ఫోన్‌ని పమిటె చాటున భద్రపరుచుకుని, పరుగులాంటి నడకతో బిల్డింగ్‌లోకి పోయింది సంపంగి.

శివారెడ్డి గదిలో కూర్చుని ఉన్నారు అందరూ. చిన్నగా నవ్వుకుంటూ, జోకులు వేసుకుంటూ మాట్లాడుకుంటున్నారు.

**పిచ్చమ్మిని పరీక్షించి, మాత్రలిచ్చి బయలుదేరారు డాక్టరు, అతనితోపాటు వచ్చిన సైకియాట్రిస్టు. దారిలో కారుకి అడ్డంగా వచ్చి, వాళ్లను ఆపాడు ఓ వ్యక్తి. బాజిరెడ్డి సారు మిమ్మల్ని రమ్మంటున్నాడు అంటూ వాళ్లను తనతోపాటు తీసుకెళ్లాడు. అసలు బాజిరెడ్డి వాళ్లను ఎందుకు రమ్మన్నాడు? వాళ్లతో ఏం పని పడింది?**

తనగదిలోకి పోయి ఒక అలమరలో ఉన్న కొన్ని మాత్రల్లో నుంచి మూడింటిని తీసి, ప్రత్యూష బాగ్‌లో నుంచి తీసుకువచ్చిన మాత్రల స్థానంలో నేర్పుగా ఇరికించింది ఆమె. కాయితం చినిగినట్లో, ఎవరో చింపినట్లో తెలియకుండా గట్టిగా నొక్కి మరోసారి ప్రత్యూష గది దగ్గరికి పోయింది.

●●●

'అదిగో అన్నయ్య... ఆ కంకరరోడ్డుని చూడు' పగలు పదింటిదాకా అదేపనిగా నడిపించి వంద గజాల దూరంలో ఉన్న ఒక నాటురోడ్డును వెట్టికి చూపించాడు బండోడు.

'చింతలపల్లి నుంచి సూటిగా వచ్చివుంటే ఇంత టైము పట్టేది కాదు. ఆళ్ళెవరో ఎదుకులాడుతూ వచ్చేస్తారంటివి కదా. చుట్టుదారిన తీసుకువచ్చా. ఆళ్ళు ఈ పాటికి మనూళ్ళోకి పోయి నువ్వు కనిపించకపోయేసరికి దిబ్బమొఖాలేసుకుని వెనక్కి తిరిగి ఉంటారు' అన్నాడు.

'ఒకవేళ వాళ్ళు దిబ్బమొఖాలతో వెనక్కి వస్తూ ఉంటే నాకు ఎక్కడ తారసపడతారు?' అని అడిగాడు వెట్టి.

'చింతలపల్లి దాటిన తర్వాత ఆ పని జరగవచ్చు. కొంచెం వెనుకాముందు చూసుకుంటూ ఉంటే చాలు. ఎవరొచ్చినా కాళ్ళు కొట్టుకుంటూ నడిచి రారు  కదా.... వెహికల్స్ మోతలు వినబడతాయి. రోడ్డు దిగి తుప్పలచాటుకి పోతే చిటికెలో మాయం అయిపోతావు' అన్నాడు బండోడు.

'మనం తప్పు చేశామురా బండోడా.. అన్న వచ్చిన బుల్లెట్ బండి మా ఇంటి దగ్గరే ఉంది. దాన్ని తీసుకు వచ్చేసి ఉంటే బాగుండేది' సాలోచనగా అన్నాడు బండోడి స్నేహితుడు.

తల అడ్డం తిప్పాడు వెట్టి. ఎగుడుదిగుళ్ళు, ఎత్తుపల్లాలతో పరమ అసహ్యంగా ఉంది తాము నడిచివచ్చిన మార్గం. మొదటి అరగంటలోనే ఎక్కడో ఒకచోట బ్రేక్‌డౌన్ అయిపోయి ఉండేది ఆ బండి.

'దాన్ని జాగ్రత్తగా ఇంటెనకాలకి చేర్చు. రెండు మూడు రోజుల్లో నేను వచ్చి తీసుకుంటాను. ఒకవేళ రాకపోతే ఇంకెవరినైనా పంపిస్తాను' అంటూ వాళ్ళ ముందున్న కంకరరోడ్డు వైపు చూశాడు.

'నువ్వు ఆలోచించాల్సిన అవసరం లేదన్నయ్యా. చింతలపల్లిలో ఆటోలు చాలా ఉన్నాయ్... తేలికగా వెళ్ళిపోవచ్చు' అన్నాడు యువకుడు.

తల ఊపి వారిద్దరివైపు సాదరంగా చూశాడు వెట్టి. 'చాలా సాయం చేశారు. నేను ఎప్పటికీ మర్చిపోను. వస్తాను' అంటూ ముందుకు అడుగువేయబోతుండగా వినవచ్చింది ఆ శబ్దం.

ముందుకు వేయబోయిన పాదాన్ని వెనక్కి తీసుకుంటూ తనతో వచ్చిన వారివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

'కట్టెలు కొట్టుకోవటానికి వచ్చినట్టుంది అన్నయ్య'



చెవులు రిక్కిస్తూ అన్నాడు బండోడు.

'ఇంత పొద్దుపొద్దున్నే కట్టెలకు వచ్చేది ఎవఠ్రా? రెండుపూట్ల తిన్న తర్వాత, ఏమీ తోచకపోతే, కింద పడిన ఎండుకొమ్మల్ని ఏరుకోవటానికి వస్తారు. ఇదివరకటి మాదిరిగా గొడ్డళ్ళు భుజాలమీద వేసు కుని బయలుదేరితే ఫారెస్టోళ్ళు పీకి పాకాన పెట్టే స్తున్నారు' అన్నాడు యువకుడు.

వారి అభిప్రాయంతో సంబంధం లేనట్టు ఆగి ఆగి వినవస్తూనే ఉన్నది ఆ శబ్దం. 'చూద్దాం అన్నయ్యా... ఇదేదో వింతగానే ఉంది' అన్నాడు యువకుడు.

'అవసరం లేదురా.. అటు చందనం చెట్లున్నాయ్! బాజిరెడ్డి తోటలు కూడా దగ్గర్లోనే ఉన్నాయ్!' తేలి కగా చెప్పాడు బండోడు.

'నువ్వు ఈ మాటని ఇంత డిస్కషను జరిగిన తర్వాత చెప్పకూడదు. ముందే చెప్పి ఉండాల్సింది' కోపంగా అన్నాడు యువకుడు.

బాజిరెడ్డి చందనం చెట్లు అని చెవులపడిన వెంటనే ఛట్‌మని వెట్టి కనులముందు మెదిలాడు, చౌడేశ్వరి గుడి దగ్గర్నించి అర్థాంతరంగా అవతలికి వెళ్ళిపోయిన పఠాన్.

ఆపైన ఆగటం అతనికి చేతకాలేదు. 'పదండి. ఒకసారి చూసి వద్దాము' అంటూ అటు నడిచాడు.

పావుగంట తరువాత వాడికి కనిపిం చాయి ఏపుగా ఎదిగి ఉన్న చందనం చెట్లు. అంతకు ముందే ఎన్నింటినో నరికి పారేశారు కాబోలు, గుట్టలు గుట్టలుగా పేర్చి ఉన్నాయి దుంగలు.

ఖాళీస్థలం మాదిరిగా తయారయిన ప్రదేశంలో నిట్టనిలువుగా నిలబడి ఉన్నది ఒకే ఒక చెట్టు.

'దీనికి కనీసం రెండు వందల సంవత్సరాల వయసు ఉండి ఉంటుంది. గొడ్డలికి లొంగటం లేదు' దెబ్బమీద దెబ్బగా దాన్ని నరకటానికి చూస్తున్న మనిషి తన వెనుక ఉన్న ఎవరికో చెపుతున్నాడు.

బండోడి భుజం మీద చెయ్యివేసి ముందుకు వంగిన వెట్టికి వెంటనే కనిపించాడు ఒక కాంప్ కుర్చీలో కూర్చొని ఆ కార్యక్రమాన్ని పరిశీలిస్తున్న పఠాన్.

'పని అంతా అయిపోయిన తర్వాత నన్ను పిలిచి ఉండాల్సింది. రెండు రోజులయింది సరయిన తిండి తిని. మీకు ఎవరికీ బుద్ధిలేదు' కోపంగా అంటున్నాడు అతను.

'ఆ ఫారెస్టు ఆఫీసరు జీపేసుకుని చింతలపల్లి చుట్టూనే తిరుగుతున్నాడు. ఎప్పుడు వాసన పసి కట్టి వచ్చిపడతాడో తెలియదు. మీరు దగ్గిర ఉంటే మాకు దమ్ముగా ఉంటుంది.' గొడ్డలిని కిందపెట్టి తలపాగాతో ముఖాన్ని తుడుచుకుంటూ అన్నాడు చెట్టును నరుకుతున్న మనిషి.

'ఈ పూటకి ఆపి, ముందు తిండి ఏర్పాట్లు చూడండి. ఆ శ్రీలంకోళ్ళు రేపు సాయంత్రం కాబోలు వస్తామన్నారట..' అన్నాడు పఠాన్.

'ఆళ్ళు వట్టి జాదూలు పఠాన్ బాబూ! సరు కును చూసి తలలు ఊపుతారు. తీసుకువచ్చి సముద్రం ఒడ్డున డెలివరీ ఇవ్వమంటారు. ఈలోపల మన గుట్టు రట్టు అయిపోతుంది' అన్నాడు ఆ మనిషి.

'ఈ సబ్బిరెడ్డి చింతలపల్లిని వదిలి అవతలికి వెళ్ళిపోతే మనకి ఎటువంటి ప్రాబ్లము ఉండదు' అన్నాడు పఠాన్.

శ్రద్ధగా ఆ మాటల్ని వింటున్న వెట్టికి వెంటనే ఫ్లాష్ అయింది ఒక ఆలోచన.

'నా దగ్గర సబ్బిరెడ్డి సారు ఫోను నంబరుంది. చింతలపల్లి పోయి ఆయనకి ఫోన్‌చేసి రాగలరా మీ ఇద్దరిలో ఎవరయినా?' అని అడిగాడు.

ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు వారిద్దరూ.

'నంబరు కాయితం మీద వేసి ఇస్తావా?' అని అడిగాడు బండోడు.

పెన్ను లేదు వెట్టి దగ్గిర, కాయితమూ లేదు.

చుట్టూచూసి, అల్లంతదూరంలో నేలమీద పడి ఉన్న ఒక పండుటాకును తీసుకువచ్చాడు బండోడి స్నేహితుడు. మరికొంచెం వెనక్కిపోయి నీలం రంగులో నిగనిగ మెరుస్తున్న బచ్చలిపండ్ల వంటి చిన్నచిన్న కాయల్ని దోసిట్లో తెచ్చాడు.

'వాటి రసం ఇంకు కన్నా పవర్‌ఫుల్. పుల్లతో ఈ ఆకుమీద నంబర్ వేయి' అంటూ చెప్పాడు.

చిన్నతనంలో ఆడిన అటువంటి ఆటలు గిర్రు గిర్రున తిరిగాయి వెట్టి కనుల ముందు. ఆ కాయలను నలిపి, సన్నపాటి పుల్లను ఆ రసంలో ముంచి, అతను అందించిన ఆకుమీద ఒక నంబర్ రాశాడు.

'లక్ష ప్రశ్నలు వేస్తాడు. నిన్నుకూడా తీసుకు పోయి కూర్చోపెడతానంటాడు. కంగారు వద్దు. నేను

## హాలీవుడ్‌లో ఏం ఉంది?

*ఇప్పుడు చాలామంది బాలీవుడ్ హీరోయిన్ల టార్గెట్ హాలీవుడ్! అక్కడ ఎప్పుడెప్పుడు కాలు పెడదామా? అని ఆత్రుతతో ఎదురు చూస్తూ ఉంటారు. ఒక్క అవకాశం వచ్చినా వదులుకోవ డానికి ఇష్టపడరు. అలాంటిది కంగనా మాత్రం హాలీవుడ్‌ను వెంట్రుకతో సమానంగా తీసి పారే సింది. అక్కడ గొప్ప సినిమాలేవీ రావట! భారత దేశంలో అంతకన్నా గొప్పసినిమాలు వచ్చాయి, వస్తున్నాయి. అలాంటప్పుడు హాలీ వుడ్‌కి ఎగబడడం దండగ అంటూ చెప్పుకొ చ్చింది. కాకపోతే కంగనా విసుర్లు దీపిక, ప్రియాంకాల మీదనే అని అందరికీ తెలిసి పోయింది. 'ఆడలేనమ్మ మద్దెల మీద పడి ఏడ్చినట్టు' తనకెటూ ఇంగ్లీషు రాదు కనుక ఈ జన్మలో హాలీవుడ్‌లో ఛాన్స్ వచ్చే అవకాశం లేదు. అంతమాత్రాన అక్కడ గొప్ప సినిమాలు రావడం లేదంటే ఎలా? కొందరు హీరోయిన్లు బహిరంగంగానే కంగనాను విమర్శిస్తున్నారు.*



చేస్తున్న పని ఇదని చెప్పు' అని జాగ్రత్తలు చెప్పాడు.

తల ఊపి, ఆ పండుటాకును ఒంటికి దూరంగా పట్టుకుని, వేగంగా నడిచాడు యువకుడు. రెండే రెండు నిమిషాల్లో పొదల మధ్య కనిపించకుండా పోయాడు.

'మనం ఏంచేద్దాం అన్నయ్యా? తిండి టైముకి ఎవరి చోటికి వాళ్ళం వెళ్ళిపోతామనుకుని, మన వెంట ఏమీ తీసుకురాలేదు' పొట్టను తడుము కుంటూ అన్నాడు బండోడు.

నిలుచున్న ప్రదేశంలో నుంచి వెనక్కి జరిగాడు వెట్టి. 'పద... ఏవైనా కాయలు కనిపిస్తాయేమో చూద్దాం' అంటూ బయలుదేరబోతుండగా సుని శితమైన అతని చెవులను చేరింది ఒక సన్నటి ధ్వని.

అదేమిటో తెలుసు అతనికి. అదిరిపడి తల ఎత్తి చూశాడు. రెండు వందల సంవత్సరాల వయ స్సుంటుందని పఠాన్ ముఠా అనుకుంటున్న చెట్టు పై భాగంలో ఆకుల మాటున ఉంది ఒక పెద్ద తేనెపట్టు.

ఆషామాషీ పట్టు కాదు అది. దగ్గర దగ్గరగా




మూడు అడుగుల వెడల్పు, నాలుగు అడుగుల పొడవు ఉన్నది. గొడ్డలి దెబ్బ పడినప్పుడల్లా, అదురు తోంది చెట్టుకాండం. కంపిస్తున్నాయి ఆకులు. డిస్టర్బ్ అవటం మొదలుపెట్టాయి ఈగలు. పట్టును వదిలి గాలిలోకి ఎగురుతున్నాయి కొన్ని.

'ఏ క్షణంలోనైనా వాటికి తిక్కరేగవచ్చు, తేలు కొండీల వంటి ముళ్ళతో దాడికి దిగవచ్చు' వెట్టితో పాటు తలను పైకెత్తి చూస్తూ కామెంట్ చేశాడు బండోడు.

సబ్బిరెడ్డి రావటం చాలా ఇంపార్టెంటు. అతను వచ్చేలోపల ఇవి రెచ్చిపోతే అందరూ దూరంగా పారిపోయి తప్పించుకుంటారు' అన్నాడు వెట్టి.

'అయితే ఏంచేద్దాం?' అడిగాడు బండోడు. 'ప్రమాదకరం కాని డైవర్షన్ క్రియేట్ చేద్దాం' పది సెకన్లపాటు తీవ్రంగా ఆలోచించి చెప్పాడు వెట్టి.

తాము అక్కడ ఉన్నట్టు తెలిసిన మరుక్షణం గుంపుగా వచ్చి మీద పడేటట్టున్న పఠాన్ బృందాన్ని చూస్తూ నుదురు రుద్దుకున్నాడు బండోడు.

'ఎలా అన్నయ్యా? ఏ విధంగా?' అని అడి గాడు.

'ఏంరా? ఏంటి నీకు చెప్పేది? ఎవరిని అను కుంటున్నావు నన్ను? తిత్తి తీసేస్తాను. చంపి ఈ ఆకుల కింద పాతిపెట్టేస్తాను' బిగ్గరగా అరిచాడు వెట్టి.

అతను అలా పబ్లిగ్గా బయటపడిపోతాడని ఊహించకపోవడం వల్ల అదిరిపడి నోరు వెళ్ళబెట్టాడు బండోడు.

'పో... వెళ్ళిపో.. ఈ జన్మలో నా కళ్ళకు కనిపిం చకు' మరో అరుపు అరిచాడు వెట్టి.

అంతకుముందు అరిచిన అరుపుల్ని విన్న వెంటనే ఎలర్ట్ అయిపోయారు ఆ జనం. రెండో సారి కూడా వినవచ్చేసరికి, తోడేళ్ళ మంద మాదిరి ముందుకు దూకారు.

'ఇప్పుడు చూపించు నీ పరిజ్ఞానం. ఈ అడ విని గురించి పూర్తిగా తెలుసని చెప్పాడు మీ నాయన. తీసుకుపో త్వరగా' వెనక్కి పరిగెత్తుతూ బండోడిని హెచ్చరించాడు వెట్టి.

అంతం అయిపోయింది బండోడి అయో మయం. చిన్న నవ్వు ముఖాన్ని ప్రకాశవంతం చేస్తుం డగా, ఒక్క దుముకులో వెట్టి ముందుభాగంలోకి చేరుకుని పరుగు మొదలుపెట్టాడు.

అంతకుముందు తాము నడిచివచ్చిన దారి లోనే తిరిగి వెనక్కి వెళ్ళటం జరుగుతోందని తెలి సింది వెట్టికి. రెండు నిమిషాల తర్వాత తనకు ఏమీ తెలియదని అర్థం అయింది.

దట్టంగా ఉన్న పొదల మధ్య గిరికీలు కొట్టి, ఉన్నట్లుండి అతన్ని ఒక పెద్ద గోతిలోకి నెట్టాడు బండోడు. తను కూడా అందులోనే దూకి, గోతి అంచుమీద పెరిగి ఉన్న ఒక పిచ్చిపొదను తమ తలలకు అడ్డంగా లాగాడు.

ఎంతో సమయం పట్టలేదు వెనుక ఉన్న వాళ్ళు ఆ ప్రదేశంలోకి వచ్చేయటానికి.

వాసన తగిలితే తమ పరిస్థితి చాలా విష మంగా తయారై పోతుందని వెట్టికి తెలుసు. చూసిన మరుక్షణం గుర్తు పట్టేస్తాడు పఠాన్. గుర్తుపట్టిన వెంటనే ఏదో ఒక డ్రాస్టిక్ స్టెప్ వేసేస్తాడు.

'వెతకండిరా... వాళ్ళు ఎవరో వెతకండి. పట్టు కోండి' పళ్ళు బిగించి వెనుక నుంచి అందరినీ హెచ్చరిస్తున్నాడు అతను.

'కంగారు వద్దు అన్నయ్య. వాళ్ళు ఈ గోతి దగ్గరకు రారు. రాలేరు!' పూర్తి నమ్మకంతో చెప్పాడు బండోడు.

'ఎందుకంత నమ్మకం?' అని అడిగాడు వెట్టి.

అతను అలా అడిగినప్పుడు తలతోనే చూపిం చాడు బండోడు, ఆ గోతి అంచుమీద ఎత్తుగా పెరిగి వున్న పెద్ద పుట్టని.

పుట్ట చుట్టూ చెలరేగిన అలజడిని గమనించి తలలు బయటికి పెడుతున్నాయి దానిలో నివ సించే రెండు పాములు.

ఆ బాజిరెడ్డికి, వాడి కొడుక్కి ధైర్యం అయితే ఎక్కువేగాని, పాముల్ని చూస్తే మాత్రం నీరసం ముంచుకు వచ్చేస్తుంది. కారణం నీకు తెలుసు' చిరునవ్వుతో వెట్టి చెవిలో ఊదాడు బండోడు.

తల ఎత్తి చుట్టూ చూస్తున్న ఆ విషోరగాల్ని గమనించేసరికి వెట్టికి కూడా వచ్చింది నవ్వు.

'థాంక్యూ బండోడా! నీ ముందుచూపు అమోఘం. ఇంకో అరగంటకు గాని వీళ్ళు వెనక్కిపోరు. పోయిన తర్వాత ఆకలి. ఆ తర్వాత కొంచెం విశ్రాంతి. సబ్బిరెడ్డి సరయిన సమయానికి వచ్చేస్తాడు' అన్నాడు.

'ఇప్పుడు ఈ పఠాన్‌గాడిని పట్టించటం వల్ల నీకు ఒరిగి ఒళ్ళో పడేది ఏముంది అన్నయ్యా? టైము వేస్టుకావటం తప్ప. వాడు ఒక్కడే నిన్ను ఏం చేయగలడు?' అని అడిగాడు బండోడు.

ఆ ప్రశ్నకు సరయిన సమాధానం చెప్పటానికి ట్రై చేశాడుగాని, వెట్టికి చేత కాలేదు. తనకు, పఠాన్‌కి ఉన్న పగని గురించి చెప్పటం మొదలుపెడితే మళ్ళీ చీకట్లు పడిపోతాయి. చిన్నచిన్న మాటల్లో చెప్పటం అసాధ్యం.

'అక్కడ ఆ బాజిరెడ్డి, శివారెడ్డి చెల్లెల్ని ఈ పఠాన్‌గాడికి ఇచ్చి పెళ్ళిచేయాలన్న పట్టుదల మీద ఉన్నాడు. ఏ క్షణంలో వాడు శివారెడ్డి పీకలమీద కత్తిని పెట్టి మాట తీసుకుంటాడో తెలియదు. ఏ మాత్రం అవకాశం ఉన్నా ఆ పని జరగకుండా చేయాలి. ఈ పఠాన్‌గాడిని కొన్ని రోజులు బొక్క లోకి పంపించేస్తే నాకు ఇంకో మార్గం వెతుక్కునే సమయం లభిస్తుంది' అని మాత్రం చెప్పాడు.

'నువ్వు తల ఊపు. వెనుకనుంచి పోయి వాడి బుర్రకాయని పగలగొట్టి వస్తాను' అన్నాడు బండోడు.

'తలకి దెబ్బలు, ఒంటిమీద వాతలు... ఇవన్నీ పఠాన్‌మీద అందరికీ సానుభూతిని కలిగిస్తాయి. అలా కాదు, వాడు వెధవ పనిలో ఉండగా పట్టుబ డితే భలేగా ఉంటుంది' అన్నాడు వెట్టి.

'నిజమే అన్నయ్యా! నీకున్న ఆలోచన నాకు లేదు. నువ్వు చెప్పింది అక్షరాల నిజం' వెంటనే తల ఊపాడు బండోడు.

అతను ఊహించినట్టే గోతి అంచు మీది పుట్టను, తలలు బయటికి పెట్టిన పాముల్ని చూడగానే వెనక్కి తగ్గారు పఠాన్ జనం.

'ఇవి ఇక్కడ ఉండగా ఇటుకేసి ఎవరూ రాలేరు. ఇంకో పక్కకు పోవాలి' అంటూ దూరంగా వెళ్ళిపోయారు.

తేలికగా నిట్టూర్చాడు బండోడు. మూడు నిమి షాలు ఆగి, మెల్లగా గోతిలో నుంచి బయటికి వచ్చాడు.

అప్పటివరకూ ప్రశాంతంగా ఉన్న పుట్ట మీది పాములకి కోపం వచ్చినట్టుంది - బుస్సున రొద చేశాయి.

'మనమీదకి పడితే ఏంటి పరిస్థితి?' ఆందోళ నగా అడిగాడు వెట్టి. తమ తలల మీద కప్పుకోవ టానికి పక్కకు వంచిన పిచ్చిపొద మీదనుంచి రెండు పెద్ద పెద్ద మండల్ని విరిచి పాముల కేసి ఊపాడు బండోడు.

కోపం మటుమాయం అయిపోయినట్టు అర్థం టుగా పుట్టలోకి వెళ్ళిపోయాయి అవి.

**(ఇంకా వుంది)**




**డా॥ జి. సతీష్ రెడ్డి**
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# రుమటాయిడ్ అర్థ్రైటీస్ (కీళ్ళ నొప్పులు) సమస్య మహిళల్లో అధికంగా ఉండటానికి కారణాలు చికిత్సా మార్గాలు

మన కీళ్ళు తెలియకుండానే వంగిపోతూ రోజూవారి పనుల్లో పాల్గొంటాయి. అవి ఏదైనా కారణాలతో వంగక తీవ్రమైన నొప్పి లేదా వాపు వస్తేగానీ కీళ్ళకు సమస్య వచ్చినట్లు మనకు తెలియదు. కీళ్ళ నొప్పుల్లో సుమారు వంద రకాలు ఉంటాయి అందులో ప్రధానమైనవి ఒకటి ఆస్టియో అర్థ్రైటీస్, కీళ్ళ నొప్పులు. వయస్సు పెరిగిన వారిలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది. రెండవది రుమటాయిడ్ అర్థ్రైటీస్, చిన్న కీళ్ళలో వచ్చే నొప్పులు, ఇది మహిళల్లో ఎక్కువగా కనిపిస్తుంటుంది. సమస్యను సకాలంలో గుర్తించి చికిత్స చేయించుకుంటే మెరుగైన ఫలితాన్ని పొందగలుగుతారు.

## ఎలా గుర్తించాలి.....?

రుమటాయిడ్ అర్థ్రైటీస్ మహిళల్లో అధికంగా వస్తుంటుంది. పిల్లలు, పురుషులు, వృద్ధులలో కూడా అరుదుగా ఈ సమస్య వచ్చే అవకాశం ఉంది. ఈ సమస్య మెట్లు ఎక్కుతున్నప్పుడు కీళ్ళలో నొప్పి రావడం. కుర్చున్నప్పుడు, కూర్చుని లేచిన్నప్పుడు, నడుస్తున్నప్పుడు కీళ్ళలో నొప్పి రావడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. కొంతకాలంగా ఈ లక్షణాలు కనిపిస్తూ కీళ్ళ నొప్పులు తగ్గకపోతే ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే వైద్యులను సంప్రదించాలి. రుమటాయిడ్ అర్థ్రైటీస్ సమస్య వల్ల చర్మం, కళ్ళు, ఊపిరితిత్తులు, గుండె, రక్తనాళాలపై ప్రభావం చూపే ప్రమాదం ఉంది.




## అందోళన కలిగిస్తున్న గణాంకాలు :

ప్రపంచ ఆరోగ్య సంస్థ, ఇంటర్నేషనల్ లీగ్ ఆఫ్ అసోసియేషన్ ఫర్ రుమటాలజీ ప్రకారం భారతదేశంలో సుమారు ఐదు మిలియన్ల మంది రుమటాయిడ్ అర్థ్రైటీస్‌తో బాధపడుతున్నారు. ఈ సమస్య మధుమేహం, రక్తపోటు, గుండె జబ్బులు తదితర సమస్యలతో ముడిపడి ఉండటంతో కచ్చితమైన గణాంకాలు తెలుసుకోలేకపోతున్నారు.

## మహిళ్ళల్లో అధికం :

జన్యుపరమైన కారణాలతో పాటు హార్మోన్ల అసమతుల్యత, ఊబకాయం వంటి కారణాల వల్ల మహిళలు ఎక్కువగా ఈ సమస్య బారినపడుతున్నారు. ఆస్టియో అర్థ్రైటీస్ తర్వాత మహిళలు అధికంగా రుమటాయిడ్ అర్థ్రైటీస్‌తో బాధపడుతున్నారు. తాజా అధ్యయనాల ప్రకారం కొన్ని ప్రత్యేకమైన కారణాల వల్ల మహిళలు అధికంగా



రుమటాయిడ్ అర్థ్రైటీస్‌తో బాధపడుతున్నట్లు తేలింది. గర్భధారణకు సిద్ధమవుతున్న మహిళలు, డెలివరీ కాబోతున్న, డెలివరీ అయిన మహిళలు, పిల్లలకు పాలిచ్చే తల్లులు వారి ఆరోగ్య సమస్యలను వైద్యులతో చర్చించి, వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ మందులు వాడాలి. మహిళల్లో త్వరగా మెనోపాజ్ దశ తలెత్తడం వల్ల రుమటాయిడ్ అర్థ్రైటీస్‌తో వచ్చే సమస్య ఉంటుంది. సాధారణంగా మహిళలు 45 ఏళ్ళ వయస్సులో మోనోపాజ్ దశ వస్తుంటుంది. అలా కాకుండా 40 ఏళ్ళ వయసులోనే త్వరగా మోనోపాజ్ దశ తలెత్తిన మహిళల్లో ఈ సమస్య వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉంటుంది.

## వ్యాధిని ఎదుర్కోవడం ఎలా...?

రుమటాయిడ్ అర్థ్రైటీస్‌ను పూర్తిగా నయం చేయడం కంటే దానిని అదుపులో ఉంచుకోవడమే ప్రస్తుతం అందుబాటులో ఉన్న ప్రక్రియ. రోగి, వ్యాధి పట్ల సరైన అవగాహన పెంపొందించుకుని వైద్యులు సూచించిన జాగ్రత్తలు పాటించడం ద్వారా ఈ సమస్యను అదుపులో ఉంచుకోవచ్చు. వైద్యులు సూచించిన మందులను మాత్రమే వాడాలి. మందులు వాడుతున్న సమయంలో ఏమైనా ఆరోగ్య సమస్యలు తలెత్తినా, దుష్ప్రభావాలు కనిపించినా వెంటనే వైద్యులను సంప్రదించి సలహాలు, సూచనలు పాటిస్తూ ఆహారపు అలవాట్లలో మార్పులు చేసుకోవాలి.

## మీ కీళ్ళను కాపాడుకోండి :

క్రమం తప్పకుండా ప్రతిరోజు నడవడంగానీ, వ్యాయామం చేయడంగానీ చేయాలి. ముఖ్యంగా ఒత్తిడికి దూరంగా ఉండేందుకు ప్రయత్నించాలి. అందుకు యోగా, మెడిటేషన్, బ్రీతింగ్ ఎక్సర్‌సైజులు వంటివి చేయడం మంచిది. చేపలు, స్ట్రాబెరీ, ఫైబర్, ఎక్కువగా ఉండే పండ్లు, కూరగాయలు, గింజలు వంటివి ఎక్కువగా తీసుకోవాలి. ఆరోగ్యకరమైన ఆహారపు అలవాట్లు కలిగి ఉండటం శ్రేయస్కరం.




# కౌశికపుత్రుల హీనజన్మవృత్తాంతం

**కౌశికునికి ఏడుగురు కుమారులు. వాగ్దుష్టుడు, క్రోధనుడు, హింసకుడు, పిశనుడు, కవి, ఘస్మరుడు, పితృవర్తి వారి పేర్లు. తండ్రి మరణానంతరం వారంతా గర్గుడు అన్న మునీశ్వరుణ్ణి ఆశ్రయించారు. అతనికి శుశ్రూషలు చేస్తూ వేదాధ్యయనం చేశారు. ప్రతిరోజూ దూడ సహా గర్గుని గోవుని మేతకు అడవికి తీసుకునిపోయి, తీసుకుని వచ్చేవారు.**

ఒకనాడు అడవిలో కౌశికుని కుమారులంతా ఆకలిదప్పులతో అలమటించారు. ఎంత వెదకినా వారికి ఇంతైనా ఆహారంగానీ, నీరుగానీ లభించలేదు. ఆకలిబాధనీ, దాహాన్నీ తట్టుకోలేక తెచ్చిన గోవుని సంహరించాలనుకున్నారు. దాని రక్తంతో దాహాన్నీ, మాంసంతో ఆకలినీ తీర్చుకోవాలనుకున్నారు. అయితే వారిలో కవి, ఘస్మరుడు అందుకు ఒప్పుకోలేదు. గోవుని చంపడం మహాపాపం అని హెచ్చరించారు. వారి మాటలు చెవిన పెట్టలేదెవరూ. పితృవర్తి కలుగజేసుకున్నాడప్పుడు. చెప్పాడిలా.

గోవును చంపాలని అనుకుంటే పితృదేవతా ప్రీత్యర్థం చంపడం తప్పుకాదు. గోవుకి ఉత్తమగతులు కూడా ప్రాప్తిస్తాయి. ఇందులో అధర్మం లేదు.

అతని మాటలు బాగున్నాయి అనిపించింది అందరికీ. అంతే! గోవుని సంహరించారు. దాని రక్త మాంసాలను ముందు పితృదేవతలకు అర్పించి, ఆ తర్వాత దాన్ని స్వీకరించారంతా.

సాయంత్రం గురుదేవుణ్ణి సమీపించి చెప్పారిలా.

గోవుని పులి తినేసింది గురువరా! కాపాడలేకపోయాం. దూడను కాపాడగలిగాం. ఇదిగో దూడ అని దానిని గర్గునికి అప్పగించారు. గోవుని కాపాడడానికి మేమంతా చాలా ప్రయత్నించాం. మావల్ల కాలేకపోయింది. తప్పయిపోయింది గురువరా! క్షమించండి అని వేడుకున్నారు. గర్గుడు ఋజుస్వభావుడు. శిష్యులు చెప్పింది నిజమని నమ్మాడు. బాధపడుతున్న శిష్యులను ఓదార్చాడు.

కొన్ని సంవతర్సాలు గడిచాయి. కౌశికుని కుమారులు ఏడుగురూ మరణించారు. మరణించి దశార్ణవ దేశంలో ఒకే తల్లికడుపున బోయలుగా జన్మించారు.

గతజన్మలో గురువుకి చేసిన వంచన కారణంగానూ, గోహింస కారణంగానూ వారంతా బోయలుగా జన్మించినా పితృదేవతలకు గోమాంసాన్ని అర్పించడంతో ఆ ఏడుగురికీ గతజన్మస్మృతీ, ధర్మానురక్తీ కలిగాయి. నిర్వైరుడు, నివృత్తి, క్షాంతుడు, నిర్మన్యుడు, కృతి, వైహాసుడు, మాతృవర్తి అని ఆ ఏడుగురినీ వ్యవహరించసాగారు. వారంతా అసత్యలోభాదులను మానుకున్నారు. కులధర్మంతో సాధారణ జంతుహింసతోనే తమను తాము పోషించుకుంటూ, తల్లిదండ్రులను సేవించసాగారు. కొంతకాలానికి తల్లిదండ్రులు మరణించారు. అప్పుడు చేతిలోని విల్లంబులు విసిరేసి, ఆహారంగా గాలిని మాత్రమే స్వీకరించి, కొన్నాళ్ళకు స్వర్గస్తులయ్యారు. కొంతకాలం గడిచింది. అప్పుడు ఉన్ముఖుడు, నిత్యవ్రతస్థుడు. స్తబ్ధకర్ముడు, విరోచనుడు, వేదితుడు, ఘస్మరుడు, నంది అన్న పేర్లతో మృగాలుగా జన్మించి, కాలాంజనపర్వతంపై నివసించసాగారు.

ఈసారి కూడా వారిని పూర్వజన్మస్మృతి అంటిపెట్టుకునే ఉన్నది. ఆ కారణంగా విరక్తులై కాలధర్మం చెందారు. కొన్నాళ్ళకు వారంతా చక్రవాకాలుగా జన్మించారు. పూర్వజన్మస్మృతివల్ల పెంటిపిట్టలను కూడక, వేదాధ్యయనాలతో కాలం వెళ్లబుచ్చారు. అప్పుడు వారిని సుమనుడు, ముని, శుచివాక్కు, శుద్ధుడు, చిత్రదర్శనుడు, సునేత్రుడు, స్వతంత్రుడు అని వ్యవహరించారు. గతజన్మలో వారు చేసిన గురుశుశ్రూషాది కార్యాలవల్ల పరబ్రహ్మవిజ్ఞానం, నిశ్చలయోగనిష్ఠ వారికి అలవడ్డాయి. ఆ సమయంలోనే పౌరవకులానికి చెందిన విభ్రాజుడు అనే రాజు, తన రాణులతో ఈ చక్రవాకాలు తిరుగాడే అడవిలోనికి ప్రవేశించాడు. అప్పుడు ఆ రాజు వైభోగాన్ని గమనించి, స్వతంత్రుడు బాధగా అనుకున్నాడిలా.

**కౌశికుని ఏడుగురు కుమారులూ గోవధకు పాల్పడి మరుజన్మలో బోయలై జన్మించారు. పూర్వజ్ఞానంతో మెలిగారు. తరువాత చక్రవాకాలై, మానస సరోవరహంసలై జన్మించారు. వీరిలో స్వతంత్రుడు తాను కోరుకున్నట్టే కాంపిల్య రాజు విభ్రాజునికి మనుమడై జన్మించాడు. విభ్రాజుడు సైతం తాను కోరుకున్నవిధంగా తనకు మనుమడై పుట్టిన హంస కడుపునే పుట్టాడు. ఇంతకూ వారి కోరికల వెనుక వృత్తాంతమేమిటి?**

అయ్యో! ఉపవాసాలతోనూ, దుష్కర తపశ్చర్యతోనూ చిక్కి శల్యమైనాను. ఈ రాజులా భోగభాగ్యాలను అనుభవించగలిగే అవకాశమే నాకు లేకుండా పోయింది. పుణ్యరాశి ఇంకా ఏదైనా మిగిలి ఉంటే ఈ రాజులా జన్మిస్తే బాగుణ్ణు! నా కల ఫలించాలి.

అతని మాటలు సమీపంలో ఉన్న మరి రెండు చక్రవాకాలు విన్నాయి. ఇలా అన్నాయి.

స్వతంత్రా! నువ్వు రాజుగా జన్మిస్తే మేము నీకు మంత్రులం అవుతాం.

వాటి మాటలకు ఆనందించాడు స్వతంత్రుడు. అతని ఆనందాన్ని గమనించి, మిగిలిన నాలుగు చక్రవాకాలు ఇలా అన్నాయి.

స్వతంత్రా! నీ కోరిక నెరవేరుతుంది. కాంపిల్య నగరాధీశుడివి అవుతావు. ఆ ఇద్దరు కూడా వారు కోరుకున్నట్టుగా నీకు మంత్రులయి ఆనందిస్తారు.

బాగున్నది అనుకున్నంతనే ఆ మూడు చక్రవాకాలకీ బాధ కలిగింది. అన్నదమ్ముల్ని వీడి బ్రతకలేమనుకున్నారు. మాకు రాజు-మంత్రుల జన్మలు వద్దని ప్రాధేయపడ్డారు. అప్పుడు అన్నాడిలా సుమనుడు.

మన ఏడుగురికీ మరో పక్షిజన్మ ఉన్నది. అనంతరం ఈ స్వతంత్రుడు మహారాజై జన్మిస్తాడు. వారిద్దరూ అతనికి మంత్రులవుతారు. అందరికీ సద్గతి లభిస్తుంది.

కొన్నాళ్ళకు చక్రవాకాలు మరణించాయి. మానస సరస్సులో హంసలై జన్మించాయి. పూర్వజన్మ పేర్లతోనే వర్ధిల్లాయి. గాలినీ, నీటినీ ఆహారంగా స్వీకరించి శరీరాలను శుష్కింపజేసుకున్నాయి. అప్పుడు విభ్రాజునికి అణూహుడు జన్మించాడు. తన కుమార్తె కీర్తిమతిని శుక్రుడు, అతనికి పత్నిగా సమర్పించాడు. కొన్నాళ్ళకు అణూహునికి రాజ్యాభిషేకం చేసి, విభ్రాజుడు మానససరోవరానికి చేరుకున్నాడు. తీవ్రతపశ్చర్య ఆచరించసాగాడు. అప్పుడు అతని కంటికి యోగదీక్షలో ఉన్న హంసలు కనిపించాయి. ఆశ్చర్యపోయి చూశాడు వాటిని. ఆశించాడిలా.

వీటిలో ఏ ఒక్కదానికైనా నేను కుమారుడిగా జన్మిస్తే బాగుణ్ణు! నిశ్చలయోగనిష్ఠ సిద్ధింపజేసుకోవచ్చు.

కొంతకాలానికి అణూహునికి స్వతంత్రుడు అన్నవాడు 'బ్రహ్మదత్తుడు'గా జన్మించాడు. చిత్రదర్శన, సునేత్రులిద్దరూ బ్రాహ్మణులై జన్మించి, బాభ్రవ్యుడు, కండరీకుడు పేర్లతో బ్రహ్మదత్తునికి ఆత్మీయమిత్రులైనారు. ముగ్గురూ వేదవేదాంగాలు అభ్యసించారు. సమస్తకళల్లోనూ పాండితిని సాధించారు. అయితే ఆ ముగ్గురికీ పూర్వజన్మస్మృతి కొరవడింది. బ్రహ్మదత్తునికి బాభ్రవ్యుడే ఆచార్య

డయ్యాడు. వేదవేదాంగ అధ్యయనంలో తోడుపడ్డాడు. కండరీకుడు అధ్వర్యుడై యజ్ఞయాగాది కర్మలన్నీ నిర్వర్తింపజేశాడు. ముగ్గురూ నిరంతరరాజ్య భోగాలు అనుభవించసాగారు. కొన్నాళ్ళకు అణుహుడు, బ్రహ్మదత్తుని రాజుని చేసి అరణ్యాలకు చేరుకున్నాడు. అక్కడ తీవ్రతపశ్చర్య ఆచరించి పరమపదం పొందాడు. బ్రహ్మదత్తుడు అప్పుడు దేవలుని కుమార్తెను వివాహం చేసుకుని, గృహస్థధర్మం స్వీకరించాడు. ప్రజాపరిపాలనం సాగించాడు.

మిగిలిన నాలుగు హంసలూ కాంపిల్యనగరంలో ఒకానొక శ్రోత్రియునికి కుమారులుగా జన్మించాయి. ధృతిమంతుడు, సుమనుడు, విద్వాంసుడు, తత్త్వదర్శిగా వారు లోకప్రసిద్ధమయ్యారు. అంతేకాదు, పూర్వజన్మవిజ్ఞానాన్ని ఎంతమాత్రం విస్మరించక, వేదవేదాంగాలను అభ్యసించి, ధ్యానాసక్తితో కాలం వెళ్ళబుచ్చారు. మరికొంత కాలానికి తండ్రిని సమీపించి, చెప్పారిలా.

మేము నలుగురమూ సిద్ధమార్గాన్ని అవలంబించాలనుకుంటున్నాం. మీ ఆశీస్సులు కావాలి అని వెళ్ళబోయారు. తండ్రి వారిని వారించి తన బాధను వెళ్ళగక్కాడిలా.

నలుగురు విద్వాంసులు నాకు కుమారులుగా జన్మించారని ఆనందపడ్డాను. ఆనందపడినంత సేపు లేదు, మీరు నన్ను విడచి వెళ్ళిపోతామంటున్నారు, మీకిది న్యాయమా? అనుభవించిన పేదరికం చాలదా? దయచేసి ఉండండి! మీరూ ధనికులై, నన్నూ ధనికుణ్ణి చెయ్యండి.

నిన్ను ధనికుణ్ణి చేస్తాం. నీకు అఖండభాగ్యాన్ని కలుగజేస్తాం. మమ్మల్ని వదిలిపెట్టు అన్నారు కుమారులు.

మేము నీకు ఓ రెండు శ్లోకాలు ఇస్తాం. ఆ శ్లోకాలను కాంపిల్యపురాధీశుడు వినేటట్టుగా నువ్వు గట్టిగా చదవాలి. ఆ పురాధీశుడు నీ శ్లోకాలను విన్నట్టయితే నీకు అగ్రహారాలు, ధనధాన్యాలు అన్నీ సమకూరుతాయి. ఇది నిజం అన్నారు కుమారులు. అన్నట్టుగానే తండ్రికి రెండు శ్లోకాలు ఇచ్చారు. చదివి వినిపించారు. అరణ్యాలకు వెళ్ళిపోయారు. అక్కడ అచంచల యోగనిష్ఠులై, యోగీశ్వరులై మహోత్తమపదం చేరుకున్నారు.

తన కోరిక ప్రకారం విభ్రాజుడు బ్రహ్మదత్తునికి కుమారుడిగా జన్మించాడు. విష్వక్సేనుడు పేరిట విశ్వవిఖ్యాతి చెందాడు. సంతానవంతుడైన బ్రహ్మదత్తుడు ఒకనాడు భార్యసహా నగర ఉద్యానవనంలో విహరిస్తున్నాడు. అప్పుడు అతను రెండు చీమల్ని గమనించాడు. ఒక మగచీమ, ఆడచీమపై కోరిక పెంచుకుని, తన కోరిక తీర్చమని ప్రాధేయపడసాగింది. అయితే ఆడచీమకు ఆ మగచీమంటే పడదు. దాంతో అది ఒప్పుకోలేదు. ఛీకొట్టింది. ఆ మాటలు విన్నాడు బ్రహ్మదత్తుడు. పకపకమని నవ్వాడు.

భర్త తనని చూసే నవ్వినాడనుకుని, ఆ భార్య అనేకదినాలు అన్నం ముట్టక తదేకధ్యానంలో చిక్కి సగం అయింది. భార్య ప్రవర్తన అంతు చిక్కక, బ్రహ్మదత్తుడు విలవిల్లాడాడు. ఒకనాడు ఏమిటిది? ఎందుకిదంతా? అని గట్టిగా అడిగాడామెను.



మీరు ఆనాడు ఉద్యానవనంలో నన్ను చూసే నవ్వారు. నేనూ నా అందం నవ్వులపాలయినాయి. ఇకనెందుకు ఈ జీవితం అనిపించింది. ఇలా తయారయ్యాను అన్నది. అవునా! అని ఆశ్చర్యపోయి, ఆనాడు తానెందుకు నవ్విందీ స్పష్టంగా వివరించాడు బ్రహ్మదత్తుడు.

నమ్మనుగాక నమ్మను అన్నదామె. దేవతావరం, పూర్వజన్మతపోవిభవం, అత్యద్భుత యజ్ఞక్రియలవల్లనే చీమల మాటలను మహాత్ములు వినగలుగుతారు. పరులకు అది అసాధ్యం. మీరు అబద్ధం ఆడుతున్నారు. నిజం చెప్పలేదో నేను ఆత్మాహుతి చేసుకుంటాను. ఒట్టు అన్నది. ఏం చెయ్యాలో తోచలేదు బ్రహ్మదత్తునికి. ఆ నారాయణుడే దిక్కు అనుకున్నాడు. అతనికోసం ఆరు రోజులపాటు నిష్ఠగా ఉపవాసవ్రతం ఆచరించాడు. ఏడవరోజు వేకువవేళ కలలో నారాయణుడు సాక్షాత్కరించి అభయాన్ని ప్రసాదించాడిలా.

రాజా! రేపు ఉదయం నీకు శుభం జరుగుతుంది. ఇక నీకు ఎలాంటి బాధలూ ఉండవు.

మేల్కొన్నాడు బ్రహ్మదత్తుడు. శ్రీహరి సాక్షాత్కారం అయింది. ధన్యుణ్ణి అనుకున్నాడు. తెల్లారుతూనే స్నానసంధ్యాదులు ఆచరించాడు. అందంగా అలంకరించుకున్నాడు. భార్యసహా బంగారురథాన్నెక్కి ఉద్యానవనానికి బయల్దేరాడు. అప్పుడతనికి కండరీకుడు సారథ్యం వహించాడు. బాభ్రవ్యుడు వింజామరతో వీస్తూ అతనికి ఉల్లాసాన్ని కలిగించాడు. అది గమనించిన బ్రాహ్మణుడు, తనకి నలుగురు కొడుకులూ ఉపదేశించిన శ్లోకాలను బ్రహ్మదత్తునికి వినిపించేట్టుగా గట్టిగా చదివాడు. వాటి అర్థం ఇది:

పూజ్యులారా! మీరంతా వేదవేదాంగవేత్తలు. ముందు మీరు సప్త విప్రోత్తములుగా కురుక్షేత్రంలో జన్మించారు. తర్వాత దశార్ణదేశంలో బోయలై జన్మించారు. ఆ తర్వాత కాలాంజనపర్వతంపై మృగాలై జన్మించారు. తర్వాత చక్రవాకాలైనారు. ఆ తర్వాత హంసలై మానససరోవరంలో విహరించారు. మీలో నలుగురు మహోత్తమసిద్ధపదం చేరుకున్నారప్పుడే! మిగిలినవారు వారి దారి అనుసరించక ఇంకా ఇలా సుఖసౌఖ్యాల్లో తేలియాడుతున్నారు. ఇది న్యాయమా?

శ్లోకాల్ని విన్న వెంటనే బ్రహ్మదత్తునికి కరచరణాలాడలేదు. కండరీకుడు పగ్గాలు విడచిపెట్టి, అయోమయానికి గురయ్యాడు. చేతిలోని చామరాన్ని విడచి, బాభ్రవ్యుడు ఆందోళన చెందాడు. ఆ ముగ్గురినీ గమనించి, పరిజనులూ, పౌరులూ విభ్రాంతి చెందారు. కాసేపటికి బ్రహ్మదత్తునిసహా కండరీకుడు, బాభ్రవ్యుడు తేరుకున్నారు. పూర్వజన్మవిజ్ఞానాన్ని పొందారు. ఆనందించారు.

పూర్వజన్మవిజ్ఞానాన్ని ప్రబోధించిన బ్రాహ్మణుణ్ణి సమీపించాడు బ్రహ్మదత్తుడు. అతనికి అపార సంపత్తిని బహూకరించాడు. మంత్రులుసహా అతనికి చేతులు జోడించి నమస్కరించాడు.

**-అరణి**



# స్నేహంలో సెక్స్‌కోసం వెంపర్లాడితే?

**టీనేజ్ లవ్!**
**ఎదిగే వయసు!**
**ఒదిగి ఉండలేరు కుదురుగా ఉండలేరు!**
**కుర్ర వయసులో బెదిరేకళ్ళను, అదిరే పెదవులను చిలిపి మనసులను చాలెంజ్ చేస్తారు అబ్బాయిలు!**
**అమ్మాయిల గుండెల్లో హీరో ఛాన్సులకోసం క్యూలు కడతారు!**
**లల్లీ కళ్ళకు లైనేస్తారు! ఐ లవ్యూ అంటూ రోజాలిస్తారు!**
**ఊహల్లో ఊరేగుతూ, ఊసులతో బతికేస్తుంటారు!**

ఔను మరి! టీనేజ్‌లో ప్రేమతాలూకు మధురిమలు అలానే ఉంటాయి. కనపడిన అమ్మాయినో లేదా అబ్బాయినో అదేపనిగా చూడడం, వెనక్కు తిరిగి చూడటం, నక్కి నక్కి చూడటం, నచ్చితే ఐ లవ్యూ చెప్పడం... ఇదే తంతు. కానీ అసలైన ప్రేమ ఎలా ఉంటుంది? ముందు ఆ విషయం తెలుసుకోవాలి.

### అదే అసలైన ప్రేమ

ప్రేమలో పడితే ఏమవుతుంది? దానికి సమాధానం ఒకటే, ఆ ప్రేమ స్వచ్ఛమైనదైతే ఆ ఉద్వేగాల్లో పరిపూర్ణత ఉంటుంది. ప్రేమిస్తున్న వ్యక్తికి చేరువగా ఉండాలనే బలీయమైన కోరికతో ప్రారంభమై భావాతీతమైన ఆదర్శంతో కూడుకున్న త్యాగం వరకు అనేక ఉద్వేగాలుంటాయి. వారికోసం ఏమైనా చేయాలనుకుంటారు. అదే అసలైన ప్రేమ అంటే. అలాంటి ప్రేమ టీనేజర్స్‌లో ఉండదా అంటే ఉంటుంది కానీ అది కొంత కాలం వరకే! ఆ వ్యక్తితో స్థిరపడిన తర్వాత కూడా ఆ ప్రేమ అలాగే కొనసాగితే అప్పుడు వారిది నిజమైన ప్రేమ అని చెప్పుకోవచ్చు.

### టీనేజర్ దశలు

టెరాషెంకో అనే మనస్తత్వవేత్త టీనేజర్స్ నాలుగు దశలను అధిగమించాల్సి ఉంటుందని చెబుతాడు. అవి:

**గ్యాంగ్ స్టేజ్:** ఈదశలో ఆడపిల్లలు, ఆడపిల్లలతోనూ, మగపిల్లలు మగపిల్లలతోనూ జట్లుగా ఏర్పడతారు. జట్లు జట్లుగా తిరుగుతారు.

**ఫ్రెండ్‌షిప్ స్టేజ్ :** ఈ దశలో జట్టు కట్టి తిరగడం మానేసి కేవలం ఒకరితో మాత్రమే స్నేహంగా ఉంటారు. మిగిలిన అందరితో మాట్లాడుతూ ఉంటారు. ఈదశలో అబ్బాయి లేదా అమ్మాయికి స్నేహం ఒకరితో మాత్రమే ఉంటుంది. తమ కష్ట సుఖాలు చెప్పుకోవడం, ఆదర్శలక్షణాలు ఇందులో ఉంటాయి. అయితే ఈ స్నేహం సేమ్ జెండర్స్ మధ్య మాత్రమే ఉంటుంది.

**అట్రాక్షన్ స్టేజ్ :** ఈ దశలో ఆపోజిట్‌సెక్స్‌వైపు మనసు లాగుతూ ఉంటుంది. మోహపూరితంగా ప్రవర్తిస్తారు. అంటే ఆడపిల్లలు మగపిల్లలతోనూ, మగపిల్లలు ఆడపిల్లలతోనూ స్నేహం చేయడానికి ఉవ్విళ్ళూరుతుంటారు.

**లవ్ స్టేజ్:** తనకు నచ్చిన ఎవరో ఒక ఆపోజిట్ సెక్స్‌ను ఎన్నుకుంటారు. వాళ్లతో ప్రేమలో పడడం ఈదశ ప్రత్యేకత. అయితే ఇందులో మళ్లీ రెండు దశలుంటాయి. ప్రారంభదశలో ఆదర్శపూర్వకమైన రొమాంటిక్ ప్రేమ ఉంటుంది. ఆతర్వాత అసలు సిసలైన ప్రేమ ఉంటుంది. పైన చెప్పుకున్న దశలన్నీ కూడా పరిపక్వ వ్యక్తిత్వానికి అవసరమైన పురోగమన లక్ష్యాలు. టీనేజర్స్ ఒక్కోదశ దాటుకుంటూ వెళతారు. నిజమైన ప్రేమకు అవసరమైన బరువు బాధ్యతలు స్వీకరించగలస్థాయికి చేరుకుంటారు. అంటే అందుకు తగిన వ్యక్తులుగా సంసిద్ధమవుతారన్నమాట.

### వివిధ రకాల ఉద్వేగాలు

టీనేజర్స్‌లో ప్రేమ, ద్వేషం అనే రెండు రకాల ఉద్వేగాలు ఉంటాయి. అయితే ఈరెండు సెంటిమెంట్లూ ప్రేమిస్తున్న వ్యక్తివైపు కేంద్రీకరించబడ్డ రెండు విరుద్ధ భావోద్వేగాలు. ప్రేమలో ప్రేమిస్తున్న వ్యక్తికి దగ్గర కావాలన్న ఆకర్షణ, ఆ తాలూకు తపన ఉంటే, ద్వేషంలో దూరం కావాలన్న వికర్షణ పూర్వకమైన వాంఛ ఉంటుంది. ప్రేమ, ద్వేషం రెండూ టీనేజ్‌లో తీవ్రస్థాయిలో ఉంటాయి. టీనేజ్ ప్రేమ సెక్స్‌కు సంబంధించింది మాత్రమే అనుకుంటారు చాలామంది. కానీ అది వాస్తవం కాదు. టీనేజర్స్ ప్రేమలో ఉండే సెక్స్ అంశం, ప్రేమ తాలూకూ రంగురంగుల అల్లికలో కలిసివుండే ఒక దారం మాత్రమే. అందుకే టీనేజ్‌లో ప్రేమ మొదలయ్యే ముందు కలిగే వివిధ రకాల ఉద్వేగాల గురించి తెలుసుకుందాం!

### ఫ్రెండ్‌షిప్

ఇద్దరు వ్యక్తులమధ్య ఒకేరకమైన ఆసక్తులు,



అభిరుచులు ఉంటే అవి వాళ్ల మధ్య ఆకర్షణ ఏర్పరిచి తద్వారా వాళ్ల మధ్య స్నేహానికి దారితీస్తాయి. ఆటలు, హాబీలు, సినిమాలు, పుస్తకాలు వంటి విషయాల్లో ఇద్దరిమధ్య ఒకేరకమైన అభిరుచులు ఉంటే వాళ్లిద్దరూ స్నేహితులు కావడం సహజం. స్నేహంలో సేమ్ జెండర్ వ్యక్తులే స్నేహంగా ఉండాలని లేదు. ఆడమగ ఎవరు ఎవరితోనైనా స్నేహం చేయవచ్చు. సెక్స్‌లేని స్నేహం ఉంటుంది. స్నేహం లేని సెక్స్ కూడా ఉంటుంది. సామాన్యంగా టీనేజర్స్ మధ్య స్నేహం పటిష్టం కావడానికి కారణం ఇరువురూ ఒకేరకం సమస్యలు ఎదుర్కొంటూ ఉండటమే. ఈ సమస్యల మూలంగానే ఇద్దరు అమ్మాయిలు గానీ, అబ్బాయిలుగానీ ఒకరికొకరు బాగా చేరువ అవుతారు. ఒకరి కష్టసుఖాలు మరొకరికి చెప్పుకుని సేదతీరుతుంటారు.

### మెచ్చుకోలుతనం

ఇతరుల్ని మెచ్చుకోవడం, ఇతరుల నుంచి మెప్పు కోరుకోవడం టీనేజర్స్‌లో కనిపించే ప్రత్యేక లక్షణం. ఒక మనిషిలో మనం ఉన్నతంగా భావించే లక్షణం ఏదో ఉంటుంది. ఆ లక్షణం మనలో ఉండాలని కోరుకుంటాం కానీ ఉండదు. అందుకే ఆ వ్యక్తిపట్ల మెచ్చుకోలుతనం చూపిస్తాం. సౌందర్యం, మంచితనం, వాక్చాతుర్యం, విజ్ఞానం, తెలివితేటలు, ధైర్య సాహసాలు... ఏవైనా కావచ్చు తనలో లేని ఇలాంటి లక్షణం ఏదైనా ఎదుటిమనిషిలో కనిపించినప్పుడు అబ్బాయిలు, అమ్మాయిలు ఒకరిపట్ల ఒకరు ఆశ్చర్యంతో ఆకర్షితులవుతారు. ఆ వ్యక్తిపట్ల మెచ్చుకోలుగా చూస్తారు. తర్వాత తర్వాత అది ఆరాధనాభావంగా దారి తీస్తుంది.

### ప్రేమలో గౌరవం

ఒక మనిషిని మెచ్చుకోకుండానే ఆ వ్యక్తిపట్ల గౌరవం ప్రదర్శించవచ్చు ఆ గౌరవంలో ప్రేమ ఉండాల్సిన అవసరమూ లేదు. ఒక ఉపాధ్యాయుణ్ణి విద్యార్థి గౌరవించడం లాంటివి ఈకోవలోకే వస్తాయి. ప్రేమలో కూడా గౌరవించడం తప్పకుండా ఉంటుంది. ఓ కుర్రాడు ఒక అమ్మాయిని నిజంగా ప్రేమిస్తోంటే ఆమెను గౌరవిస్తాడు. ఆమె అంగీకారం లేకుండా ఆమెతో సెక్స్ చేయాలని కోరుకోడు. అలా కోరుకున్నాడంటే ఆమెపట్ల గౌరవం లేదనే అనుకోవాలి. గౌరవంలేని ప్రేమ నిజమైన ప్రేమ కానే కాదు. ఒక అమ్మాయితో స్నేహం చేస్తున్నప్పుడు సెక్స్ కోసం అబ్బాయి వెంపర్లాడాడంటే అతనికి తనపట్ల గౌరవం లేదని అమ్మాయి భావిస్తుంది. ఆమెకూ అతడిపట్ల గౌరవం పోతుంది. అక్కడితో ఆ స్నేహం ముగిసిపోతుంది. అలా కాకుండా అతడు సెక్స్ ప్రస్తావన లేకుండా స్నేహం కొనసాగిస్తుంటే అతనిపట్ల గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవభావం నుండే ప్రేమ ఉద్భవిస్తుంది.

### రొమాంటిక్ ప్రేమ

రొమాంటిక్ ప్రేమ పూర్తిగా సెంటిమెంటుకు సంబంధించింది.. రొమాన్స్ అంటే అవాస్తవం అని అర్థం. టీనేజర్లలో ఎక్కువగా ఈ రొమాంటిక్ ప్రేమలు ఉంటాయి. ఇష్టమైన స్టార్‌ని అభిమానిస్తూ వారిని అంతకు మునుపు చూడకపోయినా, భవిష్యత్తులో చూస్తామన్న ఆశ లేకపోయినాసరే అతని చుట్టూ రకరకాల రొమాంటిక్ గాథలు అల్లుకుంటారు. అభిమానిస్తారు. ప్రపంచంలో ఇంక అంతకంటే అద్భుత వ్యక్తి లేడన్నట్లుగా భావిస్తారు. ఇందుకు కారణం ఆ ఆరాధనా భావంలో వారు తాదాత్మ్యం చెందటమే! అతడు ఆరాధించే హీరో లక్షణాలలో, అతడు సాధించే విజయాల్లో తనను తాను చూసుకుంటూ సంతృప్తి చెందుతుంటాడు అభిమాని. ఇందుకు కారణం వాళ్లలో ఏదో ఒక లక్షణాన్ని ఆ హీరో సింబలైజ్ చేస్తుండటమే! సినిమా తారలకున్న అభిమానులలో అత్యధికులు టీనేజర్సే ఉండడానికి కారణం కూడా ఇదే.

ఆంతరంగిక స్నేహితునితో కాలక్షేపంచేసే దశ దాటి ఆపోజిట్‌సెక్స్ పట్ల ఆకర్షణ అంకురించే దశకు చేరుకునేలోపు ఆడపిల్లల్లోనూ, మగపిల్లల్లోనూ మరో చిన్న మార్పు జరుగుతుంది. అది ఒంటరితనం కోరుకోవడం! ఇలా ఒంటరితనం కోరుకునే దశ ఆడపిల్లల్లో 14 లేక 15 సంవత్సరాల మధ్య ఉంటే, మగపిల్లల్లో 15 లేక 16 సంవత్సరాల ప్రాంతంలో ఉంటుంది. వారి వారి మనస్తత్వాలు పరిసర స్థితిగతులను బట్టి ఈ వయస్సు కొంచెం అటూ ఇటూగా కూడా ఉండొచ్చు. దీనిని ఆపోజిట్ సెక్స్ ఆకర్షణకు గురయ్యే ముందువచ్చే సంధి కాలంగా భావించవచ్చు

ఈ సంధికాలానికి సూచనగా అబ్బాయి లేక అమ్మాయి చాలా మూడీగా ఉండడం కనిపిస్తుంది. ఇంతకు ముందులా ఆత్మీయుడైన స్నేహితుడితో అన్నీ చెప్పుకోవడం తగ్గిపోతుంది. ఒంటరిగా కాలం గడపటానికి ప్రయత్నిస్తారు. అంతకు ముందున్న ఆప్త స్నేహితునికి కూడా అర్థం కాదు. ఇదంతా రొమాన్స్ కాలానికి సూచనగా చెప్పుకోవచ్చు.

ఈరకమైన ఉద్వేగాల కారణంగా వారు కొన్ని కొన్ని తప్పులు చేస్తుంటారు. బంగారంలాంటి జీవితాన్ని పాడుచేసుకుంటుంటారు. ఎదగాల్సిన దశలో ఆకర్షణలకు లోనవుతారు. ఆ ఆకర్షణనే నిజమైన ప్రేమ అనుకుంటుంటారు. మరి వారితో ఎలా నడుచుకోవాలి, ఒకవేళ అబ్బాయి తప్పుచేస్తే ఏం చేయాలి అన్నది ముందు ముందు చూద్దాం!

**-లతాకమలం**

email:lathakamalam@gmail.com

## అసలు ప్రేమంటే ఏమిటి?



తల్లిదండ్రులకు పిల్లలపై ప్రేమ ఉంటుంది. పిల్లలకు తల్లిదండ్రులపై ప్రేమ ఉంటుంది. స్నేహితుల మధ్య ప్రేమ, దేశంపై ప్రేమ.... ఇలా ప్రేమలు ఎన్నో రకాలు. వీటన్నింటి కంటే విభిన్నమైనది లవర్స్ మధ్య ప్రేమ. ఇది మాత్రం సగటున రెండేళ్ళు ఉంటుందని మానసిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. బాల్యంలో తల్లిదండ్రులు పెద్దలతో కలిసి మెలిసి ఉండే తీరు పిల్లల్లో ఆడ, మగకు సంబంధించిన భావనలు కలిగిస్తుంది. పెరిగేటప్పుడు చుట్టుపక్కల వాళ్లతో, అదే వయసు వారితో వ్యవహరించే తీరు తన భవిష్యత్తు భాగస్వామి ఎలా ఉండాలనే అంశానికి జీవంపోసి దాన్నొక నిర్ణయంగా తీర్చిదిద్దుతుంది.

## టెంప్టేషన్స్‌వైపు నడిపించే అంశాలు

కుర్రకారు, యువతను టెంప్టేషన్స్ వైపు నడిపించే అంశాలు ఏవి? అనే విషయంపై సైకాలజిస్టులు, పలు సంస్థలు చేసిన పరిశోధనల్లో ఆసక్తికర అంశాలు వెల్లడయ్యాయి. పిల్లల్ని ప్రలోభాలకు పురిగొల్పుతున్న వారు తల్లిదండ్రులు, పెద్దలే అని ఈ పరిశోధనల్లో తేలడం ఆశ్చర్యం కలిగించే విషయం. ఆ తర్వాత స్థానాల్లో ఇంటర్నెట్, టీవీ, ఫ్రెండ్‌షిప్ గ్యాడ్జెట్స్ ఉన్నాయి. హద్దుల్లేని స్వేచ్ఛ, పరిమితులు లేని అవకాశాలు టీనేజర్స్‌ను టెంప్టేషన్స్ వైపు తోసుకుపోతున్నాయి. అందుకే నిండు నూరేళ్ల పచ్చగా, పరిపుష్టిగా వర్ధిల్లవలసిన పసివారు పదిహేను, పదహారేళ్లకే పక్కదారులు పడుతున్నారు. అధోజగత్తుకు, పతనావస్థలోకి జారిపోతున్నారు. ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్నారు.



# మనోరామం

-సాయిరాం ఆకుండి

**మనోభావాల పేరుతో హృదయాలయాల్లో గుడి కట్టాల్సిన దేవుడిని నడిరోడ్డున నిల బెట్టి ఆ దేవుని మనోభావాన్ని గాయపరచడం మనుషులకి తగునా?**

•••

**ఉచ్ఛ్వాస నిశ్వాసాలకతీతంగా హృదయాంతరాళాలలోంచి వెలువడే ఒక్కో రామశబ్దం వెండికొండల శిఖరాగ్రాలను స్పర్శించి వేవేలసార్లు ప్రతిధ్వనిస్తోంది. వేదాత్మకంగా, పంచ భూతాత్మకంగా, సర్వేంద్రియాలను ఉత్తేజపరుస్తోంది. అణువణువూ సృజిస్తూన్న ఆ రామ శబ్దం అక్కడ సీతాసమేత పరివేష్టితుడైన తన రామునికి పాదార్చన చేస్తూంటే....**

ఇక్కడ సమున్నత హిమసానువుల్లో సీతా సమేతుడైన రాముణ్ణి మదిలో ప్రతిష్ఠించి రామ నామగానంతో పునీతుడవుతున్నాడు హనుమ. అలాంటి హనుమ మనసులో ఈరోజు ఏదో వెలితి!

యుగధర్మం అనుసరించి ధర్మపరిరక్షణకు పూనుకుంటాడు తన స్వామి. కొంగొత్త అవతారం దాల్చేందుకు మునుపటి అవతారాన్ని పరి సమాప్తి నొందిస్తాడు. ఆ క్రమానుగతిలో తన రామాత్మత అజరామరం గావాలనే ఆశయ స్ఫూర్తితో రామగానంలో పునీతుడవుతున్నాడు హనుమ. కానీ అతడిలో కలవరం...!

•••

శ్రావ్యంగా, కర్ణపేయంగా, నవ్యాతినవ్యంగా అనంత వాయువ్యాపితమై అనునిత్యమూ తననుజేరుతుండా గానం. తన గానాన్ని సైతం మరపించేంతగా పవనపుత్రుణ్ణి ప్రభావితంచేసే దివాకరశాస్త్రి రామగానా మృతం హనుమచెవిని సోక లేదు ఈ రోజు. దాంతో అంజనీ తనయుని హృది భారమైంది.

అలనాడు సీతాసమేతుడైన రాముని నిండుసభలో తానెంతటి రామభక్తుణ్ణో నిరూపించేందుకు తన ఛాతిని చీల్చి తనలో కొలువైన నిత్య సీతారాముల దర్శనభాగ్యం ఆ సీతారాము లకే కలిగించాడు అంజనీపుత్రుడు. మనో రామ దర్శనం, రామనామ పఠనం, రామేతి హాస శ్రవణంతప్ప వేరేదీ తన ఆర్తిని తీర్చేది కాదని ప్రకటించిన హనుమకు రామ విశ్వా సమే ఊపిరి.

నిరంతర రామనామగానమే తన నైజమని విన్నవించి... మానససరోవర తీరాన యుగయుగాలుగా తన గానామృతంతో, వైకుంఠంలో కొలువైన తన రామునికి స్వరాభిషేకమొనర్చే మారుతి మదిలో కొద్దికాలంగా కలవరపాటు! కలియుగ ధర్మ ప్రభావమో, ఏమో తనలో వృద్ధాప్య ఛాయలు! శృతి లోపం! గొంతులో వణుకు!

తనకే శ్రావ్యంగా అనిపించని గానార్చన జడి! తన స్వామిని మెప్పించలేకపోతున్నానేమో! అపశృతులతో అయోధ్యాధీశునికి ఇబ్బంది కలి గిస్తున్నానేమో! అనిపిస్తోంది హనుమకు.

పరిపరివిధాల వేదనాభరితుడైన హను మకు ఒక వెలుగురేఖలా గోచరించాడు దివాకర శాస్త్రి.

తనపాలిట భాగ్యంలా గోచరించిన దివా కరశాస్త్రి భాగ్యనగరంలో తన రాముడి ఆల యంలో అర్చకుడు కావడం ఆంజనేయునికి మరింత సంతోషాన్నిచ్చింది.

సుప్రభాత సమయాన శృతిలయబద్ధంగా దివాకరశాస్త్రి చేసే సీతావల్లభస్తోత్ర గానా మృతాన్ని వైకుంఠపురిలోవున్న తన స్వామికి చేరవేస్తూ అలౌకిక ఆనందం పొందడం హనుమ దినచర్యగా మారింది.

ఈరోజు దివాకరశాస్త్రి గొంతు మూగ బోయింది. అన్యమనస్కుడైనాడు వాయునందనుడు. తన మనోనేత్రం తెరిచాడు.

•••

హైదరాబాద్‌లో తొమ్మిదోనంబర్ హైవే. చందానగర్ నుంచి మియాపూర్‌వైపు వెళ్ళే రహదారిలో గంగారం సమీపాన రోజూ ఉన్నట్టు గానే ఉదయం ఎనిమిదిగంటలకే ట్రాఫిక్ జామ్. ఆ ట్రాఫిక్ జామ్‌లో చిక్కుకుందో 108 వాహనం. ఆ వాహనంలో కూర్చుని హృదయ విదారకంగా విలపిస్తున్నాడు దివాకర శాస్త్రి. ఒంటినిండా గాయాలు, అధిక రక్తస్రావంతో అచేతనుడై పడివున్న తన కొడుకు లక్ష్మణ్‌ని చూస్తూ గుండె లవిసేలా రోదిస్తున్నాడు.

తెల్లవారుజామున దినచర్యలో భాగంగా ఆలయానికి బయల్దేరిన దివాకరశాస్త్రికి ఆ దుర్వార్త తెలిసింది. అక్కడికక్కడే కుప్పకూలి పోయాడు. పెద్దకొడుకు రామం ప్రమాద స్థలానికి పరుగుతీయగా ఇరుగుపొరుగువాళ్ళు గుడి దగ్గర్నుంచి దివాకరశాస్త్రిని తీసుకువెళ్ళారు.

నైట్‌డ్యూటీచేసి తిరిగొస్తున్న లక్ష్మణ్‌ని గుర్తు తెలియని వాహనం ఢీకొట్టింది.

రక్తపుమడుగులో పడివున్న కొడుకునిచూసి తల్లడిల్లిపోయాడు దివాకరశాస్త్రి.



# మళ్లీ నోరు పారేసుకుంది

**రా**ధికా ఆప్టేకి సినిమాల కన్నా ఇతరులను విమర్శించడం అంటేనే ఎక్కువ ఇష్టం లాగుంది. ఎప్పుడూ ఎవరినో ఒకరిని అనందే నిద్ర పట్టేట్టు లేదు ఆమెకు అంటున్నారు దక్షిణాది సినీ అభిమానులు. మొన్నామధ్య దక్షిణాదిలో పురుషాధిక్యత ఎక్కువంటూ కామెంట్ చేసింది. ఇప్పుడేమో తను నటించిన దక్షిణాది సినిమాల్లో 'కబాలి' తప్ప మిగతా సినిమాలు తనకు చుక్కలు చూపించాయని చెప్పుకొస్తోంది. అసలు రాధికా ఆప్టే తెలుగులో నటించినవే తక్కువ చిత్రాలు. ఈ సినిమాల్లో ఎవరు ఆమెకు చుక్కలు చూపించారో చెప్పకుండా విమర్శనాస్త్రాలు గుప్పించింది.



ఆ పరిసరాల్లోని చిన్న నర్సింగ్‌హోమ్‌ల దగ్గరికి తీసుకెళితే తమవల్లకాదన్నారు. పెద్దాసుపత్రిలో జేర్చమని చెప్పడంతో, ఆసరికే అక్కడికి చేరుకున్న 108 వాహనంలోకి లక్ష్మణ్‌ని ఎక్కించి బయల్దేరారు దివాకరశాస్త్రి, రామం.

గంగారం దగ్గరికి వచ్చేసరికి ఓల్వోబస్సులూ, సిటీసర్వీస్ వాహనాలూ, ఐటీ ఉద్యోగుల కార్లూ, టూ వీలర్లూ.. ఇలా అన్నిరకాల వాహనాల మధ్య చిక్కుకుంది 108 వాహనం.

ఆ ట్రాఫిక్‌జామ్‌లో ఉన్న ప్రతిఒక్కరి మదిలో 108 వాహనానికి దారి ఇవ్వాలనే కోరిక బలీయంగావుంది. అయినా ఇవ్వలేని పరిస్థితి. కనీసం ఒక్కఅడుగుమేర కూడా జాగాలేనంత దట్టంగా ట్రాఫిక్ ఆవరించుకునివుంది. ఇప్పుడప్పుడే క్లియరయ్యే పరిస్థితి కనిపించడంలేదు.

"ఈ హైదరాబాద్‌లో ట్రాఫిక్ ఎప్పటికి కంట్రోలవుతుందో ఏమో! ఇలాంటి ట్రాఫిక్ జాములవల్లే చాలా సీరియస్ కేసులు చెయ్యిదాటిపోతున్నాయి. ఇక ఆ దేవుడే వాళ్ళని కాపాడాలి".

**యుగాలుగా రామనామం జపిస్తున్న హనుమలో కలవరం రేగింది! నిత్యం తనస్వామి స్తోత్రగానం చేసే ఆ అర్చకాగ్రేసరుని గొంతు ఆరోజు మూగబోయింది. కారణం అతని కుమారుడు లక్ష్మణుడు ప్రమాదంలో గాయపడ్డాడు. అతన్ని తరలిస్తున్న 108 వాహనం ట్రాఫిక్‌లో చిక్కుకుంది. కాపాడమని ఆ రాముణ్ణి ప్రార్థించి ప్రార్థించి అలసిపోయాడా అర్చకాగ్రేసరుడు. మరి రాముడు కాపాడగలిగాడా? లేదా? హనుమ ఏం చేశాడు?**

డ్రైవర్ స్వగతం దివాకరశాస్త్రిని మరింత ఆందోళనకు గురిచేసింది.

అవును... దేవుడే దిక్కు....

"రామా... నువ్వుతప్ప నాకు వేరెవ్వరూ దిక్కులేరు. నీవే శరణు. త్వరగా హాస్పిటల్‌కి చేరుకునేలా చూడుతండ్రీ, నా కొడుకుని బ్రతికించు".

సమయం గడిచేకొద్దీ లక్ష్మణ్ దేహం వడలిపోతోంది. ఆగని రక్తస్రావం అతన్ని మృత్యుద్వారానికి చేరువ చేస్తోంది.

"కోదండరామా! ఎన్నోఏళ్ళుగా నువ్వే ఊపిరిగా, నువ్వే ప్రాణంగా అర్చనచేస్తూ ఎంతో కొంత పుణ్యం మూటగట్టుకున్నాను. ఆ పుణ్యంకొద్దీ పుట్టిన బిడ్డల్ని రామలక్ష్మణులుగానే భావించాను. నా లక్ష్మణుణ్ణి నాకు దూరం చెయ్యకు" రోదించాడు దివాకరశాస్త్రి.

ట్రాఫిక్ ఎంతోభారంగా కదులుతోంది. అప్పుడో అడుగూ అప్పుడో అడుగూ కదిలి ఆగిపోతున్నాయి వాహనాలు.

"రామా... ఎందుకు నాకీ క్షోభ. నేనేమైనా పాపం చేసుకున్నానా? నా కోరికలు తీర్చమని నిన్నెప్పుడూ వేడుకోలేదు. అష్టైశ్వర్యాలూ కలిగించమని పూజలు చేయలేదు. ఈ శిక్ష భరించలేకున్నాను. నాకు పుత్రభిక్ష పెట్టు రామా. ఈ ట్రాఫిక్‌లోంచి త్వరగా బైటపడి హాస్పిటల్‌కి చేరుకునేలా దారి చూపవయ్యా".

పరిపరివిధాల తనస్వామిని వేడుకుంటున్న దివాకరశాస్త్రిలో సమయం గడిచేకొద్దీ ఆందోళన పెరిగిపోతోంది.

ఏమీచెయ్యలేని నిస్సహాయత దివాకరశాస్త్రి మానసికస్థితిలో మార్పు తెచ్చింది. భక్తిస్థానంలో ఆక్రోశం, ఆవేశం చోటు చేసుకున్నాయి. తానెంత వేడుకున్నా రాముడు కనికరించడంలేదనే నిజం భరించలేకున్నాడు దివాకరశాస్త్రి.

"రాముడివా లేక రాయివా? నీకేం! సాక్షాత్తూ దైవస్వరూపం! అయినా నీకు సాయం చేసే వాళ్ళు చాలామందే ఉన్నారు. మేము నిమిత్తమాత్రులం, మామూలు మానవులం. కష్టాల్లో ఉన్నప్పుడు మమ్మల్ని ఆదుకోవడానికి నీకు మనసు రావడంలేదు".

అతడిలోని భక్తి కోపంగా పరిణమించింది.

"నీ తమ్ముడికి కష్టంవస్తే హనుమంతుడిచేత ఏకంగా సంజీవని పర్వతం రప్పించి లక్ష్మణుడి ప్రాణాలు నిలబెట్టావు. మానవమాత్రులకొచ్చే కష్టాలు విధిలిఖితాలని భావించి సర్దుకుపోవాలా? విధినే ఎదురొడ్డి నిలిచి సంజీవనితో నీ లక్ష్మణుడికి పునర్జన్మనిచ్చావు. నా లక్ష్మణుడి విషయం వచ్చేసరికి విధిరాత, తప్పించుకోలేం అనే ధర్మపన్నాలు వల్లిస్తున్నట్లుగా ఉంది నీ పద్ధతి. ఉలుకు పలుకు లేని నీ ధోరణిబట్టే తెలుస్తోంది నీ ఉద్దేశం".

●●●

మనోనేత్రంతో ఈ అనూహ్య సంఘటనలు వీక్షిస్తున్న వానరోత్తముని మనసంతా వేదనాభరితమైంది. కానీ దివాకరశాస్త్రి తనస్వామిని నిలదీయడం, నిందించడం హనుమకు పట్టరాని కోపం కలిగించింది.

అంతర్దృష్టిని వైకుంఠంవైపు మరల్చి శేషశయనుడైన లోకవల్లభునికేసి చూశాడు మారుతి.

యుగాలూ, అవతారాలూ ఎన్నెన్నో గడిచినా ఎప్పటికీ తన రామునిగానే గోచరించే మహావిష్ణువు చిద్విలాసంలో మార్పులేకపోవడంతో హనుమంతుడు కాస్త స్థిమితపడ్డాడు.

కోపం దిగి రావడంతో ఆ స్థానాన్ని జాలి ఆక్రమించింది. దివాకరశాస్త్రికి కలిగిన కష్టంచూస్తే ఆంజనేయునికి అలవికాని బాధ కలిగింది.

దివాకరశాస్త్రి ఆక్రోశంలో అర్థం ఉందనిపించింది. నిజమే కదా! ఆర్తజన పరిరక్షణే కదా భగవంతుని కర్తవ్యం. భక్తుల బాధలు కడతేర్చడంలో దీనబాంధవునికి ఎందుకింత అలసత్వం?

పరిపరివిధాల చుట్టుముట్టిన ఆలోచనలు హనుమ మానసిక సంఘర్షణను రెట్టింపు చేస్తున్నాయి.

●●●

కాలం కర్కశమైనది... దైన్యమూ, దుఃఖమూ, కోపమూ లాంటి భావావేశాలకు అది చలించదు.

తన ఆక్రందనలకు స్పందించి రాముడు ఏదో ఒక అద్భుతం చేస్తాడన్న నమ్మకం వమ్ము



## కత్తిలాంటి కత్రినా కాదట!

*మొన్నటి దాకా బాలీవుడ్ జనాలే కాదు దక్షిణాది వారు కూడా కత్రినాను 'కత్తి' అని ముద్దుగా పిలిచేవారు. దానికి కారణం కత్రినా అందచందాలే! సన్నటి నడుము, చూడచక్కని ఫిగర్ ఆమెకు 'కత్తి' బిరుదును తీసుకొచ్చాయి. కానీ ఆ బిరుదు పోయే ప్రమాదం వచ్చేసింది అంటున్నారు బాలీవుడ్ జనాలు. మొన్నామధ్య ఓ కార్యక్రమానికి కత్రినా హాజరయింది. ఆమెనుచూసి అందరూ ఒక్కసారి షాక్ తిన్నారట! కారణం కత్రినా బరువు పెరిగిపోయి బాగా లావుగా కనిపించడమేనట! మునుపటి అందాలు ఆమెలో మచ్చుకు కూడా కనిపించడం లేదని ఆమెను చూసిన వారందరూ అనుకున్నారట!*

కావడంతో దుఃఖభరితుడయ్యాడు దివాకర శాస్త్రి. పాలుపోనిస్థితిలో అతని మనసులో మారుతి మెదిలాడు.

"ఆంజనేయా! నీ స్వామిలో ఉలుకూ పలుకూ లేదు. కనీసం నువ్వైనా నా బాధ ఆ రామునికి చేరవేసి దయచూపే దారి చూడవయ్యా. అసలు ఏ రామకార్యమైనా నీ శ్రమ శక్తి లేకుండా జరిగిందా! రామునికి అత్యంత ప్రియభక్తుడవు. నువ్వు కోరితే రాముడు కాదనేది లేదు. దయచేసి దయచూపు".

•••

రామభక్తుడిగా తనకు అత్యంత ఇష్టుడైన దివాకరశాస్త్రి దైన్యస్థితి మారుతి మనసును అల్లకల్లోల పరుస్తోంది. ఏదో ఒకవిధంగా ఈ కష్టం తొలగించాలనే కోరిక బలీయంగా కలుగుతున్నప్పటికీ తన రాముని అభీష్టం తెలియరాక పోవడంతో కలిగిన సంశయం హనుమను ఎటూ పాలుపోనివ్వడం లేదు.

ఈ డోలాయమానం తట్టుకునేశక్తి భజరంగ బలునికే లేకపోయిన విచిత్రస్థితిలో తన బాధ్యతగా దివాకరశాస్త్రి వేదనను స్వామికి నివేదించి దారిచూపాలని వేడుకునేందుకు సిద్ధమయ్యాడు పవనసుతుడు. రాముని ముందు మోకరిల్లాడు.

"హనుమా"

మనో వీక్షణంతోనే తన బంటు ఆంతర్యం ఆసాంతం గ్రహించాడు రాముడు.

ముల్లోకాలను సమ్మోహనపరిచే ఆ దరహాసంలో ఇసుమంత అయినా మార్పులేదు.

"హనుమా! స్వామిగా, భక్తుడిగా మన ఇద్దరి బాంధవ్యం ముజ్జగములకూ విదితమే! సర్వజగద్రక్షకునిగా యుగాల తరబడి నన్ను కీర్తిస్తున్న నువ్వే ఈనాడు నన్ను సంశయదృష్టితో చూడటం భావ్యమా?"

అంజనీసుతుడు నివ్వెరపడిపోయాడు. తన స్వామికి బాధ కలిగించినందుకు విలవిలలాడాడు.

"మన్నించు స్వామీ, నిన్ను కీర్తించే ప్రతి భక్తుడూ నాకు అత్యంత ఆత్మీయుడే. అలాంటి భక్తాగ్రేసరుడి బాధ నన్ను కృంగదీస్తోంది. అంతేగానీ నిన్ను సందేహిస్తే నా భక్తికి అర్థమే లేదు. నా ఉనికికి పరమార్థమే లేదు".

కౌశల్యతనయుని కరుణదృష్టి ఆంజనేయునికి అనునయం కలిగించింది.

"ఈ యుగంలో నన్ను పూజించే భక్తులందరూ నాతో సమానంగా నిన్నూ పూజిస్తున్నారు. వారి దృష్టిలో నువ్వు భగవత్ స్వరూపానివి".

స్వామి మాటల్లో అంతరార్థం గ్రహించడానికి ప్రయత్నిస్తున్నాడు హనుమ.

"ఆర్తజన సంరక్షణ భగవత్స్వరూపునికి విస్మరించలేని బాధ్యత.

"స్వామీ... ఈ బాధ్యతా నిర్వహణలో నిన్ను మించిన దైవం వేరెవరూ లేరు" తన నివేదన వెనకున్న ఆర్తిని తెలియజెప్పాడు హనుమ.

"నీ బాధ్యత నాపై నెట్టి నన్ను ఒత్తిడి చేయడం సముచితమా హనుమా?"

సంభ్రమం చెందాడు హనుమంతుడు. "స్వామీ! అనునిత్యం నీ ఆదేశం మేరకే నడుచుకునే నేను నా బాధ్యత విస్మరించానా?"

"అటు చూడు"

అక్కడ జాతీయరహదారిమీదకు చొచ్చుకు పోయినట్లుగా ఉన్న భక్తహనుమాన్ ఆలయం. దాంతో రహదారి వెడల్పు తగ్గి రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. ఆ ట్రాఫిక్ జామ్‌లో చిక్కుకుంది 108 వాహనం. అందులో చావుబతుకుల మధ్య లక్ష్మణ్, ఏకధాటిగా ఏడుస్తున్న దివాకరశాస్త్రి.

"ఈ భక్తుని బాధ నివారించడానికి నువ్వే అడ్డంగా ఉన్నావు హనుమా!"

ఆంజనేయుడు చలనరహితుడయ్యాడు.

"ఆర్తజన పరిరక్షణలో శ్రీరామునికి హనుమంతుడే ఆటంకంగా నిలవడం ఎంత వైచిత్రి?"

ప్రసన్నాంజనేయుని మదిలో ప్రకంపనలు.

"ఇంత సమస్యకి కారణమవుతున్న ఆలయాన్ని రహదారి మధ్య ఉంచడం ఎందుకు? దాన్ని తొలగించవచ్చు కదా?"

మారుతి సంశయానికి సమాధానం లభించింది. "హనుమాన్ ఆలయం తొలగిస్తే అపచారం. భక్తుల మనోభావాలు దెబ్బతింటాయనేదే అందరి భావం".

అపరాధభావన ఆంజనేయుణ్ణి అస్థిరపరుస్తోంది. తన స్వామి భక్తుల సమస్యలకు తాను కారణం కావడం వేదనకు గురిచేస్తోంది.

సంజీవని పర్వతాన్ని భూమి పొరల్లోంచి పెకలించినట్టు తన ఆలయాన్ని రహదారి మధ్యలోంచి తొలగించాలనే బలీయమైన కోర్కె జనించింది. అందుకు ఉద్యుక్తుడయ్యాడు అంజనీ పుత్రుడు.

"యుగధర్మానుసారం ఇప్పుడు నీవు ఆ శక్తిని ప్రదర్శించలేవు హనుమా".

వాయునందనుడికి నిస్సత్తువ ఆవహించింది. అభయాంజనేయుడిగా తనను భావించే భక్తులకు తన అసహాయతను తెలియజెప్పడమెలా? అనే బాధ గుండెను కోస్తోంది. సర్వభక్తజనహితమే తన మనోభీష్టమని వెల్లడించడం ఎలా? వేదన చెందుతున్నాడు రామబంటు.

అందరూ తనలా హృదిలోనే భగవంతుణ్ణి ప్రతిష్టిస్తే ఇలా రహదార్లకెక్కే ఆలయాల అవసరమేలేదుగా! మనసులు విశాలమైతే ఇరుకు రహదార్లుండవు.

ముకుళిత హస్తాలతో రామునిపాదాలపై మోకరిల్లాడు హనుమ. "రామయ్యా, భక్తుల మనోభావాలలో మార్పు తీసుకురావయ్యా".

**సెల్:98481 10790**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు సరైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

శీతాకాలం అనగానే మనల్ని ఎక్కువగా భయపెట్టేవి శ్వాసకోశ సమస్యలు. మన పరిసరాలలో లేదా మన ఇంట్లోనే ఈ తరహా అలర్జీలతో బాధ పడేవారిని చూస్తుంటాం. అందులోనూ ముఖ్యంగా 'అలర్జిక్ రైనైటిస్' బాధితులే అధికం. వీరు – తమ ఆహారపు అలవాట్లలో, జీవన విధానాలలో మార్పులు చేసుకోవడం, శీతల పానీయాలను సేవించకపోవడం వంటి ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ ఈ వ్యాధి బారిన పడుతుంటారు.




'అలర్జిక్ రైనైటిస్'కు గురి అయిన పిల్లలు స్కూలు మానివేయడం, పెద్దవారైతే ఆఫీసుకు వెళ్ళలేకపోవడం, కొందరైతే రోజువారీ దినచర్యల పరంగా కూడా తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఇతర వైద్య విధానాలలో, దీనికి కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే పొందవచ్చు, కానీ సరైన హోమియో చికిత్స ద్వారా ఈ వ్యాధిని పూర్తిగా అధిగమించవచ్చు. సహజంగా మన రోగనిరోధక వ్యవస్థ జరిపే అసందర్భ ప్రతిచర్యనే 'అలర్జీ' అంటారు. అంటే మన శరీరానికి సరిపడని ఏదైనా పదార్థానికి స్పందనగా సాధారణానికి మించిన ప్రతిక్రియ జరగడం. దానికి కారణమైన పదార్థాన్ని 'అలర్జెన్' అని, అలాంటి ప్రతిచర్యను 'అలర్జిక్ రియాక్షన్' అని అంటారు.

**అలర్జిక్ రైనైటిస్ అనగా:** అలర్జెన్‌లు శ్వాస ద్వారా మన శరీరంలోకి ప్రవేశించినప్పుడు, మనలోని రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడం వలన ముక్కులోని శ్లేష్మపు పొర శోథమునకు గురికావడాన్ని వైద్యపరిభాషలో 'అలర్జిక్ రైనైటిస్' అని పిలుస్తారు. అలర్జిక్ రైనైటిస్ 2 రకాలు. **(1) సీజనల్ అలర్జిక్ రైనైటిస్ :** కేవలం ఒక ప్రత్యేకమైన కాలంలో మాత్రమే ఎదురుపడే అలర్జీ సమస్యను 'సీజనల్ అలర్జిక్ రైనైటిస్' అని అంటారు. పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువుల వలన ఇది ఎక్కువగా కలుగుతుంది. **(2) పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్ :** సంవత్సరం పొడవునా ఏ కాలంలోనైనా 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు గురికావటం జరిగితే – అటువంటి అలర్జీ సమస్యను 'పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్' అంటారు. దుమ్మూ–ధూళి, జంతుకేశాల వంటి అలర్జెన్‌లకు శరీరం సున్నితంగా స్పందించడం వలన ఈ తరహా రైనైటిస్ కలుగుతుంది.

**కారణాలు:** మన శరీరంలోకి ప్రవేశించిన అలర్జెన్ నుండి రక్షణ కల్పించటానికి 'హిస్టమిన్' అనే రసాయనం విడుదల కాబడి, తద్వారా అలర్జీ సమస్య ఏర్పడటంతో వెంటనే అలర్జిక్ లక్షణాలు కనిపిస్తాయి. • పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువులు, దుమ్మూ–ధూళి, బూజు, జంతుకేశాలు, వాతావరణ కాలుష్యం, వాతావరణ మార్పులు, చల్లని గాలి, సుగంధ పరిమళాలు (Perfumes), వృత్తిరీత్యా ఎదురయ్యే వాయు కాలుష్యాలు, పొగ త్రాగటం మరియు కుటుంబ చరిత్ర వంటి అంశాలన్నీ ఈ సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** అధిక సంఖ్యలో తుమ్ములు రావడం, ముక్కు కారడం లేదా ముక్కు దిబ్బడ, ముక్కు మరియు కళ్ళు దురదగా ఉండటం, కళ్ళ వెంబడి నీళ్ళు కారడం, దగ్గు, గొంతులో దురదగా ఉండటం, కళ్ళచుట్టూ నల్లని వలయాలు ఏర్పడటం, తరచూ తలనొప్పి, ముఖం వాపుగా ఉండటం, నీరసం, ఒళ్ళు నొప్పులు మరియు మగతగా ఉండటం • చర్మం ఎక్కువగా పొడిబారటం – దురదగా ఉండటం మరియు చర్మంపై బొబ్బలు ఏర్పడటం వంటి 'ఎగ్జిమా' లక్షణాలను కూడా గమనించవచ్చు.

**దుష్ఫలితాలు:** చిన్న పిల్లలు తరచూ దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురి అయినట్లయితే, అలాంటి పరిస్థితి ముఖ్యంగా ఆస్థమాకు దారి తీసే ప్రమాదం ఉంటుంది మరియు సైనసైటిస్, చెవిలో ఇన్‌ఫెక్షన్‌లు (Otitis Media), నిద్రలేమి, దంత సమస్యలకు కూడా ఇది దారి తీస్తుంది.

**నిర్ధారణ పరీక్షలు:** చాలా వరకు రోగి యొక్క లక్షణాలను బట్టి 'అలర్జిక్ రైనైటిస్'ను నిర్ధారించవచ్చు. • సి.బి.పి., ఇ.ఎస్.ఆర్. మరియు అబ్‌సెల్యూట్ ఇసినోఫిల్ కౌంట్ వంటి పరీక్షల ద్వారా వ్యాధిని నిర్ధారిస్తారు. • Radio Allergo Sorbent Test (RAST) ద్వారా మన శరీరంలో ఒక అలర్జెన్‌కు ఎంత మేరకు IGE Antibodies ఉన్నాయో తెలుసుకోవడం ద్వారా కూడా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** పుప్పొడి రేణువులు ఎక్కువగా ఉండే కాలంలో బయటకు ఎక్కువగా వెళ్ళకపోవడం • ఉదయాన్నే ఆరుబయట వ్యాయామాలు చేయకపోవడం • బయటకు వెళ్ళి వచ్చిన వెంటనే స్నానం చేయడం • 'ముక్కు'కు మరియు 'నోటి'కి మాస్క్ ధరించటం • శీతల పానీయాలు, ఐస్‌క్రీమ్‌లు తీసుకోకపోవడం • 'దుమ్మూ–ధూళి'కి దూరంగా ఉండటం • పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం వంటి జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా కొంతవరకు ఈ వ్యాధిని నియంత్రించవచ్చు

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా, ఎలాంటి శ్వాసకోశ సమస్యలనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక–శారీరక తత్వాలను పరిగణనలోకి తీసుకున్న అనంతరం మాత్రమే ఈ కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ ప్రారంభించబడుతుంది. ఈ విశిష్ట చికిత్సతో శరీర రోగనిరోధక వ్యవస్థలో గల అసమతుల్యతలను సరిచేయడం ద్వారా పైన తెలిపిన అలర్జీని కలిగించే పరిస్థితులు ఎదురైనప్పటికీ, మరోసారి తిరగబెట్టని విధంగా ఈ 'అలర్జిక్ రైనైటిస్' సమస్య సంపూర్ణంగా నయం కాబడుతుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in



ష్మైన వ్యాకరణ పడికట్లు, పరాయి భాషా ప్రభావం కాస్తంత తగ్గడానికి వంద ఏళ్లకు పైగా పట్టింది. అయితే, ఇంగ్లీషు విద్య కారణంగా విద్యా విధానం పూర్తిగా మారడంతో, పాఠశాలల్లో విద్యార్థులు తెలుగు చదువుకోవడానికి అనేకానేక అవరోధాలు ఎదురయ్యాయి.

ఇంగ్లీషు భాష ఆధిపత్యం కారణంగా వెనుకపట్టు పట్టిన తెలుగు భాషను మళ్లీ ప్రధాన భాషగా అభివృద్ధి చేయడానికి, విద్యార్థుల్లో తెలుగు భాష పట్ల పూర్వాభిమానం పెంచడానికి ఎటువంటి చర్యలు తీసుకోవాలన్నదానిపై అటు భాషోద్యమ నేతలు, పండితులే కాకుండా ఇటు ప్రభుత్వ అధికారులు, పాలకులు కూడా మల్లగుల్లాలు ప్రస్తుతం పడుతున్నారు. తెలుగు భాషాభివృద్ధికి బ్రిటీష్ కాలం నాటి పరిస్థితులే ప్రతికూలంగా మారాయి. బ్రిటీష్ ప్రభుత్వ విధి విధానాలు పూర్తిగా ప్రతికూలంగా ఉన్నప్పటికీ, గిడుగు వంటివారు కొనసాగించిన అవిశ్రాంత పోరాటాల ఫలితంగా, తెలుగు భాషాభివృద్ధికి, అందులోనూ వాడుక భాషాభివృద్ధికి గొప్ప రచయితలు నడుం బిగించారు. గ్రాంధిక భాషా శైలిని తీవ్రంగా వ్యతిరేకిస్తూ, సరళం, గంభీరం, మనోహరం, సామాన్య జన సన్నిహితమైన తెలుగుకు ప్రాచుర్యం కల్పించడానికి ఈ రచయితలు ఉద్యమస్థాయిలో రచనలు సాగించారు.

# మాతృభాషతోనే సర్వతోముఖ వికాసం

**సొంత భాషను నిర్లక్ష్యం చేస్తే దీర్ఘకాలంలో సృజనాత్మకత, దేశ స్వావలంబన, సర్వతోముఖ వికాసం తీవ్రంగా దెబ్బ తింటాయి.**

**అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని పురస్కరించుకుని యునెస్కో ప్రతి ఏటా అంతర్జాతీయంగా మాతృభాషల పురోగతికి కార్యక్రమం నిర్దేశిస్తోంది. అందులో భాగంగానే 2016లో 'నాణ్యమైన విద్య, భాషాబోధన, సరైన లక్ష్యాలు' అనే నినాదంతో ఓ కార్యక్రమం రూపొందించింది.**

ఏ దేశంలోనైనా నాణ్యమైన విద్యను అందించాలన్నా, సరైన భాషా బోధన జరగాలన్నా, ఇంకా వివిధ రీతుల్లో పురోగతి సాధించాలన్నా మాతృభాషలో బోధన తప్పనిసరి అని యునెస్కో సూచించింది. ఫిబ్రవరి 21ని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా పరిగణించి, అక్కడి నుంచి ఓ ఏడాది పాటు కార్యక్రమాలు రూపొందించుకుని, వాటిని జరుపుకోవడానికి యునెస్కో నిధులు సమకూర్చడం ప్రారంభించింది. కనీసం 2030 నాటికి మాతృభాషకు పూర్వ వైభవం తీసుకురావాలన్నది యునెస్కో లక్ష్యం.

ప్రపంచవ్యాప్తంగా సుమారు ఏడువేలకు పైగా మాతృభాషలున్నాయి. అయితే, అనేక దేశాల్లో మాతృభాష అంతరించిపోతూ, ఇంగ్లీషు సహా వివిధ విదేశీ భాషలు ఆధిపత్యం చెలాయిస్తున్నాయి. ఇందులో అనేకానేక భాషలు సుమారు 70 శాతం దేశాల్లో దాదాపు అంతరించిపోయే పరిస్థితి ఏర్పడింది. భారతదేశంలో కూడా అనేక భాషలకు అదే దుస్థితి ఏర్పడింది. అందులో తెలుగుభాష కూడా ఒకటి. సుమారు 1999 ప్రాంతంలో యునెస్కో రూపొందించిన నివేదిక ప్రకారం, మరో 15-20 ఏళ్లలో తెలుగు భాష దాదాపు అంతరించిపోవచ్చు. ఈ నివేదిక వెలువడిన తరువాత నుంచి తెలుగు భాషోద్యమ నాయకులు, తెలుగు భాషాభివృద్ధి సంస్థలు పెద్ద యెత్తున ఉద్యమించి తెలుగు భాష పరిరక్షణకు చర్యలు తీసుకోవడం ప్రారంభమైంది. తెలుగు భాష పరిరక్షణకే కాక, తెలుగు వాడుక భాషను అభివృద్ధి చేయడానికి గిడుగు రామ్మూర్తి పంతులు వంటివారు చేసిన పోరాటాల్ని స్ఫూర్తిగా తీసుకుని కూడా భాషా ఉద్యమవేత్తలు కార్యక్రమాలు రూపొందించి అమలు చేస్తున్నారు.

తెలుగు రాష్ట్రాల్లో ఇంగ్లీషు చదువుల కారణంగా తెలుగుభాష, తెలుగుభాషా శైలిలో పెనుమార్పులు చోటు చేసుకున్నాయి. తెలుగు భాష దారి మళ్లడానికి ఇదే ప్రధాన కారణంగా కనిపిస్తోంది. గిడుగు రామ్మూర్తి పంతులు, కొమర్రాజు లక్ష్మణరావు వంటి ప్రసిద్ధ రచయితలు కొందరు తెలుగు భాషను అభివృద్ధి చేయడానికి కొత్త రకమైన రచనలు చేయడం ప్రారంభించారు. తెలుగు భాషపై ఇంగ్లీషు ప్రభావం తగ్గించడమే లక్ష్యంగా వీరి రచనలు సాగాయి. భాషలో కఠిన

### అవివేకపు బోధన

ఇంత జరిగినప్పటికీ, ఇంగ్లీషు భాష ఆధిపత్యానికే ప్రాధాన్యం పెరగడం, విద్య, ఉపాధి అవకాశాలు ఇంగ్లీషు విద్యకు లభించినంతగా మాతృభాష తెలుగుకు లభించకపోవడంతో తెలుగు వెనుకపట్టు పట్టింది. మాతృభాషాభివృద్ధికి నాణ్యమైన విద్యా బోధన, భాషా బోధన వంటి కార్యక్రమాలను యునెస్కో వంటి సంస్థలు గత రెండు దశాబ్దాల కాలంగా నిర్దేశిస్తున్నప్పటికీ, ప్రపంచంలోని వివిధ మాతృభాషల పరిస్థితి అటుంచి, తెలుగు రాష్ట్రాల్లో తెలుగు భాషను


గిడుగు రామ్మూర్తి పంతులు


కొమర్రాజు లక్ష్మణరావు




**- రాజశుక**

మాట్లాడేవారి సంఖ్య, చదివేవారి సంఖ్య కూడా ఏడాదికి దాదాపు ఒకటిన్నర శాతం చొప్పున క్షీణిస్తూ వస్తోంది. ప్రతి దేశంలోనూ మాతృభాషలకు గ్రహణం పడుతోందని యునెస్కో కూడా తన తదుపరి నివేదికల్లో అంగీకరించింది. గతంలో ప్రసిద్ధ రచయితలు, ఆ తరువాత యునెస్కో వంటి అంతర్జాతీయ సంస్థలు, ఆ తరువాత వివిధ దేశాల్లోని భాషోద్యమ నేతలు, ప్రభుత్వాలు ఎంతగా ప్రయత్నించినప్పటికీ, మారుతున్న ప్రపంచ అవసరాలు, అంతర్జాతీయ పరిస్థితులు వగైరాల కారణంగా మాతృభాషల పరిస్థితి నానాటికీ తీసికట్టు అన్నట్టుగానే ఉంటోందనేది వాస్తవం.

తెలుగు రాష్ట్రాలో తెలుగు భాషోద్యమ నేతల పుణ్యమాని ప్రభుత్వాలపై ఒత్తిడి పెరిగి, కూడా. తెలుగును మృతభాషల జాబితాలో చేర్చాల్సిన ప్రమాదం ముంచుకొస్తోందంటూ కొన్నేళ్ల క్రితం ఐక్యరాజ్యసమితి చేసిన హెచ్చరికను దృష్టిలో పెట్టుకుని, తెలుగు భాషాభివృద్ధిపై ఈ సభల్లో చర్చ జరిగింది. తెలుగును మాట్లాడే యువతీ యువకులు, విద్యార్థుల సంఖ్య 27 శాతానికంటే తక్కువగా ఉన్న పక్షంలో ఈ భాష మృత భాషగా మారడానికి ఎంతో కాలం పట్టదని కూడా ఐక్యరాజ్యసమితి తెలిపింది. సహజంగానే ఈ ధోరణి రాష్ట్రంలోని విద్యావేత్తలు, భాషాభిమానుల్లో ఆందోళన కలిగించింది.

## విజృంభించిన ఉద్యమాలు

వాస్తవానికి 2003 ప్రాంతంలో అప్పటి రాష్ట్ర ప్రభుత్వం పదవ తరగతి వరకూ తెలుగు బోధనను తప్పనిసరి చేస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. తెలుగు భాషకు పూర్వ వైభవం కల్పించడం, రాష్ట్రంలో దీనికి మొదటి అధికార భాషగా గుర్తింపు లభించేలా చేయడం తమ ధ్యేయమని ప్రభుత్వం ప్రకటించింది. అంతేకాదు, త్రిభాషా సూత్రం కింద ఉర్దూ మీడియం స్కూళ్లలో భాషాభివృద్ధికి, తెలుగు ప్రాచుర్యానికి కేంద్ర ప్రభుత్వం కూడా కోట్లాది రూపాయలు కేటాయించింది. తెలుగు గ్రంథాలు, రచనలను అభివృద్ధి చేయడంతో పాటు, తెలుగు భాషా బోధనను కూడా పరిపుష్టం చేస్తూ రాష్ట్ర ప్రభుత్వాలు కార్యక్రమాలు రూపొందించాల్సి ఉంది. ప్రభుత్వాలు చిత్తశుద్ధితో కఠిన నిర్ణయాలు తీసుకోని పక్షంలో తెలుగు మృతభాషగా మారడం ఖాయం. కొన్ని ఉద్యోగాలలో అదనపు అర్హత కోసం ఇంగ్లీషు భాష నేర్చుకోవడం అనివార్యమే అవుతుంది. కానీ, చిన్నప్పటి నుంచీ మాతృభాషలో కాకుండా ఇంగ్లీషులో పాఠాలు చెప్పడంవల్ల పిల్లల్లోని సృజనాత్మకత దెబ్బ తింటుందని, దీనివల్ల దేశ స్వావలంబనకు కూడా తీరని నష్టమనీ భాషాభిమానులు గట్టిగా హెచ్చరిస్తున్నారు. కేవలం ఇంగ్లీషు భాషతో దేశ భవిష్యత్తును తీర్చిదిద్దడం జరిగే పని కాదు. శాస్త్ర సాంకేతిక రంగాలలో అభివృద్ధి చెందిన ఏ దేశమూ ఇంగ్లీషు భాషలో విద్యాబోధన గరపడం లేదు. మాతృభాష కాక ఇతర భాషల్లో చదువు చెప్పిన దేశాలు కేవలం సేవారంగంలో తప్ప ఉత్పత్తిరంగంలో అభివృద్ధి

**మాతృభాషకు పూర్వవైభవం తేవాలని యునెస్కో లక్ష్య నిర్దేశం చేసింది. ఇప్పటికే 70 శాతం దేశాల్లో మాతృభాషలు అంతరించిపోయే పరిస్థితి ఏర్పడింది. దీంతో తెలుగుభాషా పరిరక్షకులు ఉద్యమించి వాడుకభాష అభివృద్ధికి నడుంకట్టారు. మరో 15-20 ఏళ్ళలో తెలుగు అంతరించిపోతుందన్నది యునెస్కో నివేదిక సారాంశం. ఈ పరిస్థితుల్లో తెలుగు భాషా పరిరక్షణ ఎలా? ఫిబ్రవరి 21న మాతృభాషా దినోత్సవం సందర్భంగా ఒక వీక్షణం...**







చెందడం జరగడం లేదని కూడా భాషాభిమానులు చెబుతున్నారు.

భాషా వికాసానికి అనేక నిర్ణయాలు తీసుకోవడానికి అవకాశం లభించింది. ఆంధ్రప్రదేశ్ (ఉమ్మడి రాష్ట్రం)లోని పాఠశాలల్లో తెలుగు బోధన తప్పని సరి చేస్తూ కొద్ది సంవత్సరాల క్రితం ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. పాఠశాల స్థాయిలో, ఇంటర్మీడియట్‌లో, డిగ్రీ కళాశాలల్లో తెలుగు నిర్బంధం చేస్తూ ప్రభుత్వం ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేయడానికి నిర్ణయించింది. అన్ని వృత్తి కళాశాలల్లో తెలుగును మూడవ భాషగా తీసుకోవాలని కూడా ప్రభుత్వం భావించింది. నిజానికి రాష్ట్రంలోని అనేక పాఠశాలలు, కళాశాలల్లో తెలుగు నేర్చుకోవడం తప్పనిసరి కాదు. ప్రభుత్వాలు కనుక దీనిపై గట్టి నిర్ణయం తీసుకుని అమలు చేసే పక్షంలో, సుమారు 1.30 కోట్ల మంది విద్యార్థులకు, ప్రభుత్వ, ప్రైవేట్, ప్రభుత్వ ఆర్థిక సహాయంతో నడిచే ప్రైవేట్ స్కూళ్లన్నిటికీ ఈ నిర్ణయం వర్తిస్తుంది.

గతంలో తిరుపతిలో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో కూడా తెలుగు భాష బోధనను తప్పనిసరి చేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేశారు. ముఖ్యమంత్రి అంగీకరించారు కూడా తెలుగును తప్పనిసరి చేయడం జరుగుతుందని అప్పట్లో ప్రభుత్వం ప్రకటించింది కానీ, ఆ ఉత్తర్వులు ఆచరణలోకి రాలేదు. ఇటువంటి ఉత్తర్వులు ప్రభుత్వ పాఠశాలల్లో అమలు జరిగినట్టుగా ప్రైవేట్ పాఠశాలల్లో అమలు జరిగే అవకాశం లేదు. రాష్ట్రంలో 70 శాతానికి పైగా పాఠశాలలు ప్రైవేట్ రంగంలోనే ఉన్నాయి. పాఠ్య ప్రణాళిక నుంచి సెలవుల వరకూ ప్రైవేట్ విద్యా సంస్థలు ప్రభుత్వ నిర్ణయాలను కాక, సొంత నిర్ణయాలనే అమలు చేస్తుంటాయి.

ఇక కేంద్రీయ విద్యాలయాలు వంటి కేంద్ర విద్యాసంస్థల్లో కేంద్ర ప్రభుత్వ నిబంధనలే వర్తిస్తాయి. రాష్ట్ర నిబంధనలు వర్తించవు. సెంట్రల్ బోర్డుకింద పనిచేసే పాఠశాలలు రాష్ట్రంలో మూడు వేలు పైచిలుకే ఉన్నాయి. ఈ పాఠశాలల్లో తెలుగుబోధన తప్పనిసరి కాదు. కొన్ని పాఠశాలల్లో తెలుగు భాషా బోధన లేదు కూడా. అంటే, యునెస్కో నిర్దేశించిన లక్ష్యం నెరవేరేలా కనిపించడంలేదు. తెలుగుభాషకు కేంద్ర ప్రభుత్వం ప్రాచీనహోదా కల్పించింది. తెలుగు

డెన్మార్క్, బెల్జియం వంటి దేశాల్లో ప్రాథమిక తరగతుల నుంచి పీహెచ్‌డీ వరకూ మాతృభాషలోనే విద్యాబోధన జరుగుతుంటుంది. ఆ దేశాల్లో కేవలం విదేశీయుల కోసమే ఇంగ్లీషు భాష నేర్చుకుంటారు. ఒక్క పాశ్చాత్య, ఐరోపా దేశాల్లోనే కాక, జపాన్, చైనా, కొరియా వంటి దేశాలలో సైతం విద్యాబోధనంతా మాతృభాషలోనే ఉంటుంది. ఉద్యోగ, వ్యాపార, విదేశీ అవసరాల కోసమే ఇంగ్లీషు భాషను నేర్చుకుంటుంటారు. భాషోద్యమ కారుల ఉద్దేశంలో, మాతృభాషలో విద్యాబోధన అనేది కేవలం భాష మీద అభిమానంతోనే కాదు, విద్యార్థుల్లో సృజనాత్మకత, దేశ స్వావలంబన, సర్వతోముఖ వికాసం కోసం కూడా అవసరమే. కొన్ని సమస్యలున్నప్పటికీ, తెలుగు భాష, తెలుగు సంస్కృతుల పునరుజ్జీవనానికి తెలుగు బోధనను తప్పనిసరి చేయడం, ఇళ్లలో తెలుగు మాట్లాడడం, పిల్లలు తెలుగులో మాట్లాడేలా తల్లితండ్రులు ప్రోత్సహించడం తప్ప గత్యంతరం లేదు.

నవ్య

# మహానంది

(20)



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**పడమటి ఆకాశం సంధ్యారాగంతో అందంగా కనువిందు చేస్తోంది.**

**"ఆనందసాగర నగరం ఆ రైతు చెప్పినంత దూరం కాదు; దగ్గరే! సూర్యుడు గూటికి చేరకముందే నగరద్వారం చేరుకున్నాం!" నంది ఎదురుగా ప్రత్యక్షమైన మొగసాలను చూస్తూ అన్నాడు.**

**"రత్నకటక నగరం వదిలాక మనుషుల్లోకి రావడం ఇదే మొదటిసారి!" లాలస అంది. ఆమె కంఠంలో ఏదో ఊరట ధ్వనించింది.**

"ఇప్పటిదాకా అరణ్యంలో కలిసిపోయిన మనం ఇంక జాగ్రత్తగా జనారణ్యంలో కలిసిపోవాలి."

"నందీ..." లాలస, పక్కనే నడుస్తూ నంది వైపు చూస్తూ అంది.

నంది తల తిప్పి ప్రశ్నార్థకంగా చూశాడు.

"నగరంలోకి వెళ్ళగానే కామరూప నగరానికి దారి ఎటో తెలుసుకుంటావుగా?" లాలస ఆశగా ప్రశ్నించింది.

"తెలుసుకోవాలిగా!" నంది నవ్వుతూ అన్నాడు. "అంతే కాదు; ఏ దారి ఎటు వెళ్తుందో కూడా తెలుసుకోవాలి!"

లాలస అర్థమైనట్టు తల పంకించింది.

మొగసాల కిందిభాగంలో, దారికి అడ్డంగా లావుపాటి కొయ్య ఉంది. రెండువైపులా అరుగులున్నాయి. అరుగులమీద ఇద్దరు భటులు కూర్చుని ఉన్నారు. ఒక భటుడు అరుగు మీద నుండి దిగి, లాలసనూ, నందినీ సమీపించాడు. ఇద్దరినీ విడి విడిగా ఎగాదిగా చూశాడు.

"యాత్రికుల్లా ఉన్నారు. ఏ దేశం?" నిర్లక్ష్యంగా ప్రశ్నించాడతను.

"కర్నాటక దేశం సోదరా!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"ఆతిథ్య సుంకం చెల్లించాలి.."

"ఆతిథ్య సుంకమా? దేనికి?" నంది ప్రశ్నించాడు.

"మా దేశం మీకు ఆతిథ్యమిస్తుందిగా? అందుకు! ఇద్దరికీ రెండు వరహాలు.." చెయ్యి చాపుతూ అన్నాడు భటుడు.

నంది అపరంజి దంపతులను తలచుకుంటూ, అంగీలోంచీ రెండు వరహాలు తీసి ఇచ్చాడు. భటుడు అరుగువైపు వెళ్ళి, కలశం ఆకారంలో ఉన్న లోహపాత్రలోకి వరహాలు జారవిడిచాడు. రెండవ భటుడి వైపు చూస్తూ తల ఎగరేశాడు. అతను అడ్డంగా ఉన్న కొయ్యను రెండు చేతుల్తో పైకెత్తి పట్టుకున్నాడు. నందీ, లాలసా తలలు వాల్చి, కొయ్య కిందుగా అటువైపు వెళ్ళారు. భటుడు అడ్డ కొయ్యను యథాస్థానంలో పెట్టేశాడు.

"ఇదిగో...ఎదురుగా ఆలయ గోపురం కనిపిస్తోందిగా! ఆలయం ఎదురుగా అన్నసత్రం ఉంది. మా నగరానికి వచ్చే మీలాంటి వాళ్ళకు అక్కడ

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కారశిక్ష విధిస్తాడు. పొరుగు రాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగరత్న చెరనుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. ఆమెను కామరూప యువరాణిగా తెలుసుకొని ఆశ్చర్యపోతాడు, ఆమెను కాపాడతానని మాటిస్తాడు నంది. ఉలూకుడు, భటులనుంచి తప్పించుకుని, కళింగరాజ్యం నుంచి నిష్క్రమిస్తారు నంది, లాలస. అడవి దారిలో అడ్డుపడిన ఉలూకుడి నుంచి తప్పించుకునేందుకు నదిలో దూకుతారు ఇద్దరూ. సురక్షిత ప్రదేశానికి చేరుకున్న వారిపై పక్షుల గుంపు దాడిచేస్తుంది. వాటినుంచి తప్పించుకుని సారంగ రాజ్యంలోకి ప్రవేశిస్తారు.

ఆ తర్వాత....

భోజనమూ, వసతీ లభిస్తాయి! ఉచితంగా! వెళ్ళండి!" సుంకం తీసుకున్న భటుడు అన్నాడు.

"మంచిది. మాకు ఆ రెండూ అవసరమే!" నంది అన్నాడు ముందుకు నడుస్తూ.

"మా కామరూపనగరంలో కూడా యాత్రికులకు భోజన సదుపాయం, వసతి సౌకర్యం లభిస్తాయి. అయితే సుంకం తీసుకోరు. మా నాన్నగారు ఉచిత సౌకర్యాలు కల్పించారు" లాలస తండ్రిని తలుచుకుంటూ అంది. "మీ నగరంలో?"

నంది చిరునవ్వుతో చూశాడు. "మా నగరంలో కూడా అంతే; ఉచిత ఆతిథ్యమే.."

"అన్నట్టు ఇంతవరకూ చెప్పలేదు. నీది ఏ ఊరు నందీ?" లాలస కుతూహలంగా అడిగింది.

నంది నిట్టూర్చాడు. ఆమె కళ్ళల్లోకి నిదానించి చూశాడు. "నాది ఒక ఊరు కాదు. ఏ ఊళ్ళో ఉంటే అదే నా ఊరు; ఉన్నన్నినాళ్ళూ!"

"అదేమిటి?"

"అది అంతే. నాకు పేరుంది. ఊరు లేదు! సమయం వచ్చినప్పుడు అన్నీ చెబుతాను. పద వెళ్దాం!" అన్నాడు నంది.

"నాతో బాటు మా నగరానికి వస్తావుగా. మా నాన్నగారికిచెప్పి నీకు సకల సదుపాయాలూ ఏర్పాటు చేయిస్తాను. నీ గౌరవానికి భంగం కలిగించని ఉద్యోగం! అడిగినవన్నీ, అంటే నేను చెప్పినవన్నీ నీకు బహుమతిగా ఇస్తారు నాన్నగారు. నన్ను ఆయనకి బహుమతిగా ఇస్తున్నావుగా!" లాలస ఉత్సాహంగా అంది.

నంది చిరునవ్వుతో చూశాడు. "భవిష్యత్తు మీద నీకు చాలా నమ్మకం ఉన్నట్టుంది..."

"ఆ నమ్మకం నువ్వు నన్ను రక్షించాక కలిగింది!" లాలస అంది. "భవిష్యత్తుమీద నా నమ్మకం కళింగరత్న మందిరంలో చచ్చిపోయింది. ఇప్పుడు మళ్ళీ ప్రాణం పోసుకుంది."

"పద, అన్నసత్రం మనకోసం ఎదురు చూస్తోంది!" అన్నాడు నంది ముందుకు కదుల్తూ.

కొన్ని నిమిషాల నడక వాళ్ళను ఆలయ సమీపానికి చేర్చింది. గుర్రపు డెక్కల చప్పుడు విని నంది కొద్దిగా పక్కకు జరిగాడు. ముఖశాల దగ్గర సుంకం తీసుకున్న సుంకరి భటుడు నగరం లోపలకి వెళ్తూ వాళ్ళ దగ్గరగా వచ్చాడు. "కొంచెం ముందుకెళ్తే, ఎడమవైపు ఉంటుంది అన్నసత్రం! నా వెనకాలే రండి. సుంకం చెల్లించినందుకు గుర్తుగా మా రాజ్య కోశాధికారి ముద్రిక గుర్తులున్న రాగినాణేల్ని మీకు ఇవ్వడం మరిచిపోయాను. ఇదిగో..సత్రం అధికారికి ఇవ్వు!" అంటూ సుంకరి రెండు చిన్న రాగిబిళ్ళలను నందికి ఇచ్చాడు. నంది చిరునవ్వుతో ధన్యవాదాలు వ్యక్తం చేశాడు.

"మీరు కర్నాటకం నుండి వస్తున్నారు. ఆచార వ్యవహారాలలో, ఆహార నియమాలలో భేదాలుంటాయి. మీకు ఇబ్బంది కలగకుండా చూడమని సత్రంలో చెప్పి వెళ్తాను.." సుంకరి అన్నాడు.

"అవసరం లేదు సోదరా! మేం సర్దుకుపోతాం. నువ్వు వెళ్ళు...ధన్యవాదాలు!" నంది అన్నాడు.

"ఎలాగూ సత్రంలో నాకు పని ఉంది. ఇంట్లో దీపం పెట్టే దిక్కు పుట్టింటికి వెళ్ళింది. రాత్రి భోజనం మూట కట్టించుకు వెళ్ళాలి! ఈ సందమ్మట బాగా లోపలికి రావాలి. వంటకాల ఘుమఘుమలు స్వాగతం పలుకుతాయి! ఆవరణం ముఖద్వారంలో పెద్ద శిలాతోరణం ఉంటుంది రండి!" అంటూ సుంకరి గుర్రాన్ని అన్న సత్రం వైపు మళ్ళించి, వేగంగా వెళ్ళిపోయాడు.

"సుంకం తీసుకుంటే తీసుకున్నారు. అతిథి మర్యాదలు చక్కగా చేస్తున్నారు!" నంది చిన్నగా నవ్వాడు.

"ఔను.." లాలస అంది.

ఉన్నట్టుండి ఆలయంలో గంటలు మ్రోగడం ప్రారంభించాయి. ఇద్దరూ అప్రయత్నంగా ఆలయంవైపు తిరిగి చేతులు జోడించారు.

"నందీ, వెళ్ళి దర్శనం చేసుకుందామా?" లాలస అడిగింది.

"నడిచి నడిచి మురికి కొట్టుకుపోయి ఉన్నాం. ఉదయం స్నానంచేసి దర్శనం చేసుకుందాం. పద.." అంటూ నంది అన్నసత్రానికి తీసుకువెళ్ళే సందు వైపు నడిచాడు.

అన్నసత్రం శిలాతోరణం ముందుకు చేరేసరికి చీకటి ముసురుకుంది. సుంకరి గుర్రం మీద ఎదురుగా వస్తున్నాడు. అతను ఇందాక చెప్పినట్టు ఘుమఘుమలు గాలిలో వ్యాపిస్తున్నాయి.

"వెళ్ళండి! సారంగ సామ్రాజ్య ఆతిథ్యం స్వీకరించండి!" అంటూ గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు.

శిలాతోరణానికి కొంచెం దూరంలో ఉంది సత్రం భవనం. ద్వారా



నికి రెండువైపులా రెండు 'దివ్వెగూళ్ళు' ఉన్నాయి. ఆ గూళ్ళలో దీపాలు వెలుగుతున్నాయి. గాలికి స్పందిస్తూ దీపకళికలు స్వాగతం పలుకుతున్నాయి. నందీ, లాలసా సత్రంవైపు అడుగులు వేశాడు.

●●●

"ప్రభువులకు ప్రణామాలు..."

తన ముందు వినయంగా నిలుచుని, నమస్కరిస్తున్న సేనానిని సారంగ సామ్రాజ్య మహారాజు సారంగసేనుడు ప్రశ్నార్థకంగా చూశాడు. "ఏమిటి జయవిజయా?"

"ప్రభూ, నగర ప్రవేశద్వారం వద్ద విధులు నిర్వహించే సుంకరి సుధాముడు తమ దర్శనార్థం వచ్చాడు. ఏదో ముఖ్యమైన వర్తమానం తెచ్చినట్టున్నాడు."

"ప్రవేశపెట్టు.."

"చిత్తం! జయవిజయుడు తలుపు తెరచి, గుమ్మం దాటి వెలుపలికి వెళ్ళాడు. కాసేపట్లో సుధాముడితో పాటు లోనికి వచ్చాడు. సుధాముడు తలుపు మూసి మహారాజుకు నమస్కరించాడు.

"సంచలన వర్తమానం విన్నవించుకోవడానికి వచ్చాను ప్రభూ!" సుధాముడు ఉత్సాహంగా అన్నాడు.

"విన్నవించుకో సుధామా!"

"కళింగ యువరాజుగారు తెలియజేసిన పోలికలున్న యువతీ, యువకుడూ మన రాజధానిలోకి ప్రవేశించారు ప్రభూ.."

"అలాగా? నిజమా!" సారంగసేనుడు ఆశ్చర్యంగా అన్నాడు.

"చిత్తం ప్రభూ.."

"ఎలా పసిగట్టావు?"

"తమ దర్శనానికి వచ్చిన కళింగ యువరాజు గారి అంతరంగికుడు ఉలూకుడు ఇద్దరినీ కళ్ళకు కట్టినట్టు వర్ణించాడుగా ప్రభూ!"

"ఔను...అతను అక్షరాలతో ఆ ఇద్దరి చిత్రాలూ రచించాడు."

"చిత్తం. ముఖ్యంగా ఆ యువతి సౌందర్యం. ఆమె ధరించిన కర్ణాభరణాలూ, నాసికాభరణమూ, నడక తీరూ, ఆ నడకలో జంటగా కనిపించే వయ్యారం, ఠీవీ, పెద్ద పెద్ద సోగ కళ్ళు, ఆ ముఖ సౌందర్యం. మెడలో మంగళసూత్రం లేదు. ఇద్దరూ భార్యాభర్తల్లాగా లేరు! సోదరీ సోదరుల్లాగా కూడా ప్రవర్తించడం లేదు!"

"ఔనవును. నువ్వు కూడా కళ్ళకు కడుతున్నావు!" సారంగసేనుడు చిన్నగా నవ్వాడు.

"ఇంక ఆ యువకుడి ఒడ్డూ, పొడుగూ, కండలు తిరిగిన శరీరం, ముఖ కవళికలు...ముఖ్యంగా కళింగరాజ్య భాషకూ, మనం మాట్లాడే భాషకూ భిన్నంగా ఉండే 'యాస' ఈ యువకుడు ఆ యువకుడే అని చెప్తున్నాయి ప్రభూ! అతను నన్ను 'సోదరా' అన్నాడు. కర్నాటక కన్నడిగులు 'సోదరా!' అనరు. 'అణ్ణా!' అంటారు! అతను అబద్ధ మాడుతున్నాడని నాకు తెలిసిపోయింది ప్రభూ!" సుధాముడు సగర్వంగా వివరించాడు.

"ఎక్కడున్నారు?" సారంగసేనుడు ప్రశ్నించాడు.

"అన్నసత్రంలో దిగబెట్టి వచ్చాను ప్రభూ!"

"మంచిపని చేశావు. కళింగరత్న చేత నీకు చక్కటి బహుమతి ఇప్పిస్తాం! కళింగరత్న నా చిరకాల మిత్రుడు. మా తండ్రిగారు పరమపదించిన కారణంగా యుక్త వయసులోనే మేం మహారాజు కాగలిగాం. మా సమవయస్కుడైన కళింగరత్న ఇంకా యువరాజుగానే ఉన్నాడు. కారణం ఆయన తండ్రిగారు పరమపదించకపోవడమే!" అంటూ చిన్నగా నవ్వుతూ సారంగసేనుడు సేనాని జయవిజయుడి వైపు చూశాడు.

"ప్రభూ..." మహారాజు చూపును అర్థం చేసుకున్న సేనాని వినయంగా అన్నాడు.

"ఆ యువతి ఎవరో మాకు తెలుసు..." సారంగసేనుడు ప్రారంభించాడు.

"ప్రభువులకు తెలుసా?" సేనాని ఆశ్చర్యంగా అన్నాడు.

"ఆమె స్వయంవరానికి మేం కూడా వెళ్ళాల్సింది. అయితే మా జనకులు వద్దన్నారు. ఆమెను సురక్షితంగా కళింగరత్నకు అప్పగించాలి. అతను తన ఆధీనంలోకి తీసుకునే దాకా ఆ యువతి మన మందిర బంధనంలో ఉండాలి. ఆ యువకుడు మన కారాగారంలో ఉండాలి. ప్రతిఫలంగా మన కోశాగారానికి కళింగరత్న సువర్ణాల్నీ, రత్నరాసుల్నీ కానుకగా ఇస్తాడు! అన్నసత్రంలోంచి

**అన్నసత్రంలోకి ప్రవేశించిన నంది లాలసను గుమ్మం దగ్గరే ఆపి, లోపలకు వెళ్ళాడు. లోపల సత్రం నిర్వాహకులు ఏదో విషయంపై మాట్లాడుకుంటున్నారు. ఆ మాటలు చాటుగా విన్న నంది ఉలిక్కిపడ్డాడు. నెమ్మదిగా సత్రంలోంచి బయటికి వచ్చి, లాలస సహా అక్కడినుంచి నిష్క్రమించాడు. ఇంతకీ అతడు విన్న మాటలేంటి? ఉన్నపళంగా ఎక్కడికి బయలుదేరాడు నంది?**

వాళ్ళిద్దరూ వెళ్ళిపోక ముందే బంధించండి!"

"వెళ్ళలేరు ప్రభూ! అందుకు తగిన ముందు జాగ్రత్తలు ఉపదేశించి వచ్చాను!" సుధాముడు గర్వంగా అన్నాడు.

"ఏమిటా ముందు జాగ్రత్త?"

"వాళ్ళకు వడ్డించే ఆహారంలో తగు మాత్రం మత్తుమందు రంగరించమన్నాను ప్రభూ!"

"సేనాపతీ, ఆ యువతి మా ఏకాంత మందిరానికి చేరాలి.."

"ఏకాంత మందిరానికా ప్రభూ?" జయవిజయుడు ఆశ్చర్యంగా అడిగాడు.

సారంగసేనుడు చిన్నగా నవ్వాడు. "మా నూతన పత్ని, మహారాణిగారు పుట్టింటికి వెళ్ళారు కదా! మనది ఏ కాంతా లేని ఏకాంతం కదా!"

"ప్రభూ.."

"నీ సందేహం అర్థమైంది. నువ్వు నీ మిత్రుడికి పూలదండ ఇవ్వాలనుకుంటావు. క్రయం చేసే ముందు సువాసన ఉందో లేదో తెలుసుకోవడానికి వాసన చూస్తావు. అవునా?"

"చిత్తం..."

"ఆ ఆ.. అనాఘ్రాత పుష్పాన్ని ఆఘ్రాణించి, ఆస్వాదించి మా మిత్రుడికి అందజేస్తాం. అది మా అంతఃపుర రహస్యంగా అంతరించిపోతుంది..."

"చిత్తం...సుధాముడు మత్తుమందు అంటున్నాడు..మరి..ప్రభువులేమో..."

సారంగసేనుడు గొల్లున నవ్వాడు. "అది మత్తు కాదు; పరవశం. పరవశంగా ఉన్న పడతితో పారవశ్యం ఇబ్బడిముబ్బడిగా లభిస్తుంది. వెళ్ళండి! క్షేమంగా వెళ్ళి లాభంగా రండి! వాడికి మన చెరసాల; ఆమెకు మా చంద్రశాల!"

●●●

"నువ్విక్కడే కూర్చో. లోపలికి వెళ్ళి, ఈ రాగి నాణేలు అప్పగించి, స్నాన సౌకర్యం ఉందేమో కనుక్కుని వస్తాను" అన్నసత్రం ప్రధాన ద్వారం వద్ద ఆగి, అరుగు చూపిస్తూ అన్నాడు నంది.

లాలస అలాగే అన్నట్టు తల ఆడించి, కూర్చుంది. నంది వెడల్పాటి గుమ్మందాటి సత్రంలో అడుగు పెట్టాడు. చతురస్రాకారంలో ఉన్న విశాలమైన పడసాల. గోడలకు దగ్గరగానూ, మధ్యలోనూ వరసలుగా వేయబడిన పీటలు అది భోజనశాల అని చెప్పకనే చెప్తున్నాయి. భోజనశాల నిర్వాను



# ఆ ఇద్దరి మధ్యా ఏదో ఉందట!

ఒక సినిమాలో జంటగా నటించిన హీరో హీరోయిన్స్ మధ్య సహజంగానే కొంత చనువు ఏర్పడుతుంది. ఆ తరువాత సినిమా పబ్లిసిటీ పేరుతో మరింత దగ్గరవుతారు. 'శతమానం భవతి' హీరోహీరోయిన్ల మధ్య సరిగ్గా ఇలాగే జరిగింది. వీరిద్దరూ ఇప్పటికే చాలా క్లోజ్ అయ్యారనీ, ఇద్దరి మధ్యా ఏదో నడుస్తోందనీ టాలీవుడ్ జనాలు అంటున్నారు.

సినిమాల ఎంపికలో హీరో సలహాలు, సంప్రదింపులు తీసుకుంటోందట హీరోయిన్! ఇందుకే ఇటీవల రెండు సినిమాలను వదులుకుంది. ఈ సినిమాలను వదులుకోవడానికి పలు కారణాలు బయటకు వచ్చినా, దీని వెనుక హీరో హస్తం ఉందనీ, అతగాడి సలహా మేరకే వాటిని వదులు కుందనీ అంటున్నారు. 'ఇదిగో తోక అంటే అదిగో పులి' అనే సినీజనాలకు వీరిద్దరూ మంచి టాపిక్ అయ్యారని మరికొందరు చెబుతున్నారు.



ష్యంగా ఉంది. నంది ఎదురుగా ఉన్న మరొక ద్వారంవైపు నడిచాడు. తలుపు తెరచే ఉంది. వంటలు వెదజల్లే వాసనలు దట్టంగా అలుము కున్నాయి. ద్వారందాటి నంది కుడి ఎడమలకేసి చూశాడు. రెండువైపులా రెండుద్వారాలున్నాయి. ఎడమవైపు ద్వారం మూసి ఉంది. కుడివైపు ద్వారం తెరచి ఉంది. అటువైపు అడుగులు వేశా డతను. గుమ్మాన్ని సమీపించిన నంది తటాలున ఆగాడు.

"ప్రత్యేకంగా ఇక్కడేవిట్రా పీటలు వేస్తున్నావు? అక్కడా ఇక్కడా తిరుగుతూ ఎవడు వడ్డిస్తాడు?" ఏదో పురుష కంఠం బొంగురుగా కసిరినట్టు అడుగు తోంది.

"సుంకరి సుధాముడు చెప్పింది వినలేదా నువ్వు?" తగ్గుస్వరంతో మరెవరో అంటున్నారు.

"సుధాముడా? ఏం చెప్పాడు?"

"కర్నాటక రాజ్యం నుండి ఒక యువతీ, యువ కుడూ వచ్చారట. ఆ ఇద్దరికీ విడిగా, ప్రత్యేకంగా వడ్డించమన్నారు. అందరితో బాటు కూర్చోబెట్ట వద్దన్నారు.."

"ఎందుకూ? ఎందుకటా, ఆ విశిష్ట సేవ?" పురుష కంఠం మళ్ళీ కసిరింది బొంగురుగా.

"ఇదిగో, గుండయ్యా...ఆగాగు. సుంకరి నాతో చెప్పి, నీతో చెప్పమన్నాడు..." మూడవ పురుష కంఠం.

"ఎవరూ? పొట్లకాయగాడా?" గుండయ్య కంఠంలో ఎగతాళి. "నాకు చెప్పకుండా నీకెం దుకు చెప్పాడు?"

"అప్పుడు తమరిక్కడ లేరు. నూతిగట్టు వద్ద పరిచారికతో పరాచికాలాడుతున్నారు. పిలుద్దామని దొడ్డి గుమ్మంలోకి వచ్చాను. దాని పైటకొంగు తమ చేతిని పట్టుకుని ఉంది!" పొట్లకాయ అన బడే అతను వెటకారంగా నవ్వి, కొనసాగిస్తు న్నాడు. "ముందు, ముఖ్యమైన విషయం విను. ఆ యువతీ యువకులకి వడ్డించే పదార్థాలలో తగినంత మత్తుమందు కలపమన్నాడు.."

"ఏమిటీ! మత్తుమందా?" గుండయ్య బిగ్గ రగా అన్నాడు.

నంది గుండె దడదడ కొట్టుకుంది. ద్వార బంధానికి మరికొంచెం దగ్గరగా జరిగి చెవులు రిక్కించాడు.

"చెవుడా? మత్తుమందే!"

"ఎందుకు?"

"ఎందుకో మనకెందుకు గుండయ్యా? భోజన శాలలో అందరూ చూస్తారు వీళ్ళని. మత్తు మందు ప్రభావంతో వీళ్ళు తూలిపోతే ఇతరులు చూస్తే ఏమవుతుంది? అందుకే ఈ గదిలో వడ్డించమన్నాడు సుంకరి సుధాముడు.."

"అలాగా...అయితే మత్తుమందు..."

"సుంకరే ఇచ్చాడు. వీళ్ళకి వడ్డించే పదా ర్థాల్లో జాగ్రత్తగా కలిపేశాను..అర్థమైందా?" పొట్ల కాయగారి కంఠం.

నంది గిరుక్కున వెనక్కి తిరిగాడు. చప్పుడు చేయకుండా భోజనశాల గుండా అవతలి వాకిలి వైపు పరుగు తీశాడు. గుమ్మం దాటి లాలసను సమీపించాడు.

"కనుక్కున్నావా?" లాలస అడిగింది.

"కనుక్కున్నాను! లే! రా!" అంటూ నంది ఆమె చేతిని పట్టుకుని బలంగా లాగాడు.

లాలస ఆశ్చర్యంగా చూసింది. "నందీ...ఇటె క్కడికి?"

"మాట్లాడకు! రా!" నంది లాలసను బలంగా లాగుతూ భవనం పక్కకు పరుగుతీశాడు.

భవనం పక్కన ఆరుబయట ప్రహరీగోడ దగ్గరగా పది పదిహేను గుర్రాలు కట్టివేయబడి ఉన్నాయి. నంది లాలస చేతిని వదిలేసి, గుర్రాల దగ్గరగా వెళ్ళాడు. నల్లటి రంగులో ఉన్న ఒక గుర్రాన్ని ఎన్నిక చేసుకుని కట్టు విప్పాడు. గుర్రం వీపు మీద వేసే పరికరాలు దాని ముందు గోడకు వేళ్ళాడుతున్నాయి. నంది వాటిని అందు కుని, గుర్రం మీద వేశాడు. చకచకా బిగించాడు. రెప్ప పాటులో ఎగిరి గుర్రం మీద కూర్చున్నాడు. నివ్వెర పాటుతో చూస్తూ నిలుచున్న లాలస దగ్గరకు గుర్రాన్ని పోనిచ్చాడు.

"త్వరగా! నా వెనుక కూర్చో!" అంటూ ఆమె జబ్బ పట్టుకుని అవలీలగా పైకి లాగాడు. నంది పాదాల స్పర్శతో గుర్రాన్ని శిలాతోరణంవైపు నెమ్మ దిగా పోనిచ్చాడు. శిలాతోరణం దాటగానే కుడి వైపు తిరిగి, పరుగు తీయించాడు.

•••

కాస్సేపట్లో సుంకరి చెల్లించిన 'మొగసాల' అనే నగర ప్రవేశద్వారం ముందు అశ్వాన్ని ఆపాడు నంది. మెరుపులా కిందకి దూకాడు.

"నందీ..." లాలస అయోమయం ధ్వనించే కంఠంతో అంది.

"మాట్లాడొద్దు..ఇదిగో కళ్ళెం పట్టుకో. గుర్రాన్ని కదలనీయకు!" నంది కళ్ళెం లాలస చేతికి అందిం చాడు.

అరుగు మీద నుంచీ దిగి, అడ్డుకొయ్య దగ్గ రగా నిలుచుని తన వైపే చూస్తున్న భటుడి వైపు చకచకా నడిచాడు. అడ్డుకొయ్యకు ఇటువైపు ఆగి, అతని ముఖంలోకి చూశాడు.

"నీకో రహస్యం చెప్పాలి... సుధాముడు...." అంటూ ఆగాడు నంది.

భటుడు అర్థం కానట్టు చూశాడు. నంది తలను అతని భుజం వైపు వంచాడు. చెవిలో చెప్పబోయే వాడిలా అతని కుడిచెయ్యి మెరుపు వేగంతో కది లింది. భటుడి ఎడమ చెవికింద 'ఛప్' మంటూ చప్పుడు చేసింది. ఆ హస్త ప్రహారానికి భటుడు స్పృహ కోల్పోయాడు. చిన్నగా చప్పుడు చేస్తూ అడ్డు కొయ్య మీదికి బోర్లా పడిపోయాడు. అతని తలపాగా కిందపడిపోయింది. భటుడి జుత్తు పట్టుకుని కొద్దిగాలేపి, మెల్లగా వెనక్కి నెట్టాడు నంది. భటుడు వెల్లకిలా పడిపోయాడు. నంది

ఆలస్యం చేయకుండా అడ్డుకొయ్యను తీసి అవతల పారేశాడు.

భటుడి నడుములో దోపుకున్న బాకు తీసి, తన నడుంలో దోపుకున్నాడు. గుర్రంవైపు పరిగెత్తాడు. గుర్రంమీద రాతిబొమ్మలా కూర్చున్న లాలస చేతిలోంచీ కళ్ళెం తీసుకున్నాడు. క్షణంలో గుర్రం మీద లాలస ముందు కూర్చున్నాడు. గుర్రాన్ని కుడివైపు మళ్ళించాడు. దారికీ, మొగసాలకూ కొంచెం దూరంలో ఉన్న పొదలమధ్య గుర్రాన్ని పోనిచ్చాడు.

"నందీ....ప్రవేశద్వారం గుండా కాకుండా పొదల్లోకి వెళ్తున్నావు? ఎ...ఎక్కడికి?" ఉత్కంఠను భరించలేని లాలస అడిగింది. "ఆ భటుణ్ణి ఎందుకు కొట్టావు? చనిపోయాడా?"

"ఒక్క క్షణం...చెప్తాను.." అంటూ నంది పొదల మధ్య దారిచేసేలా గుర్రం పోనిస్తూ అన్నాడు.

కొన్ని నిమిషాల ప్రయాణం గుర్రాన్ని సన్నటి కాలిబాట మీదికి చేర్చింది. బలహీనంగా వెలుగుతున్న నక్షత్రకాంతిలో నంది గుర్రాన్ని వేగంగా పోనిచ్చాడు.

నల్ల గుర్రం విసుగూ, విరామం లేకుండా రాత్రంతా పరిగెడుతూనే ఉంది. నంది ఒక్కసారి కూడా వెనుదిరిగి కమ్మిన మసక చీకటిలోకి కళ్ళు చించుకుంటూ చూడలేదు. శబ్దాల కోసం చెవులు రిక్కించి వినలేదు. ఆనందసాగరం భటులుగానీ, మరెవ్వరు కానీ తమకోసం, తను ఎన్నుకున్న మార్గంలో రారని అతనికి తెలుసు. తప్పించుకుని వేగంగా పారిపోయే అవకాశం ఉన్న చక్కటి మార్గాన్నే తాను ఎంచుకుంటాడని వాళ్ళు ఊహిస్తారు. అది సహజం. అందుకే ప్రవేశద్వారం వద్ద భటుడికి స్పృహతప్పించి, అడ్డుకొయ్య తొలగించడం ద్వారా వాళ్ళకు పరోక్షంగా తాను మార్గ నిర్దేశం చేశాడు!

రాత్రంతా వేగంగా సాగిన అశ్వయానం తమను చాలా దూరం తీసుకు వచ్చినట్టుంది. ప్రక్కప్రక్కనే ఉన్న రెండు చిన్న కొండల మధ్య సిందూర వర్ణంతో పైకి లేస్తూ కనువిందు చేస్తున్న సూర్యుడిని చూస్తూ నంది సన్నటి కాలి బాటలోంచీ గుర్రాన్ని పక్కకు మళ్ళించాడు. దట్టంగా ఏపుగా పెరిగిన చెట్లు విశ్రాంతి తీసుకోమని అతన్ని పిలుస్తున్నట్టున్నాయి. ఔను... అశ్వానికీ, తనకూ విశ్రాంతి అవసరం. రాత్రి అందివచ్చిన అన్నం, అందినట్టే చేజారిపోయింది! ఆకలి కరకరలాడుతోంది. కందమూలాలతోనో, కాయలతోనో, పళ్ళతోనో ఆకలి తీర్చుకోవాలి.




"లాలసా, విను! భటుణ్ణి నేను చంపలేదు. స్పృహ తప్పించాను. అడ్డుకొయ్యను అవతల పడేశాను. భటుణ్ణి కొట్టి పడేసి, అడ్డుకొయ్యను తీసిపారేసి, ఆ ప్రధాన నగర మార్గం గుండా మనం గుర్రంమీద పారిపోయామని వాళ్ళు అనుకుంటారు. వాళ్ళు అలా అనుకోవాలనే అలా చేశాను. వాళ్ళకి ఆ దారి చూపించి, నేను ఈ దారి పట్టాను! వాళ్ళు ఆ మార్గంలో మనకోసం వెళ్తారు. మనం ఈ మార్గంలో వెళ్తాం!"

"వాళ్ళు. వాళ్ళెవరు?"

"సుంకరీ, రాజభటులూ....మన కోసం అన్వేషిస్తారు.."

"రాజభటులా? అన్వేషిస్తారా? ఎందుకు నందీ? సత్రం నుంచి ఉన్నట్టుండి ఎందుకు వచ్చేశాం? ఏం జరిగింది?"

"సత్రంలోకి వెళ్ళాను. అక్కడ కొన్ని మాటలు విన్నాను. చెప్తాను; నువ్వూ విను!" అంటూ నంది తగ్గుస్వరంతో చెప్పసాగాడు.

•••

చెట్ల మీదనే మగ్గిన అరటిపళ్ళు, విరగకాసిన అల్లనేరేడు పళ్ళు ఆకలి తీర్చాయి. స్వచ్ఛమైన నీటితో నిండి ఉన్న కొలను దప్పిక తీర్చింది. చల్లటి నీడను పరిచిన కానుగచెట్టుకింద మెత్తటి, పచ్చని పచ్చిక మీద చేతిని తలగడగా చేసుకుని ఒత్తిగిలి పడుకున్న లాలస నిద్రతో అలసటను ఆవిరి చేస్తోంది. నంది లాలస వైపు జాలిగా చూశాడు. ఒక వ్యక్తి స్వార్థం ఎదుటి వ్యక్తులను కష్టాలపాలు చేస్తుంది. కళింగరత్న స్వార్థం కామరూప రాకుమారిని కష్టాలకు గురిచేసింది. కందమూలాలతో కడుపు నింపుకోవడం, కటిక నేల మీద కన్ను మూసుకోవడం, రాళ్ళమీదా ముళ్ళ మీదా నడవడం! ఎవరిదో స్వార్థం తన తండ్రినీ, చెల్లినీ, తననూ కష్టాలపాలు చేసింది! నంది సాలోచనగా తన ముఖం తడుముకున్నాడు. బాగా పెరిగిన గడ్డం గరకుగా ఉంది. అంగుళం పొడవు పెరిగిన గడ్డాన్ని తడుముకుంటూ నంది కొలనువైపు నడిచాడు. కొలను దగ్గరగా ఉన్న చిన్న రాతి మీద కూర్చుని, అద్దంలా మెరుస్తున్న నీటిలోకి చూశాడు. రత్నకటక నగరంలో ఉన్నపుడు ఎందుకో క్రమం తప్పకుండా ముఖక్షౌరం చేసుకోలేదు. గడ్డం, మీసాలు దట్టంగా పెరిగి ఉన్నాయి. గిరజాలజుత్తు కూడా దాని అభివృద్ధిని అది సాధించింది! నంది నవ్వుకుంటూ ఒరలోంచి బాకు ఇవతలకి లాగాడు. బాకు ఎండలో తళుక్కున మెరిసింది. నంది ముంజేతి రోమాల మీద బాకు పదును పరీక్షించాడు. క్షురకుడి కత్తిలాగా చాలా పదునుగా ఉంది.

నంది బాకుని జాగ్రత్తగా పచ్చిక మీద పెట్టి దోసిట్లో నీళ్ళు తీసుకున్నాడు. ముఖం తడుపుకోబోతూ ఆగాడు. ఏదో ఆలోచన నీళ్ళతో నిండిన అతని దోసిలిని మధ్యలోనే ఆపివేసింది. తాను పరరాజ్యంలో పలాయనం సాగిస్తున్నాడు! కళింగ యువరాజు తన అన్వేషణ ఎంత దూరంగా, ఎన్ని ప్రాంతాలలో విస్తరిస్తాడో తెలీదు! తాను లాలసతో బాటు ఏ క్షణంలో, ఏ రాజ్యంలో అడుగు పెడతాడో తెలీదు. తన పోలికలలో మార్పు మంచిదా? తనను ఉలూకుడు బాగా చూసి ఉన్నాడు. కొద్దిగా మాసిన గడ్డంతో ఉన్నా, నున్నటి గడ్డంతో ఉన్నా అతను ఇట్టే పోల్చుకోగలడు! అంగుళం పొడవు పెరిగిన గడ్డాన్ని అలాగే పెరగనివ్వడం మంచిది! సహజసిద్ధమైన మారువేషం! బాగా పెరిగిన గడ్డంతో కొంత కాలం కనిపించాక, దానిని తీసివేస్తే అదొక సహజసిద్ధమైన మరొక మారువేషం!

ఆలోచిస్తున్న నంది దోసిట్లోంచీ నీళ్ళు పూర్తిగా జారిపోయాయి. నంది బాకుని అందుకుని ఒరలోకి దూర్చాడు. ఒరను నడుమును చుట్టిన దట్టీలో ఇరికించాడు. కొలను అద్దంలో తన ముఖాన్ని మరొకసారి తృప్తికరంగా చూసి, తన ముందుచూపును లోపల్లోపలే మెచ్చుకుంటూ వెనుదిరిగాడు.

పచ్చిక మేయడం ముగించిన గుర్రం కట్టివేసిన చోట మాగన్నుగా నిలుచుని ఉంది. నిద్రలేచిన లాలస పచ్చికమీద కూర్చుని ఉంది.

"బాగా నిద్ర పట్టిందా? అలసట తీరిందా?" తనతో పాటు గుర్రంమీద రాత్రంతా మేలుకునే ఉన్న లాలసను ప్రశ్నించాడు.

లాలస తల ఆడిస్తూ, చిరునవ్వు నవ్వింది. "నువ్వు పడుకోలేదా?"

సమాధానం చెప్పబోతూ, నంది తటాలున ఆగి, చెవులు రిక్కించాడు. పెదవుల మీద చూపుడు వేలు ఉంచుకుని నిశ్శబ్దంగా ఉండమని లాలసకు సైగ చేశాడు. పక్కకు తిరిగి, తమను అక్కడికి చేర్చిన దారివైపు చప్పుడు చేయకుండా నడవసాగాడు.

**(ఇంకా వుంది)**



# మీ వ్యక్తిత్వం తెలుసుకోండి

**అందరి చర్మం రంగూ ఒకేలా ఉండదు. కొందరు తెల్లగా ఉంటే మరికొందరు డార్క్‌గా, ఇంకొందరు ఎరుపుగా, కొంత మందేమో కాస్త ఎల్లోయిష్ రంగులో ఉంటారు. ఇప్పటివరకు కళ్ళు, చేతిరేఖలు, కాలిరేఖలు, ఇలాంటి వాటిని చూసి వ్యక్తిత్వాన్ని తెలుసుకోవచ్చని విన్నాం. కాని చర్మం కలర్‌ని బట్టి కూడా స్వభావం తెలుసుకోవచ్చని ఎప్పుడైనా విన్నారా? అయితే తెలుసుకోండి!**

వేరువేరుగా అనిపించే స్కిన్‌కలర్, ఆ వ్యక్తి స్వభావాన్ని తెలుపుతుందని కొత్తగా వచ్చిన కొన్ని స్టడీస్ చెబుతున్నాయి. మరి ఇలా ఏ స్కిన్ కలర్ వారికి ఎలాంటి స్వభావం ఉంటుందో చూద్దాం!

### చామనచాయ

చామనచాయ రంగు కలిగిన వ్యక్తులు ఆరోగ్యంగా ఉంటారు. కష్టపడి పనిచేసే స్వభావం కలిగి ఉంటారు. అంతేకాక కెరీర్ మీద ఎక్కువ దృష్టి పెడుతుంటారు. వీళ్ల చేసే ఉద్యోగాన్ని చాలా సీరియస్‌గా తీసుకుంటారు. ఎంచుకున్న ప్రతి రంగంలో విజయవంతం అవుతారు.

### డార్క్ స్కిన్

డార్క్ స్కిన్ కలిగిన వాళ్ల చాలా ధైర్యంగా, తెలివిగా ఉంటారు. వీళ్ల జీవితంలో చాలా సమస్యలు ఎదుర్కొంటారు అయినప్పటికీ వేటికీ చలించరు, భయపడరు. అన్ని సందర్భాల్లో ధైర్యంగా ఉంటారు. ఎవరికీ తలవంచరు. రిస్క్ తీసుకోవడం అంటే వీరికి ఇష్టం.

### ఫెయిర్ స్కిన్

ఫెయిర్ స్కిన్‌తో పాటు కాస్త గులాబీరంగుగా ఉండే చర్మంరంగు ఉన్నవాళ్లు చాలా తెలివైన వాళ్లు. వీళ్లు చాలా రొమాంటిగ్గా ఉంటారు. అంతేకాదు చాలా ఆకర్షణీయంగా ప్రతి విషయంపట్ల అటెన్షన్‌గా ఉంటారు.





### ఎల్లోయిష్ స్కిన్

కొంతమంది చర్మం కాస్త ఎల్లోకలర్‌లాగా కనిపిస్తూ ఉంటుంది. అలాంటి వాళ్ల చాలా ఓర్పు కలిగి ఉంటారు. చాలా చురుగ్గా, తెలివిగా వ్యవహరిస్తారు. అలాగే కొన్ని విషయాల్లో సీరియస్‌గానూ ఉంటారు, హ్యాపీగానూ ఉంటారు. సంతోషమైనా, బాధనైనా వెంటనే వ్యక్తం చేసేస్తారు. అయితే వీళ్ల తరచుగా అనారోగ్యం పాలవుతుంటారు. కొన్నిసార్లు దీర్ఘకాలిక వ్యాధులను కూడా కలిగి ఉంటారు.

### ఎరుపు రంగు స్కిన్

కొందరి చర్మం ఎరుపు రంగులో ఉంటుంది. ఈరంగు చర్మం కలవారిలో ఓర్పు ఎక్కువ, అలాగే తెలివి తేటలూ ఎక్కువే. బాగా కష్టపడి పనిచేస్తారు. అన్ని విషయాల్లో నేర్పుగా ఆలోచిస్తారు. ఇంటిపనైనా, ఉద్యోగంలో పనైనా ప్రణాళిక ప్రకారం చక్కగా చేసుకుంటారు. అనవసరంగా ఆందోళన చెందరు.

### మిక్స్‌డ్ కలర్

కొన్ని భాగాల్లో ఫెయిర్, మరికొన్ని భాగాల్లో చామన చాయగా ఉండేవాళ్ల చాలా స్టేబుల్‌గా ఉంటారు, కష్టపడి పనిచేస్తారు. బాగా చదువుకుంటారు. అయితే కొన్ని విషయాల్లో చాలా బద్ధకంగా ఉంటారు. ఇలా రెండు రకాల స్కిన్ కలర్స్ కలిగిన వాళ్ల చాలా క్రియేటివ్‌గా కూడా ఉంటారు. వాళ్ల ఆలోచనలు కూడా చాలా విభిన్నంగా ఉంటాయి. గొప్ప లీడర్స్, రాజకీయవేత్తలు, కవులు, రచయితలు అయ్యే అవకాశాలున్నాయి.

### ఆయిల్ స్కిన్ ఉంటే

కొందరి చర్మం జిడ్డుగా ఉంటుంది. ఇలాంటి చర్మతత్వం ఉన్నవారు వాక్‌చాతుర్యం కలిగి ఉంటారు. అందరినీ కలుపుకుపోయే తత్వం ఉంటుంది. ఎదుటి వ్యక్తిపై ఒక మంచి ఇంప్రెషన్‌ని క్రియేట్ చేసుకుంటారు. అలాగే వీరు మంచి వ్యక్తులు కూడా. అదే విధంగా డ్రైస్కిన్ ఉన్నవాళ్లు ఎక్కువగా ఎవరితోనూ మాట్లాడరు. ఒకవేళ మాట్లాడితే వారి మాటలతోనే ఎదుటివారిని ఆకట్టుకుంటారు. మాటలతో వాళ్లకు కావాల్సిన పని పూర్తి చేసుకుంటారు. మరికొందరి స్కిన్ చాలా సెన్సిటివ్‌గా ఉంటుంది. ఈ సెన్సిటివ్ స్కిన్ కలిగిన వాళ్ల చాలా బాధ్యతాయుతంగా ఉంటారు. ఎమోషనల్‌గా ఉంటారు. చాలా ప్రేమగా ఆనందకరంగా ఉంటారు.

### నార్మల్ స్కిన్

నార్మల్ స్కిన్ కలిగిన వాళ్లకు ఆలోచించే గుణం ఎక్కువ. వీళ్ల చాలా చమత్కారమైన వాళ్లు. కానీ అంతర్ముఖులు, కార్యసాధన కలిగిన వాళ్ల ఏ విషయాన్నైనా తమలోనే దాచుకోవడం అలవాటు. ప్రతి చిన్న విషయానికి ఎమోషనల్ అవడం వీరి తత్వం. అయితే వెంటనే తేరుకుని లక్ష్యం దిశగా తమ ప్రయత్నం కొనసాగిస్తారు.

- పుష్పలత



# జీవితమే ఒక ప్రతిఘటన

## (కోట శ్రీనివాసరావు కథాకథనం) 20

(గతవారం తరువాయి)

**అప్పట్లో ప్లాట్‌ఫామ్ టిక్కెట్లు, ట్రైన్ టిక్కెట్లు ఒకలాగే ఉండేవి. ఆఖరినిమిషంలో హడావుడైపోయి ప్రొడక్షన్ మేనేజర్లు అసలు టిక్కెట్ల బదులు ప్లాట్‌ఫామ్ టిక్కెట్లు ఇచ్చేసేవారు. దాంతో మేం ట్రైన్‌లో మళ్ళీ టీసీ అడిగినంత డబ్బూ కట్టేవాళ్ళం.**

'శత్రువు' తర్వాత నాకు అంతపేరు తెచ్చిన చిత్రం 'రక్షణ'. ఉప్పలపాటి నారాయణరావు దర్శకుడు. శోభన, రోజా కథానాయికలు. అన్నపూర్ణ స్టూడియోస్ పతాకంపై రూపొందింది. ఆ చిత్రం మొదలయ్యేనాటికి నేను హైదరాబాద్‌కి షిఫ్ట్ కాలేదు. మా కుటుంబం మద్రాసులోనే ఉంది. ఓ

## ఆ పాత్ర కోసం ఎంతగా అంతర్మథనం చెందానో!

రోజు ఉప్పలపాటి నారాయణరావు ఫోన్ చేశారు. ఆ వేళ సెకండ్ సండే అనుకుంటా.

'కోటగారూ... ఇంట్లోనే ఉన్నారా? కాస్త తీరుబాటుగానే ఉన్నారా?' అని అడిగారు. నాకు అంతకు ముందే ఆయనతో పరిచయం.

'ఆ.. ఇంట్లోనే ఉన్నానండీ. ఏమిటండీ విషయం' అని అడిగాను.

'మీరు ఖాళీగా వుంటే ఒకగంట అన్నపూర్ణ ఆఫీసుకు రండి' అన్నారు. అన్నపూర్ణ స్టూడియోస్ ఆఫీస్ మద్రాసులోనూ ఉండేది.

'సరేనండీ, మధ్యాహ్నం వస్తాను' అని చెప్పా.

### రక్షణ చిత్రంలో సరికొత్త మేనరిజమ్

నేను వెళ్లేసరికి నాగేశ్వరరావుగారి పెద్దబ్బాయి వెంకట్‌గారు ఉన్నారు. నన్నుచూసి నవ్వుతూ పలకరించారు. 'ఎండనపడి వచ్చారు' అని ఫలహారం పెట్టారు. పక్కనే డైరెక్టర్‌గారు కూడా ఉన్నారు. తిని, టీ తాగుతుండగా, 'ఓ సినిమా చేయబోతున్నాం కోటగారూ. ఇందులో ఓ పాత్ర ఉంది. కథకి చాలా ఇంపార్టెంట్ వేషం. మీరు ఇప్పటిదాకా చేయనిదేమీ కాదు. మంచి పొలిటికల్ వేషం. ఇప్పటికే పొలిటికల్‌గా చాలా పాత్రలు వేశారు, ఇందులో ఏదైనా కాస్త మార్పుంటే బావుంటుంది. దానికి ఏం చేస్తే బావుంటుందా? అని డిస్కస్ చేస్తున్నాం. మీరు కూడా ఉంటే బావుంటుంది కదా అని పిలిచాం. అలా కాకుండా మామూలుగా పెడితే రొటీన్‌గా ఉంటుందనిపిస్తుంది' అన్నారు.

కొత్తగా ఏం చేస్తే బావుంటుందా? అని ఒక పదినిమిషాలు ఆలోచించి..

'ఏవండీ యంగ్ క్యారెక్టరా? ఓల్డా?' అని అడిగా.

'యంగ్ ఏమీ కాదండీ. 50 ఏళ్ళు ఈజీగా ఉంటాయి. అతనికి తమ్ముడు ఉంటాడు. వాడు చాలా క్రూరుడు. ఏం చేయాలన్నా చేతికి మట్టి అంటకుండా తమ్ముడుచేత చేయించే రాజకీయ నాయకుడు. పార్టీలో మంచిపేరుతో కొనసాగుతుంటాడు' అన్నారు వెంకట్. అందరం ఆలోచనలో పడ్డాం. ఎవరికివాళ్ళం మాట్లాడకుండా కూర్చున్నాం. అంతలో నారాయణరావుగారు అందుకుని,

'మీరు చాలా పిక్చర్లు చేస్తున్నారు కదా. మీ






మేకప్‌కి, మిగిలిన విషయాలకి వీలుపడేలా ఉండాలి. ఎందుకంటే నా సినిమాలో వేషం బావుండాలని ఇతర సినిమాల్ని ఇబ్బంది పెట్టడం కరెక్ట్ కాదు' అన్నారు.

'ఆ విషయం ఏమీ ఫర్వాలేదులెండి విగ్గులే మెయింటెయిన్ చేస్తున్నాను' అన్నా.

అంతలో చటుక్కున ఓ ఐడియా తట్టింది.

'బట్టతల ఉండి, తల ఆగకుండా అడ్డంగా అలా అలా ఊగుతూ ఉంటే ఎలా ఉంటుందండీ' అన్నా.

'బావుంటుందండీ. చాలా బావుంటుందండీ... అలాంటి మేనరిజమ్ మనం ఇంతకుముందు చూడలేదు. చాలా బావుంటుంది. మీరు చేస్తానంటే మహదానందం' అన్నారు డైరెక్టర్‌గారు.

అప్పట్లో ప్రతిరోజూ క్లీన్ షేవ్ చేసేవాణ్ణి. నా మేకప్‌మన్ మోహన్ భలే తమాషాగా విగ్గు కుట్టించాడు. బట్టతల ఉన్నోళ్లకి ముందంతా పుర్రె కనిపించి వెనక జుట్టు ఉండేటట్టు ఉంటుందే, అలా చేయించాడన్నమాట. మేకప్ నాకు చాలా బాగా సూటయిందని తొలిరోజు లొకేషన్‌లో అందరూ అన్నారు.

'షాట్ రెడీ సార్' అని కో డైరెక్టర్ వచ్చి చెబితే పొజిషన్‌లోకి వెళ్ళబోతూ ఆగా. అక్కడ టేబుల్‌మీద ఓ ఇంగ్లీష్ బుక్ ఉంది. దాని పేరు గుర్తులేదుగానీ మన 'నవ్య'లాంటి మ్యాగజైన్ అనుకోండి. కరెక్ట్‌గా ఆ విగ్గులో నేను ఎలా ఉన్నానో, అలాగే ఉన్న ఓ వ్యక్తి ఫొటో బుక్‌మీద ఉంది. చూడగానే గమ్మత్తుగా అనిపించింది.

'ఏంటి నారాయణరావుగారు...! గమ్మత్తుగా వుంది మ్యాగజైన్ కవర్ ఫొటో' అన్నా.

ఆయన నవ్వి 'అవునండీ. వస్తుంటే కనిపించింది. మీ క్యారెక్టర్ గుర్తొచ్చి తెప్పించాను. అది బల్లమీద ఉంటే క్యారెక్టర్ ఇంట్రడక్షన్‌కి బావుంటుంది' అన్నారు.

ఆ మ్యాగజైన్ కవర్‌పేజీ మీద వ్యక్తి చెంపన చెయ్యి పెట్టుకుని కూర్చున్నాడు కదా, మీరు కూడా అలాగే కూర్చోండి అన్నారు. చెప్పినట్టే చేశా. ఆ ఫోజు సినిమాలో చాలా బాగా కనిపించింది. ఆ చిత్రం షూటింగ్ దాదాపు హైదరాబాద్

# మంచి క్యాలిబర్ ఉన్న నటుడు భరణి

తనికెళ్ళ భరణిగారిపట్ల నాది సోదర ప్రేమ. ఉద్యోగం చేసే రోజుల నుంచే నాకు భరణిగారు బాగా తెలుసు. అప్పుడు ఆయనకూడా ఉద్యోగం చేసేవారు. చాలా గొప్ప రచయిత. మంచి నటుడు. భరణిగారు, ఆయన గురువుగారు కలిసి చేతిలో ఏమీ లేకుండా చంకలో ఓ సంచి వేసుకునివెళ్ళి పరిషత్తులో 'రేడియో' అని ఒక రంటే 'ఆ.. రేడీ' అని ఇంకొకరంటూ కూడబలుక్కుని నాటకాలు ఆడి ప్రైజులు తెచ్చేవారు. మంచి దమ్ము, క్యాలిబర్ ఉన్న నటుడు భరణిగారు. సినిమాల్లో ఆయనకు రావాల్సినంత పేరు ఇంకా రాలేదేమో అనిపిస్తుంది. ఆయన రాసిన 'ఆటగదరా శివా' నాకు చాలా ఇష్టం. భరణిగారి శైలిలో మహత్తు ఏంటంటే ఆయన పెన్ను పెడితే సగటు మనిషికి కూడా ఇట్టే అర్థమవుతుంది. నాకు మంచిఫ్రెండ్. గొప్ప వ్యక్తిత్వం గల వ్యక్తి. పుస్తకం హస్తభూషణం అన్నమాట జాగ్రత్తగా ఫాలో అవుతారు. ఎప్పుడూ ఏదో ఒకటి చదువుతూనే కనిపిస్తారు. మేం నాటకాలు వేసే రోజుల్లో రాత్రి ఒంటిగంట దాటాక కూడా కలిసి తిరిగేవాళ్ళం. కొన్నిసార్లు రాత్రి ఒంటిగంట దాటాక నాతో మా ఇంటికి వచ్చేవారు. అప్పుడు



స్నానాలుచేసి, నేనేదో వండిపెడితే తిని వెళ్ళేవారు. రాళ్ళపల్లిగారు కూడా మాతో చాలాసార్లు కలిసేవారు. అప్పట్లో సినిమాల గోల లేదు. అందరం చాలా చక్కగా కబుర్లు చెప్పుకునేవాళ్ళం.

లోనే తీశారు. ఒకవేళ ఏమైనా ఒకటీ అరా ఉన్నా పక్కన పల్లెటూర్లలో తీశారు. అప్పట్లో పల్లెటూరి షాట్ అంటే ఎక్కువగా దేవరయామిజాలకు వెళ్ళేవాళ్ళం.

### నాగార్జునగారి కితాబు

ఆ చిత్రంలో ఓ మంచిసీన్ ఉంది. నేనున్న పార్టీ ఆఫీసుకి వస్తాడు నాగార్జున. అప్పుడు నేనేదో డిస్కషన్ పెడతా. దానికి అతనేదో అంటాడు. వెంటనే ఘాటుగా మాట్లాడతా. సహనం చచ్చిపోయిన నాగార్జున చాచి ఒకటి పీకుతాడు. అప్పటిదాకా ఊపుతున్న తలను చెంపదెబ్బతిన్న తర్వాతకూడా ఊపటం కంటిన్యూ చేస్తా. అది చూసి నాగార్జునగారు ఆశ్చర్యపోయారు. దానికి తోడు ఆయనకి నవ్వు వచ్చేసింది.

నవ్వు ఆపుకుని 'ఎంత బాగా చేస్తున్నారు శ్రీనివాసరావుగారూ! దెబ్బతిని కూడా అలా తల ఊపడం చాలా ఇబ్బందిగా ఉంటుందికదా, రెప్పపాటులోపే మీరు మళ్ళీ క్యారెక్టర్‌లోకి రావడం ఆశ్చర్యంగా ఉంది' అన్నారు.

ఆ సినిమా విడుదలయ్యాక 'కోట భలే చేశాడురా' అనే టాక్ ఇండస్ట్రీలో మరోసారి స్ప్రెడ్ అయింది.

### రాచకొండ లచ్చన్న

'రక్షణ' తర్వాత మరలా నాకు అంత తృప్తినిచ్చిన పాత్ర 'అలెగ్జాండర్' చిత్రంలో నేను చేసిన రాచకొండ లచ్చన్న పాత్ర. వరుణ్ మూవీస్ తెరకెక్కించిన చిత్రం. సుమన్ హీరో. వాణీవిశ్వనాథ్ నాయిక. కె.రంగారావు దర్శకత్వం. సత్యనారాయణ నిర్మాత. అప్పటికే డైరెక్టర్ రంగారావుకు ఐదారు సినిమాల అనుభవం ఉంది. ఆ అనుభవంతో రాసుకున్న పాత్ర రాచకొండ లచ్చన్న. డైలాగులు కూడా అద్భుతంగా రాశారు. ఫ్రాంక్‌గా చెప్పుకోవాలంటే అప్పట్లో ఫామ్‌లో ఉన్ననటుడు గోపాలరావుగారు చేయాల్సిన పాత్ర అది. అంతే



ఉప్పలపాటి నారాయణరావు

**శత్రువు సినిమా తర్వాత కోట శ్రీనివాసరావు గారికి రక్షణ, అలెగ్జాండర్ చిత్రాలు మరింత మంచిపేరు తెచ్చాయి. రక్షణ చిత్రంలో రాజకీయనాయకుడి మేనరిజమ్ నాగార్జునను అబ్బురపరిస్తే, అలెగ్జాండర్ చిత్రంచూసిన రామానాయుడుగారు ప్రత్యేకించి షూటింగ్ స్పాట్‌కు వచ్చిమరీ కోటగారిని ప్రశంసించారు. అదేస్ఫూర్తితో విలక్షణమైన హిజ్రా పాత్రను పండించేందుకు షూటింగ్‌కి ముందు అంతర్మథనానికి గురయ్యారు కోట. అదేమిటి?**

అంత లెవెలున్న, సీనియర్ ఆర్టిస్టు చేయాల్సిన పాత్ర నాకు రావడం చాలా అదృష్టం.

'లచ్చన్న అంటే ఏమనుకుంటున్నావ్... ఇక్కడ చిటికేశానంటే ఢిల్లీ మెయిన్ రోడ్లమీద పోలీసు వ్యానులు తిరుగుతుంటాయి. ఇక్కడ అగ్గిపుల్ల వెలిగించానంటే ఢిల్లీ సెంటర్‌లో ఫైర్ సర్వీస్ తిరుగుతుంటుంది' అనే పవర్‌ఫుల్ డైలాగ్స్ ఉన్న చిత్రం. లచ్చన్న ఎవరితో మాట్లాడినా అలాగే మాట్లాడుతాడు. ఆ చిత్రంలోకూడా బాబూమోహన్‌తో కాంబినేషన్ ఉంది.

### గొప్పమనసున్న రామానాయుడు

అలెగ్జాండర్ సినిమా ఎల్లుండి విడుదలవుతుందనగా రామానాయుడుగారు చూశారు. నేను ఆ రోజు విజయనిర్మలగారి డైరెక్షన్‌లో సినిమా చేస్తున్నా. సాయంత్రం నాలుగు, ఐదు గంటలప్పుడు అనుకుంటా బ్రేక్ ఇచ్చారు. అటుగా వెళ్ళబోతుంటే ఒకతను వచ్చి,

'రామానాయుడుగారు మీకోసం వచ్చారండీ. బయట వెయిట్ చేస్తున్నారు' అని చెప్పాడు. పెద్దాయన రావడం ఏంటి? అని కంగారుపడ్డా. హడావిడిగా బయటకెళ్ళి చూస్తే వరండాలో ఉన్నారు.

'డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక ఇక్కడేవున్నాను' అన్నారు.

'సార్ ఏంటి సార్ ఇలా వచ్చారు. కబురు పెడితే నేనే వచ్చేవాణ్ణిగా' అన్నా.

'కంగారుపడకు. ఏమీలేదు. ఇప్పుడే 'అలెగ్జాండర్' సినిమా ప్రివ్యూ చూసివస్తున్నా. నువ్వు ఇక్కడ ఉన్నావని తెలిసి కంగ్రాట్స్ చెబుదామని ఆగాను. మంచి ఆర్టిస్ట్ ఇండస్ట్రీకి వచ్చాడని అక్కడంతా అనుకున్నాం' అన్నారు.

చాలా సంతోషంగా అనిపించింది. నా జీవితంలో మంచిచెడులకు ఎప్పుడూ రామానాయుడుగారు తోడుగా ఉండేవారు. చాలా గొప్పమనసున్న వ్యక్తి ఆయన.

'అలెగ్జాండర్' తర్వాత సుమన్‌గారితో నేను చేసిన మరో మంచి చిత్రం 'రెండిళ్ల పూజారి'. అందులో నాది హిజ్రా పాత్ర. ఆ చిత్రంలో మెయిన్ వేషం అదే. నా పాత్రకు ముందు తనికెళ్ళ భరణిగారిని అడిగారట. కానీ ఆయన, 'నాకన్నా కోట శ్రీనివాసరావు చాలా బాగా చేస్తాడు. పాత్ర పండుతుంది' అన్నారట. ఈ విషయం తర్వాత నాకెవరో చెబితే తెలిసింది. అందులో నా పాత్ర తెలంగాణ మాండలికం మాట్లాడుతుంది. డైరెక్టర్ వచ్చి కథ చెప్పాడు. నా క్యారెక్టర్ గురించి విన్నప్పటినుంచి నాకు ఒకటే టెన్షన్.. టెన్షన్ అంటే ఆ పాత్ర ఎలా చేయాలి? ఎలా పండించాలి? అని! అంతకు ముందెప్పుడూ అలాంటి పాత్ర చేసింది కూడా లేదు. అప్పుడు నా మనసులోవున్న బాధంతా నా పర్సనాలిటీ గురించే. ఇప్పుడంటే కాస్త జంకినట్టు ఉన్నాను కానీ, అప్పుడు 43-44 ఏళ్ళప్పుడు మంచి పట్టుమీద ఉండేవాణ్ణి. అంత హుందాగా ఉండే ఆ శరీరంలో ఆడలక్షణాలు ఎలా పలికించాలి? ఆ మేనరిజం, ఆ నడక ఎలా? నాలుగైదు రోజులు ఇదే ఆలోచన. కాస్త ఇబ్బందిపడ్డా. ఇబ్బంది అంటే లొకేషన్‌లోకాదు. సినిమా ప్రారంభానికి ముందు ఆ పాత్రను జీర్ణించుకుని ఒకరూపు తెచ్చుకోవడానికి ఇంట్లోనే నాలో నేను చాలా అంతర్మథనానికి గురయ్యానన్నమాట. అప్పుడు మెరుపులా ఓ ఆలోచన వచ్చింది.

**(ఇంకా ఉంది)**

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**




# కండలబడి!

**దండముడి! యవ్వనం దాటుతున్న వయసు. ఎప్పుడూ, శరీరం మొత్తం కదిలే ఏదోఒక పని పరులమేలుకోరి చేస్తూ ఉండడమే దండముడి వ్యాయామం! ఎవరు చేసినా, తప్పుని తప్పు అనడానికి వెనుకాడడు. తప్పు ఒప్పుకోకుండా తప్పే ఒప్పని ఎదురుతిరిగితే, ఎదురు తిరిగినవాడి అస్తులు అస్తవ్యస్తం అవుతాయని, చికిత్స చేయడానికి నెలలు, నెలలు పడతాయని తెలియని వాడు లేడు. చిత్రమేంటంటే అది ఒకే ఒక దెబ్బ!**

దండముడికి అడక్కుండానే మంచిపోలీసుల అండవుంది! కానివాళ్ళూ, దండముడి దెబ్బతిన్న వాళ్లూ, దండముడికి చెడుదెబ్బ రుచి ఎలా ఉంటుందో చూపించాలని నిరంతరం ఆలోచనలు వండుతున్నారని అందరికీ తెలుసు!

దండముడిని మించినవాణ్ణి వెతికిపట్టి, పోటీలో అందరిముందూ నిలబెట్టి, దండముడిని లేవకుండా చేయాలన్న ఆలోచన తిరుగులేనిదని నిర్ణయించుకున్నారు!

•••

వాళ్ళ దురాలోచన ఆనందంతో గంతులేసింది. దురాశయానికి ఆశ చిగురించింది. బండతడి అని ఓ కదులుతున్న కండ కనిపించింది.

"నీకు తిండిపెట్టడం నా సంపాదనతో అయ్యే పనికాదురా. ఏం చేస్తావో నాకు తెలియదు. నీదారి నువ్వే చూసుకోవాలి. లేకపోతే నిన్ను కన్నవాళ్ళకు, నీ తోడబుట్టినవాళ్ళకు అన్యాయం చేసినవాడివవుతావు" అని ఓ తండ్రి కొడుకుతో అన్నాడని తెలుసుకున్నారు. అలా ఇల్లొదిలి బయటపడ్డ కొడుకుని చేరదీశారు. "నీ బాగోగులన్నీ మేం చూస్తాం, నువ్వు మా బాగోగులు చూడాలి" అన్నారు బండతడితో.

చిక్కెక్కడొచ్చిపడిందంటే, వ్యక్తిత్వంలో కూడా దండముడికి ప్రతిబింబం బండతడి! "నా సంగతి సరే, మీ బాగోగులేంటో స్పష్టం చేయండి" అన్నాడు. చెప్పీచెప్పకుండా వాళ్ళు చెప్పిందాంట్లో ఆంతర్యం పసిగట్టాడు బండతడి. దండముడిని కలవాలన్న కోరిక వ్యక్తం చేసింది బండతడి మనసు!

"వీడితో మర్యాదేంటి, అరేయ్! మాక్కావాల్సిందది. నీక్కావాల్సిందేదో చెప్పు" అని నోరు జారాడొకడు, పక్కనున్నవాళ్ళే తన పిక్కబలమనుకుని, అంతే!

'బండతడి' తగిలింది. తడి తుడుచుకోడానికి డాక్టరు దగ్గరికి వెళ్ళారు.

"ఇది దండముడి దెబ్బలాగుందే!" అన్నాడు డాక్టరు.

"ఏం చేస్తాం డాక్టరుగారో! మా సుడి, దెబ్బ మీద దెబ్బ అయినట్లయింది" అని కన్నీరు కార్చింది ధూర్తమూక!

•••

ఆ ఇద్దరి ప్రతిభాపాటవం ఉట్లభట్లు కూతుళ్ల చెవిలో పడింది. తర్వాత కంట్లో పడింది. ఆ తర్వాత మనసులో కలలపాలు తాగడం మొదలైంది! తండ్రికి చెప్పారు. తల్లిలేని పిల్లలు ఎప్పుడూ ఏదీ అడగనివాళ్లు నోరు తెరిచారు. అడిగింది కొండమీద కోతుల్ని కాదు!

అదెంతపనో అంచనా వేయకుండా అదెంత పనీ! అన్నాడు ఉట్లభట్లు.

•••

ఉట్లుకొట్టడంలో, అట్లు నోట్లోపెట్టడంలో పెట్టింది పేరైన ఉట్లభట్లు అందరినోట్లో నాని, ఉబ్బి, ఒళ్ళు బరువై ఉట్టికి ఎగరలేక పొట్టచేతిలో పట్టుకుని ఓ హోటల్లో పిండిరుబ్బే వాడిగా చేరాడు!

ఉబుకుతున్న కాయాన్ని అదుపులో పెట్టడానికి ఉపాయం వెతుకుతూ ఓ వృద్ధ పహిల్వాన్ దగ్గర ఒళ్ళు ఒత్తే పనిలో కుదిరి ముదిరాడు! ఒత్తమన్న ఒళ్ళు కళ్ళు మూసింది. మూసినకళ్ళు మిగిల్చింది ఓ వ్యాయామశాల!

ఉట్లభట్లు 'జిమ్'అందినాదం అని పాట పాడాడు. కండలబడికి వారసుడయ్యాడు!

నడపడంలో ఒడుపు తెలియక, బడి కూలబడిపోతుందేమో అన్న భయానికి కూతుళ్ల కోరిక ధైర్యాన్నిచ్చింది. దండముడి ఇంట్లోనే బండతడి ఉంటున్నాడని తెలుసుకున్నాడు.

•••

పోలీసు ఉద్యోగం చేతికి అందబోతే, ఏ ఒకళ్ల చేతికింద ఏ పనీ చేయలేం అని స్పష్టంగా వినయంగా చెప్పారు. వ్యాపారశాలకన్నా వ్యాయామశాలే ఆరోగ్యకరమైన ఆలోచన అనుకున్నారు. ఎక్కడా అన్న ప్రశ్నవస్తే, "ఇంకెక్కడో ఎందుకు ఇంతపెద్ద ఇల్లుండగా" అన్నాడు బండతడి.

"నావాళ్ళ ఆత్మీయతలు ప్రతిధ్వనిస్తున్నచోట మనసెందుకో అంగీకరించడం లేదు. సెంటిమెంటుతో, ఎంతకాలమని ఇల్లు ఖాళీగా ఉంచుతాం గానీ.." అన్నాడు దండముడి.

"ఉంచకుండా అంత తేలిగ్గా తీసేయలేంగా" అన్నాడు బండతడి.

సరదాగా మాట్లాడడం బండతడిలో పొడి. ఇద్దరిలో తేడా అదే! సరిగ్గా ఆ సమయంలో ఉట్లభట్లు వచ్చాడు. అంతకుముందే ఉట్లభట్లు ప్రస్తావన వచ్చింది. వచ్చినవాడు కూర్చోడానికి అతికష్టమైంది ఆ లావుతో. "మేం ఇద్దరం కలిసికూడా మిమ్మల్ని ఎత్తలేనంతగా ఉన్నారంకుల్" అన్నాడు బండతడి. నవ్వాడు ఉట్లభట్లు. నవ్వడంకాక ఇంకోటి చేయలేని పరిస్థితి!

"ఎప్పుడూ రానివాళ్ళు, మాతో ఏం పనిపడి వచ్చారో" అన్నాడు దండముడి. చెప్పాడు ఉట్లభట్లు. సంతోషంగా ఒప్పుకున్నారు దండముడి, బండతడి.

•••

ఏది ఎలా ఉండాలి? ఉన్నవి ఎలా ఉన్నాయి? కొత్తవేం తేవాలి? అని శాలను చూస్తున్న ముడి, తడులకు "భాంగురే.." అని "మజ్జారే..." అని అమ్మాయిల గొంతులు వినిపించాయి.

"మా అమ్మాయిలే కొద్దిగా చిలిపివాళ్ళు" చెప్పాడు ఉట్లభట్లు.

"మా పని మమ్మల్ని చేసుకోనిస్తారా లేదా" అన్నాడు బండతడి.

"ఇటువైపు రారు. మిమ్మల్ని చూస్తే ఆగలేస్తారో, లేదో" అన్నాడు ఉట్లభట్లు.

"ఏవిటి, మీరంటున్నది" అన్నాడు నవ్వుతూ బండ.

"ఒకవేళ నాకు తెలియకుండా వాళ్ళు చొరవేదన్నా తీసుకుంటే అన్యథా భావించవద్దని మనవి" అన్నాడు ఉట్లభట్లు.

•••

దురాలోచన దొరలకు శ్వాస ఆడడం మొదలు పెట్టింది!

"ఇక వీళ్ళవళ్ళ మనకు అంతగా నష్టంలేని రోజులొచ్చినట్టే".

"ఆశయాల్నీ, ఆవేశాల్నీ పెళ్ళే చల్లార్చుతుంది"

"కండబలం గుండెబలం తగ్గిపోతుంది".

ఎవరికితోచింది వారు ఆనందాల్ని మాటలు చేసి విసురుతున్నారు.

"మనం సరైన సమయం చూసి ముహూర్తం పెట్టాల్సిందే" అన్నారొకరు.

'దానికైనా, దేనికో అయినా మనం సాహసించలేం, మనం మనమని బయటపడ్డ వాళ్ళం".

"మరి దేనికి?"

"మన పనులకు మనం రిబ్బన్లు కత్తిరించుకోడానికి".

•••

*'తడిబండ మీదెక్కి బట్టలారేసుకో*
*బండతడి ఎండకుండ నువ్వు చూసుకో"*
*"దండముడి మెడలో పడేట్లు చేసుకో*
*ముడిదండగా కాకుండా దాచేసుకో"*

పాటలు జానపద బాణీలో వినిపించాయి.

"ఏం. ఎవరక్కడ? ఆ నేపథ్యగీతాలేంటి?" అన్నాడు బండతడి.

"మేమే, ఒకసారి మిమ్మల్ని చూడొచ్చా" అన్నారు అమ్మాయిలు.

"వచ్చు, చొచ్చుకొనిరావచ్చు" అన్నాడు బండతడి.

బండతడి నెత్తిమీద మొట్టికాయ వేశాడు దండముడి.

"ఓహ్! బాగున్నారు! మీ పేర్లేంటి!" అడిగాడు బండతడి.

చూసీ చూడనట్లున్నాడు దండముడి.

'కొండ బుజ్జి!"

"కోన బుజ్జి!"

•••

పరిచయాలు చనువులయ్యాయి!

"రండి, సెల్ఫీలు తీసుకుందాం. ఎవరు ఎవరో, ఎవరికి ఎవరో" పాడాడు బండతడి ఎవరిపక్క ఎవరు కోరుకుంటున్నారో వారు వారివారి పక్కన చేరారు.

"ప్రింటుతీసి, ఫ్రేంకట్టించి, ఇంట్లో పెట్టుకోండి" అన్నాడు బండ.

"అమ్మో! నాన్న" అన్నారిద్దరొకేసారి.

"అమ్మలేదుగా"

"నాన్నే!"

"ఏంటమ్మా, మీరెందుకు వచ్చారిక్కడికి? మీకేం పనిక్కడ?" అంటూ వచ్చాడు ఉట్లభట్లు.

"ఏంలేదు నాన్నా! ఎలాపెరగాలి, ఎలాపెంచాలీ అని మాటకో మాట వేద్దామని వచ్చాం."

"ఎవర్నీ పిల్లల్నా" అన్నాడు బండ.

"అవును బళ్ళో పిల్లల్ని" అంది కోన. దండ చిరునవ్వాడు.

•••

దాదాగిరులు, దందాగిరులు చేయాలనుకునే వాళ్ళు, అమ్మాయిల్ని వల్లో వేయాలనుకునే వాళ్ళకి తావేలేదు!

సినిమావేషాలవాళ్ళు, ఆటలపోటీలవాళ్ళు, ఆర్మీ, పోలీసుల్లో చేరేవాళ్ళు వస్తున్నారు. వాళ్ళ దగ్గర డబ్బులు అంతగా ఆశించడంలేదు దండముడి.

కాకుండా ఏంచేయాలా? అని సలహా అడగ డానికి వ్యాయామశాల ప్రారంభించిన డాక్టరు గారి దగ్గరికి వెళ్ళారు దండబండలు.

'మధుమేహాన్ని కరగించే కాయోపాయం వ్యాయామం" అన్న అక్షరాలు వేలాడదీశారు. లాభం పాలపొంగైంది. షుగర్‌వ్యాధి ఎంతోమందిని పీడి స్తున్నదన్నమాట! అనుకున్నాడు దండముడి.

•••

డబ్బులు ఎవరికి ఎంత అని లెక్కలేస్తుంటే డాక్టరుగారు వచ్చారు.

"దానికంత ఆలోచనెందుకు నలుగురొకటవ్వండి" అన్నారు డాక్టరుగారు.

"ఇద్దరొకటవడం విన్నాంగానీ.." అన్నాడు బండ.

"అప్పుడు నలుగురు ఇద్దరవుతారు. ఆ ఇద్దరు ఒకటైతే ఒకటేగా"



**ఆ ఊళ్ళో పెద్ద కండలవీరుడు దండముడి. అన్యాయాన్ని సహించడు. చేసినతప్పు సమర్థించుకుంటూ ఎదురుతిరిగితే ఇక అంతే సంగతులు. ఒకేఒక దెబ్బ! మానడానికి నెలలు పడుతుంది. అదీ దండముడి దెబ్బంటే! అతడికి మంచిపోలీసుల అండ ఉంది. కానీ అతడికి వ్యతిరేకులూ తయారయ్యారు. అంతటి మొనగాణ్ణి వెతికితెచ్చి దండముడిని దెబ్బతియ్యాలనుకున్నారు. మరి అంతటివాడు దొరికాడా? అప్పుడేం జరిగింది?**

"మీ సంఖ్యాశాస్త్రం బాగానే ఉంది. మరి నా సంగతో" అన్నాడు భట్లు.

"నువ్వు, నాలుగూ ప్లస్ ఒకటి లేవయ్యా ఉట్లభట్లూ, అట్లభట్లూ" అన్నారు డాక్టరుగారు అందరితో నవ్వులు పంచుకుంటూ.

•••

దురాలోచన కొరలు కలిశారక్కడ!

"ఎంతటి మగవాణ్ణయినా పీల్చిపిప్పిచేసి పడేయ గలిగే శక్తి పెళ్ళిలోనే ఉంది. పెళ్ళాం గొళ్ళెం, సముద్రంలో విసిరిన గాలమ్మై, షార్కులకు షాకిస్తుంది! డాల్ఫిన్లకు పిన్నులు గుచ్చుతుంది! వేల్స్‌కి గోల్స్ లేకుండా చేస్తుంది!" అని ఒకళ్ళన్నారు.

"ప్రతి పురుషుడి విజయం వెనుక ఓ స్త్రీ ఉంటుంది అంటారేంటి" అడిగారొకరు.

"వెనుక ఉండడమంటే అంటుకుపోయి ఉండడం కాదు. పూలతో నిమిరిన అనుభూతి కలిగించడం".

"గునపాలతో పొడిచిన అనుభవాన్నీ కలిగిస్తుంటారుగా".

"ఆ పొడుపులతో విజయాలెలా వస్తాయబ్బా"

"అదే నాయనా బ్రహ్మరహస్యమంటే".

"అబ్బా చెప్పబ్బా" అన్నాడొకతను.

"ఆరేయ్! పెళ్ళైన సంగతి మరచిపోయిన వాడివి నీకెందుకురా పెళ్ళిలోతులు, పెళ్ళి గోతులు" అరిచాడతను.

"ఏదో అడిగాడు పాపం, చెప్పొచ్చుగా".

"చెప్పలేను, నేనేకాదు, ఆ బ్రహ్మకూడా చెప్పలేడు".

"ఎందుకో!"

"ఆయన వెనుక సరస్వతి ఉందిగా!"

"ఆపండ్రా, మీ గోల! బండతడి-కొండ, దండముడి-కోనల పెళ్ళికి వెళ్దామా, వద్దా?" అన్నాడు పెద్దదొరవచ్చి.

"పెళ్ళిళ్ళకు వెళితేనే, అక్షింతలు విసిరితేనే మనం పెద్దమనుషులం అవుతాం"

"నేనవను" అన్నాడొకతను.

"దేనికిరా"

"ఇక్కడిద్దరు వ్యాయామశాలపెట్టి దేశానికి సైనికుల్నీ, పోలీసు బలగాల్నీ సరఫరా చేస్తున్నారని, ఫోన్ చేయాలి."

"ఎవరికిరా"

"ఎవరికో నీకెందుకు?"

"నాకెందుకంటావురా" అని ఎగిరిమీదపడ్డాడు. చితకబాది, సెల్లు నీళ్ళలో పడేసి, "రా! పెళ్ళి భోజనం చేసొద్దాం" అన్నాడు పెద్దదొర!





# రెండు పడవల ప్రయాణం వద్దు!

**మనిషికి జీవితం ఒక వరం.**
**ఒకేఒక గొప్ప అవకాశం.**
**'నీకోసం నువ్వు బతుకు!**
**సమాజ పురోగతికోసం బతుకు'**
**అనే సూత్రానికి సురక్షితమైన**
**ఆలంబన కుటుంబమే.**
**అలాంటి కుటుంబంలో జీవితభాగస్వాములకు**
**నమ్మకమే పునాది.**
**ఎంతదూరాన ఉన్నా భార్యాభర్తలు ఒకరికోసం**
**ఒకరు పరితపించాలి.**
**అందుకు సీతారాముల అనుబంధమే ఆదర్శం.**
**ఏబంధమైనా చిరకాలం నిలవాలంటే..**
**ఒకరిపై ఒకరికి చెప్పలేనంత ప్రేమ, నమ్మకం,**
**సాన్నిహిత్యం..**
**ఈ మూడూ ఉన్నప్పుడే ఆ బంధం పర్ఫెక్ట్‌గా**
**ఉన్నట్లు లెక్క!**
**కానీ ఈకాలంలో కొందరు చిన్న విషయాలకే**
**గొడవలుపడి అనుబంధాలకు బీటలు**
**వేసుకుంటున్నారు.**

అనుబంధం, ప్రేమ కరువైన కాపురంలో, ఆ వెతుకులాట కొన్నిసార్లు వివాహేతర సంబంధాలకు, రహస్య స్నేహాలకు దారి తీస్తుంది!

వైవాహిక జీవితంలో ప్రేమానుబంధాలకు దూరమైనవారు ఒత్తిడి తగ్గించుకునేందుకు వేరొకర్ని ఆశ్రయిస్తున్నారు. జీవితభాగస్వామి కంటే ఎక్కువగా తమను ప్రేమించేవారున్నారనే ప్రేమ, నమ్మకం పెంచుకుంటున్నారు. డబ్బు లేదా ఇతర అవసరాల కోసం కూడా రెండు పడవలపై కాళ్లువేస్తున్నారు.

వివాహేతర సంబంధాలకు కారణాలెన్నో ఉండొచ్చు. కానీ వివాహితులను కబళించేందుకు, ప్రలోభపెట్టేందుకు మన చుట్టూ ఎందరో పొంచి ఉంటారని మరచిపోకూడదు. విసుగు, సాంత్వన పేరుతో అలాంటి వలలో చిక్కుకోకూడదు. భార్యాభర్తల బంధం పవిత్రమైనది. దాన్ని కాపాడుకునేందుకు జీవితభాగస్వామితో అరమరికలు లేకుండా ప్రవర్తించాలి. ఆ బంధాన్ని కాపాడుకోవాలి. అలాంటి విషయాలు కొన్నింటిని ఇక్కడ చదవండి!

### కోపంతో ఆరంభం

కొన్ని సంబంధాలు కేవలం కోపంతో ప్రారంభమవుతాయి. భార్య లేదా భర్త తమతో సరిగ్గా గడపడంలేదనో లేకపోతే ఎప్పుడూ గొడవపడుతుందనో, తాము చెప్పినట్లు వినట్లేదనో బుద్ధి చెప్పి ఏడిపిద్దాం అనో వివాహేతర బంధాలు ప్రారంభించేవారు లేకపోలేదు. ఇలా కూడా ఉంటారా! అనుకోకండి. ఇటీవల ఇలాంటివారి శాతం పెరిగిందని రిలేషన్‌షిప్ నిపుణులు హెచ్చరిస్తున్నారు. అలాంటి భాగస్వామిపై మరి కొందరు కోపంతో, వారూ అలాంటి బంధాల్నే ఆశ్రయిస్తుంటారు. ఇలాంటి రిలేషన్‌షిప్స్‌లో ప్రస్తుత బంధంలో తమకున్న ఒత్తిడి, సమస్యలను ఎదుటివారితో పంచుకోవడానికి మాత్రమే ఆసక్తి చూపిస్తుంటారు. దంపతుల మధ్య గొడవలుతప్ప వీటివల్ల ఒరిగేదేమీ ఉండదు.

'తనకోపమె తన శత్రువు' అన్నట్లు, కోపంతో పంతానికిపోతే జీవితాన్నే నాశనం చేసుకున్నవారవుతారు. వివాహబంధంలో నిరాశ కొనితెచ్చుకున్నవారవుతారు. కాబట్టి ఇలాంటి మానసిక సాంత్వనకోసం బంధాలు ప్రారంభించే బదులు, కోపంగా ఉన్నసమయంలో భాగస్వాములు మౌనం వహించడం, సమస్యను కూలంకషంగా చర్చించుకుని కలిసి పరిష్కరించుకోవడం మంచిది.



### మానసిక బంధాలు

వివాహ బంధంపై అసంతృప్తితో మానసిక సాంత్వన పొందడానికి కొనసాగించే బంధాల్లో సాధారణ దంపతుల తరహాలో శృంగారానికి ఆస్కారం ఉండదు. కానీ మానసికంగా ఒకరిపై ఒకరు పూర్తిగా ఆధారపడతారు. అందుకే దీన్ని మనసుకు సంబంధించిన బంధంగా పేర్కొంటారు పరిశీలకులు. ఇలాంటి రిలేషన్‌షిప్‌లో అడుగుపెట్టినవారు శారీరక సంబంధం కొనసాగించకపోయినా, శృంగార విషయాలతోపాటు, వ్యక్తిగత విష

యాల గురించి చర్చించుకోవడం వంటివి చేస్తుంటారు. ఒకరి గురించి మరొకరు ఎక్కువగా ఆలోచించడం ఈ బంధంలోనూ కనిపిస్తుంది. ఇలాంటి బంధాల్ని మొగ్గలో తుంచేయడం మంచిది. ఎందుకంటే ఇతరులపై మరీ ఎక్కువ ఆధార పడటం వల్ల జీవితానికి మంచికన్నా ఎక్కువ చెడే జరుగుతుందని గుర్తుంచుకోవాలి.

మానసికంగా మరీ ఎక్కువకాలం వివాహేతర వ్యక్తులపై ఆధారపడిన తర్వాత వారిని మర్చిపోవడం, వదిలిపెట్టడం కష్టంగా మారుతుంది. అందుకే మానసికంగా ఆధారపడడం కన్నా మిమ్మల్ని మీరు మోటివేట్ చేసుకోవాలి. అందుకోసం మంచి పుస్తకాలు చదవడం, భాగస్వామితో ఎక్కువగా కలిసి ఉండడం, అనుబంధం పెంచుకోవడం వంటివాటిపై దృష్టిపెట్టాలి. ఇలాంటి బంధాలు ఒకవేళ ఏర్పడ్డా వాటికి ఎంత దూరమైతే అంత మంచిది.

### కోరికల కోసమే

కొంతమంది జీవితాల్లో కోరికలు నెరవేర్చుకోవడం కోసమే వేరే వ్యక్తితో సంబంధం ఏర్పరుచుకుంటారు. అలా కేవలం కోరికలకే పరిమితమయ్యే బంధాలు కూడా కొన్ని ఉంటాయి. ఇలాంటి వారు, తమ కోరికలు నెరవేర్చుకునే వరకు వివాహేతర వ్యక్తిని విడిచిపెట్టరు. తమ కోరికలు నెరవేరేవరకు ఆ ఆలోచన ఏమాత్రం వారికి రాదు. ఒకవేళ విడిచిపెట్టినా తిరిగి ప్రారంభించనూ వచ్చు. అయితే కేవలం వారికి మాత్రమే కట్టుబడి ఉండకపోవచ్చు. ఇలాంటి బంధాలు ఎక్కువకాలం నిలబడవు. 'భాగస్వామితో చక్కటి జీవితం గడుపుతున్నాం' అన్న ఆలోచన వచ్చినప్పుడే కనువిప్పు కలుగుతుంది. ఇక అప్పటినుండీ ఇలాంటి బంధాలకు దూరంగా ఉండడం ప్రారంభిస్తారు కొందరు. మరికొందరైతే, ఎదుటివారు క్లోజ్‌గా మాట్లాడితే చాలు, మనతో గడపడమంటే వారికి ఇష్టమనీ, తామిద్దరం ప్రేమలో ఉన్నామనీ భావిస్తుంటారు. వీరికోసం అవతలివ్యక్తి తన భాగస్వామిని కూడా వదిలి వచ్చేస్తారని ఊహించుకుంటారు. కానీ ఇలా మధ్యలో బంధాలు మధ్యలోనే పోతాయి. దీనివల్ల చివరకు నిరాశే మిగులుతుంది. అంతేకాదు ఇలాంటిపనులు చేస్తున్నట్టు జీవితభాగస్వామికి తెలిస్తే, సదభిప్రాయం పోతుంది. వివాహబంధానికి ముప్పు వాటిల్లుతుంది. కాబట్టి ఇలాంటి బంధాలు ప్రారంభించడంకంటే వివాహబంధంతో ఒక్కటైన భాగస్వామితో మనసువిప్పి మాట్లాడుకోవాలి. నిపుణుల్ని కలిసి చికిత్స తీసుకోవాలి. అలాంటి ఆలోచనలు మదిలోకి రాకుండా జాగ్రత్త పడడం మంచిది.

### రహస్య స్నేహితుడితో రచ్చే!

వివాహేతర సంబంధంలో మరొక తరహా వ్యక్తులు ఉంటారు. వారిద్దరూ నిజజీవితంలో భార్యాభర్తల్లా ఒకరిపై ఒకరు మానసికంగా ఆధారపడతారు. శారీరకంగా ఏకమవుతారు. ఒకరిని విడిచి ఒకరుండలేరు. తన జీవితభాగస్వామికన్నా వివాహేతర వ్యక్తితో ఉన్నప్పుడే ఎక్కువ ఆనందం పొందుతూవుంటారు. అంతేకాదు, ఆ సాంగత్యంలోనే ఆనందం వెతుక్కుంటారు. అలాగే ఎప్పుడూ వాళ్లతోనే సమయం గడపాలనిపిస్తుంది. ఆ ఆలోచనలతో అసలైన జీవితభాగస్వామికి ఎక్కువ సమయం కేటాయించరు.

ఇలాంటి బంధాలు తీవ్ర సందేహాలకు, భాగస్వామిలో హింసాత్మక ఆలోచనలకు దారితీస్తాయి. చివరకు అన్ని విధాలా బాధే మిగులుతుంది. అందుకే ఇలాంటి బంధాల్ని తొలిదశలో గుర్తించి జీవితభాగస్వామితో మాట్లాడి, మానసిక వైద్యుల్ని సంప్రదించి తగిన జాగ్రత్తలు తీసుకోవాలి. దీనివల్ల ఇలాంటి బంధాలకు దూరంగా ఉండడమేకాదు, వైవాహిక జీవితాన్ని, ఆ అనుబంధాన్ని అరమరికల్లేకుండా ఆస్వాదించవచ్చు.

## దూర ప్రయాణాలే గొడవలకు కారణం!

*ఇంటికి, ఆఫీసుకి మధ్య దూరం ఎక్కువగా ఉండి ఇల్లు చేరేందుకు ఎంత లేదన్నా కనీసం ఒక గంట సమయం పడుతుంటే మీరు జాగ్రత్త పడాల్సిందే. ఎందుకంటే ఈ ఆలస్యమే కొత్తగా పెళ్ళయిన భార్యాభర్తల మధ్య దూరం పెంచుతుందట. దూర ప్రయాణాలు గొడవలకి ప్లాట్‌ఫామ్‌గా మారుతున్నాయంటున్నారు లండన్ పరిశోధకులు. వినడానికి సిల్లీగానే ఉన్నా ఈ చిన్న కారణంవల్ల బంధాలు, బంధుత్వాలు తెంచుకుని ఒంటరిగానైనా బతికేందుకు సాహసిస్తున్నారు. ఇలా ఆలస్యంగా ఇంటికిరావడం వల్ల ఒకరినొకరు తిట్టుకుని అందమైన జీవితాన్ని దూరం పేరుతో ఇంకా దూరం చేసుకుంటున్నారట! అందువల్ల ఈ బాధలన్నింటికన్నా ఆఫీసుకు ఇల్లు దగ్గరగా తీసుకుంటే సరిపోతుంది కదా!*



### భాగస్వామి బాధల్లో పరిష్కారానికి సహకరించు

వివాహ జీవితంలో భాగస్వామికి ఏవైనా సమస్యలుంటే వాటి పరిష్కారం వెతకడంలో మీరు సహాయపడాలి. అంతే తప్ప వారిని సూటిపోటి మాటలతో నిందించడం తగదు. మీరు మీ భాగస్వామికి సహాయం చేయడంవల్ల కుటుంబానికే సత్ఫలితాలు చేకూరతాయి. ఫలితంగా జీవితభాగస్వామి ఒత్తిడి తగ్గడమే కాదు, మానసికంగా మీకు మరింత దగ్గరయ్యే అవకాశాలు ఉంటాయి. అలాగే భవిష్యత్తులో ఎలాంటి సమస్యలు వచ్చినా వారితో పంచుకోండి. వారు కూడా తగిన పరిష్కారం సూచించడంతో పాటు వీలైనంత సహాయం అందిస్తారు. ఇలా ఎలాంటి దాపరికాల్లేకుండా పరస్పరం సహకరించుకుంటూ ముందుకెళితే ఇక ఆ జంట మధ్య అరమరికలు అన్న మాటే తొంగి చూడదు.

### అబద్ధం చెప్పకు

వివాహబంధంలో జీవిత భాగస్వామికి అబద్ధాలు అస్సలు చెప్పకూడదు. ఎందుకంటే అన్యోన్యంగా ఉండే దాంపత్యంలో కలతలు రేపేవి అబద్ధాలే. చాలామంది చిన్న చిన్న విషయాల్లో కూడా భాగస్వామికి అబద్ధాలు చెబుతుంటారు. ఇలా మీరూ మీ భాగస్వామికి సరదాగా ఓ చిన్న అబద్ధం చెప్పారనుకోండి అది నిజం కాదని తెలిసినప్పుడు ఇద్దరి మధ్యా దూరం పెరిగిపోతుంది. కాబట్టి సరదాగా అయినా, సీరియస్‌గానైనా దంపతుల మధ్య అబద్ధాలు ఎంత తక్కువగా ఉంటే అంత మంచిది. బంధంలో ఎంత నిజాయితీ ఉంటే ఆ బంధం అంత దృఢంగా ఉంటుంది. లేదంటే ఇబ్బందులు ఎదుర్కోవాల్సి రావచ్చు.

### సెల్ఫ్ మోటివేషన్

ఇష్టంలేని పెళ్ళి చేసుకోవడం, దాంపత్య బంధంలో ఎదురయ్యే సమస్యలు, ఒత్తిళ్లు, ఇతరత్రా ఆకర్షణలు, అవసరాలు వంటి పలు కారణాలవల్ల వివాహేతర సంబంధాలపట్ల కొంతమంది ఆకర్షితులవుతుంటారు.

అయితే ఈ ఆకర్షణలనేవి కేవలం పరిమిత కాలం మాత్రమే ఉంటాయి. అవి తాత్కాలికంగా ప్రశాంతత కలిగించినా భవిష్యత్తులో చేదు అనుభవం మాత్రమే మిగులుస్తాయి. అందుకే బంధాలను పదిలపరచుకోవడానికి ఎప్పుడూ మనల్ని మనం మోటివేట్ చేసుకుంటూ ఉండాలి. బంధాల మధ్యలో వచ్చే ఇతరత్రా సంబంధాలేవీ శాశ్వతం కాదు. చివరికి మిగిలేది, జీవితాంతం ప్రశాంతతను కలిగించేది శాశ్వతమయ్యేది నిజమైన భార్యాభర్తల బంధమే అని గుర్తుంచుకోవడం మంచిది.

**- విజేత**

**గుమ్మడికాయ కొట్టినరోజు శ్రావణి వచ్చిన తర్వాత నా జీవితంలోకి మళ్ళీ వసంతం వచ్చినట్ట యింది. ఆ రోజు అందరూ వెళ్ళిపోయాక ఓ గంటసేపు కూర్చుంది. ఏదో పిచ్చాపాటి మాట్లాడు కున్నాం. ఆ తర్వాత వెళ్ళిపోతూ నాకు షేక్‌హ్యాండ్ ఇచ్చింది.**

**తన రాకతో నాకు వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టయింది. శ్రావణి నాదేనన్న నమ్మకం కలిగింది. రెట్టించిన ఉత్సాహంతో పని చేశాను. వారం రోజులు అనుకున్న ఎడిటింగ్ పనిని ఐదు రోజుల్లోనే పూర్తిచేసేశాం.**

ఎడిటింగ్ పూర్తయి రెండు గంటల పన్నెండు నిమిషాల సినిమా - సుమారు సంవత్సరం శ్రమ, ఎన్నోకలలు కన్న ప్రాజెక్టు చివరకు, ఒక పుస్తక మంత సైజున్న హార్డ్ డిస్క్‌లో నిక్షిప్తమై, నా చేతుల్లోకి వచ్చింది. దాన్ని ముట్టుకుంటే, నా స్వప్నసౌధాన్ని స్పృశించినంత ఉద్వేగం, ఉత్సాహం, ఆవేశం కలిగాయి. ఈ హార్డ్ డిస్క్ నా జీవితాన్ని మలుపుతిప్పే మహత్తర, శక్తిమంతమైన ఆయుధం. హార్డ్ డిస్క్ నుండి డివిడిలు కాపీ చేసి రీరికా ర్డింగ్ కోసం సంగీత దర్శకుడికి, డబ్బింగు కోసం డబ్బింగ్ స్టూడియోకు, కలర్ కరెక్షన్ కోసం డిఐ ల్యాబ్‌కి పంపించాల్సి ఉంటుంది.

ఎడిటర్ గోపి ఆ హార్డ్ డిస్క్ నా చేతుల్లో పెడుతూ, "జాగ్రత్త సార్! మనం ఇంకా బ్యాకప్ కూడా పెట్టుకోలేదు" అన్నాడు.

నేను నవ్వుతూ, "గోపీ! ఇది నా ప్రాణం. నా దగ్గర నుండి ఎక్కడికి పోతుంది? అయినా మన సినిమాను ఎవరు పైరేట్ చేస్తారు?" అన్నాను.

"సార్! నా బాధ్యత కాబట్టి చెప్పాను".

గోపీ అన్నది కూడా నిజమే! కానీ, అది పెద్ద సినిమాల పట్ల చాలా జాగ్రత్తగా ఉంటారు. ఉండాలి కూడా.

అగ్రహీరోల సినిమాల వివరాలు తెలుసుకోవాలని ఫ్యాన్స్ ఉవ్విళ్ళూరు తుంటారు. ఒక చిన్న పోస్టర్, హీరో ఒక చిన్న లుక్ లీకయినా, సోషల్ మీడియాలో పెట్టిన గంటల్లోనే లక్షలకొద్దీ లైకులు, వ్యూస్ వచ్చి పడతాయి.

అందుకే, ఆ మధ్య అత్యంత కట్టుదిట్టమైన జాగ్రత్తలు తీసు కుని తీసిన సినిమా 'అత్తారింటికి దారేది'లోని అరవై డెబ్బై నిమిషాల సినిమా లీకయింది. సినిమాలో సర్ ప్రైజ్ ఎలిమెంట్ లీకయిన తర్వాత, అన్ని కోట్లు పెట్టి తీసిన సినిమా విజయావకాశాలు తక్కువవుతాయని నిర్మాతలు భయపడుతుంటారు. అలాగే నిన్న కాక మొన్న 'బాహుబలి- ది కన్‌క్లూజన్' సినిమాలోని సీన్లు కూడా ఎడిటింగ్ రూము నుండి లీకయ్యాయని వార్తలొచ్చాయి.

అందుకే గోపి తనవంతు కాషన్‌గా ఆ మాటలు చెప్పి హార్డ్‌డిస్క్ నా చేతుల్లో పెట్టాడు.

డబ్బులు ఓ రెండు కోట్లు ఖర్చయి చేతి కొచ్చిన ఆ హార్డ్ డిస్క్‌తో డబ్బు; ఓ వంద మంది శ్రమ; రాం, శ్రావణి, నాదీ భవిష్యత్తు - ముడి పడి ఉన్నాయి.

దాన్ని గుండెలకు హత్తుకుని, ఇంట్లోకి అడుగు పెట్టాను.

అక్కడ కనిపించిన దృశ్యం చూసి నేను నోరు వెళ్ళబెట్టాను.

•••

ఇంట్లోకి అడుగుపెట్టగానే అక్కడ కనిపించిన శ్రావణిని చూసి ఉబ్బితబ్బిబ్బయ్యాను.

నన్ను చూడగానే, శ్రావణి పరుగున వచ్చి కౌగిలించుకుంది.

'దేవ్ వాలే ఛప్పర్ ఫాడ్ కే దేతే' అని ఉర్దూలో ఓ సామెత ఉంది. అంటే, భగవంతుడికి దయ కలిగితే ఆకాశాన్ని బద్దలు కొట్టైనా సరే వరాలు కురిపిస్తాడని అర్థం.

నా జీవితంలో రెండే అంశాలకు ప్రాధాన్యం ఉంది.

ఒకటి సినిమా, రెండోది శ్రావణి.

సినిమా నిర్మాణంలో ముఖ్యమైన ఘట్టం - ఎడిటింగ్ పూర్తి కావడం. అది ఈ రోజుతో పూర్త యింది. ఆ సంతోషానికి సిల్వర్ లైనింగ్ లాగా ఇంట్లోకి అడుగు పెట్టానో లేదో శ్రావణి కని పించింది.

హార్డ్ డిస్కు పక్కన టేబుల్‌మీద పెట్టి శ్రావణి ముఖం చేతుల్లోకి తీసుకుని ముద్దులు కురిపించాను.

శ్రావణి పెదాలు మంచులో ముంచితీసిన రస గుల్లాల్లా మధురంగా, మైమరపించేలా ఉన్నాయి. ఎందుకో ఈరోజే శ్రావణి నన్ను కరుణించింది.

శ్రావణి ఏ మేకప్ లేకున్నా, సహజ సౌంద ర్యంతో వెలిగిపోతుంది. కానీ, ఈ రోజు మాత్రం నన్ను మురిపించడానికి అన్నట్టు అద్భుతంగా అలంకరించుకుంది. కళ్ళు వెన్నెల దీపాల్లా మెరుస్తు న్నాయి. మీనాల్లాంటి కళ్ళను ఇంకా ఐ లైనర్‌తో పొడిగించి, కనురెప్పలపై అందమైన నెమలిని చిత్రించింది. ముద్దు పెట్టుకున్నప్పుడు కళ్ళు మూసుకుంటే, రెండు కనురెప్పలపై రెండు నెమళ్ళు నాట్యమాడుతున్నట్టు కని పించాయి. బుగ్గలమీద సహ జంగా ఉన్న గులాబీ రంగుకు మెరుపులు అద్దింది.






తను వేసుకున్న డ్రెస్‌లో నుండి నున్నటి భుజాలు మెరుస్తున్నాయి. ఆమె మెడ పసిఫిక్ సముద్ర శంఖంలా ఉంది. నీళ్ళు తాగినా కనిపించేంత సౌకుమార్యంగా ఉన్న ఆమె గొంతుపై ముత్యాలదండ మిలమిలలాడుతోంది.

'వీ' షేపు ఎర్రటి ముఖమల్ గౌనులో నుండి పసిడి వర్ణపు వక్షాలు, సవాల్ చేస్తున్నట్టుగా పొడుచుకుని వచ్చాయి. ఆ కాంబినేషన్ ఏమో కానీ, ఎర్రటి రంగు గౌనులో నుండి మరుడి శరాల్లాంటి పచ్చటి బలమైన తొడలు వేడి పుట్టిస్తున్నాయి.

ఓ బంగారు శిల్పాన్ని చేసి దాన్ని వలపు అత్తర్లల్లో ముంచి, అనుభవించమని కానుకగా నా దగ్గరకు పంపినట్టుగా ఉంది శ్రావణి.

అసలు రెండు నెలల క్రితం మా మధ్య ఏం జరగనట్టుగా; అత్యంత సహజంగా, నేలమీద పడిన పాదరసపు గుళికలు, ఒకదాని దగ్గరకు మరొకటి వచ్చినప్పుడు చటుక్కున కలిసిపోయినట్టుగా, మేమిద్దరం ఏకమై పోయాం.

ఆ రాత్రి మా ఇద్దరికీ జాగరణే అయింది.

మనసున నిండివున్న ఆవేదన, ఒంట్లో నిండివున్న ఆవేశం నిష్క్రమించాక, ఆదమరచి నిద్ర పోయాను.

•••

ఉదయం పది గంటలకు డోర్ బెల్ మోగితే నిద్ర లేచాను. పక్కన శ్రావణి లేదు. వెళ్ళిపోయినట్టుందనుకుని తలుపు తీశాను.

ఎదురుగా అభిషేకం గారు.

లోపలికి వచ్చి కూర్చున్నారు. కాసేపు కూర్చున్నాక, "వెళ్తాను సార్!" అన్నాడు.

"వెళ్ళండి!" అన్నాను.

"ఇవ్వండి!"

"ఏమిటి?" అని ప్రశ్నించాను.

"అయ్యో, హార్డ్ డిస్క్ సార్!" అన్నాడు.

"ఓహ్! టేబుల్ మీద ఉంటుంది, చూడండి!" అన్నాను బెడ్‌రూమ్‌లో నుండి స్పెక్ట్స్ తీసుకొని రావడానికి వెళ్తూ.

నేనొచ్చేసరికి ఆయన ఉత్త చేతులతో నిలబడ్డాడు. "లేదు సార్!" అన్నాడు.

"లేకపోవడమేమిటి?" అన్నాను నవ్వుతూ.

ఆయన సరిగ్గా చూడలేదనుకుని నేను లేచి చూశాను. నిజంగానే హార్డ్ డిస్క్ లేదు.

నా గుండె గుభేలుమంది. ఇల్లంతా వెతికాను. ఇంట్లో ఎక్కడా కనబడలేదు.

నాకు గాభరా మొదలైంది. నేనే ఇంట్లోకి తెచ్చి టేబుల్ మీద పెట్టాను.

అభిషేకం గారితో ఆ విషయమే చెప్పాను.

"మరి ఏమవుతుంది సార్? ఎవరైనా వచ్చారా?" అని ప్రశ్నించాడు.

నేను మౌనం వహించాను.

"ఎవరైనా వచ్చారా సార్?" అభిషేకం గారు రెట్టించారు.

శ్రావణి వచ్చింది. కానీ, ఆ విషయం ఎలా చెప్పను? చెప్పిన వెంటనే, అభిషేకం గారు మరో ఆలోచన లేకుండా శ్రావణి మీదనే అభాండం మోపుతారు.

నా మౌనం చూసి, "శ్రావణి వచ్చిందా?" అని అడిగారు, అనుమానంగా చూస్తూ.

"వచ్చిందా? చెప్పండి సార్?" అన్నాడు.

"వస్తే? శ్రావణి వస్తే తనేమైనా తీసుకుపోతుందా? బుద్ధిలేకుండా మాట్లాడకండి!" అని అరిచాను.

అభిషేకం గారు విస్తుపోయారు.

"ఏంటి సార్... అలా ఎలా? హార్డ్ డిస్క్ మీరే తీసుకొచ్చారు. శ్రావణితప్ప ఇంకెవరూ రాలేదని మీరే అంటున్నారు. తెల్లారేసరికి హార్డ్ డిస్క్ లేదు. మాయమైంది. అంటే శ్రావణి కాక ఇంకెవరు తీసుకెళ్తారు?" అని గద్దించారు. నేను డిఫెన్స్‌లో పడడం చూసి ఆయన వాయిస్ పెంచారు.

"దొంగలుపడి ఎత్తుకుపోవచ్చు కదా?" అని అన్నాను. కానీ అది నిజం కాదని నాకే తెలుస్తోంది.

నేను అవమానంతో తలవంచుకున్నాను.

"నిజంగానే శ్రావణి ఇలాంటి పని చేసిందా? అలా చేస్తుందా? నా ప్రాణాలు కావాలని అడిగితే అలవోకగా ఇచ్చేవాణ్ణి కదా? తనకు, తనే నటిం

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడు ఆ తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. రాం హీరోగా, శ్రావణి హీరోయిన్‌గా సినిమా మొదలవుతుంది. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. డైరెక్టర్‌కి తన గతమేమిటో చెప్పి, అతడి నుంచి దూరంగా వెళ్లిపోతుంది శ్రావణి. నవీన్ కూడా తనకో కమిట్‌మెంట్ కావాలని అడిగాడని శ్రావణి చెప్పడంతో, నవీన్‌ను పక్కకు తప్పిస్తాడు డైరెక్టర్. షూటింగ్ పూర్తవడంతో గుమ్మడికాయ కొట్టే కార్యక్రమం పూర్తవుతుంది. దానికి శ్రావణి కూడా హాజరవుతుంది. మొత్తానికి సినిమాను రెండు గంటల పన్నెండు నిమిషాలకు కుదిస్తారు. తాననుకున్న విధంగా సినిమా వచ్చిందని సంతోషపడతాడు డైరెక్టర్. **ఆ తర్వాత.....**



## కవర్‌పేజీకి అంత తీసుకుందా?

బాలీవుడ్ హీరోయిన్లు కవర్‌పేజీల మీదకు ఎక్కడం సర్వసామాన్యం. దాని గురించి పెద్దగా చెప్పుకోనక్కర్లేదు. మిగతా హీరోయిన్లలాగానే అనుష్క శర్మ కూడా ఓ కవర్‌పేజీ మీద తన అందాలన్నీ ప్రదర్శించేసింది. పైపెచ్చు తనకు సంబంధించి కొన్ని ముచ్చట్లు కూడా పంచుకుంది. ఇదంతా బాగానే ఉంది. ఇంత చేసినందుకుగానూ అనుష్క 70 లక్షలు రెమ్యునరేషన్ తీసుకుందట! మామూలుగా అనుష్క ఒక్కో సినిమాకి మూడుకోట్లు తీసుకుంటే కవర్‌పేజీకి అంత పెద్దమొత్తం తీసుకోవడం ఇప్పుడు హాట్ టాపిక్‌గా మారింది తనకున్న డిమాండ్‌ని బట్టి తనకు ఇస్తున్నారే తప్ప తానేమీ వాళ్లని బలవంతపెట్టడం లేదని అంటోంది అనుష్క.

చిన సినిమా హార్డ్ డిస్క్ దొంగిలించాల్సిన అవసరం ఏముంటుంది? అందుకేనా, నన్ను ట్రాప్ చేయడానికేనా, అంతగా అలంకరించుకుని వచ్చింది?" ఆలోచనలతో నా హృదయం రగిలిపోతోంది.

నా జీవితంలో ప్రాధాన్యం ఉన్న రెండు అంశాలు దొరికాయనుకున్న మరునాడే, ఆ రెండింటినీ కోల్పోయాను.

అభిషేకం గారికి అప్పటివరకు నా మీదున్న గౌరవం పోయినట్టుంది.

రూము బయటకు వెళ్ళి, ప్రొడ్యూసరుకు ఫోన్ చేశాడు. ఇంతవరకు సినిమా నిర్మాణంలో ఏ ఒక్కరోజూ సహాయం చేయని ప్రొడ్యూసర్, అప్పుడు మాత్రం ఉరుకులు పరుగుల మీద వచ్చాడు.

ఆయనకేమో డబ్బులు పోతాయేమోనన్న బాధ, నాకేమో సినిమా కెరీర్, శ్రావణితో భవిష్యత్తు పోతాయన్న బాధ!

●●●

ఆ తర్వాత పరిణామాలు చకచకా జరిగిపోయాయి.

ప్రొడ్యూసర్‌గారు పోలీసులకు కంప్లయింట్ ఇచ్చారు. అభిషేకంగారు శ్రావణి మీద అనుమానమున్నట్టు పోలీసులకు చెప్పారు.

●●●

పోలీసులు, షూటింగులో ఉన్న శ్రావణిని అరెస్ట్‌చేసి పోలీస్ స్టేషనుకు తరలించారు.

టాలీవుడ్ భగ్గుమంది.

●●●

పోలీసులు శ్రావణి ఇంట్లో సెర్చ్‌చేస్తే హార్డ్ డిస్క్ దొరికింది.

●●●

నేను ఆఫీసులో వారికి గానీ, పత్రికా విలేకరులకు గానీ ముఖం చూపించలేక, యాదగిరి గుట్టకు పారిపోయాను. ఇంతకుముందు ఒకసారి గడ్డు సమస్యలో చిక్కుకున్నపుడు - మేడం, లక్ష్మీనరసింహస్వామి నన్ను కాపాడారు. ఇప్పుడు మేడం లేదు నన్ను కాపాడడానికి. ఆరోజు మేడం నన్ను యాదగిరిగుట్టకు పొమ్మని చెప్పింది. అందుకే ఈసారి కూడా, ఇక్కడే ఏదో పరిష్కారం దొరుకుతుందని వెళ్ళి, ఆ స్వామినే వేడుకున్నాను, చిత్రంగా 'నన్నూ, నా శ్రావణినీ కాపాడమని'.

నేను ఆ రోజే, ఆ క్షణమే, దేవుణ్ణి చూస్తూ, ఒక నిర్ణయానికి వచ్చాను. ఆ క్షణం నుంచి, జన్మలో పరస్త్రీని, దురుద్దేశంతో కనీసం ముట్టుకోను కూడా ముట్టుకోనని లక్ష్మీనరసింహస్వామి మీద ప్రమాణం చేశాను. శ్రావణి పట్ల నా ప్రేమ, వ్యామోహంగా మారి, శరీరకాంక్షతో రగిలిపోయి, నన్ను నేను మరిచిపోయేంతగా మైకంలో పడడం, నా మీద నాకే అసహ్యం కలగచేసింది. పనిలో పనిగా జీవితంలో మరెప్పుడూ మందు ముట్టనని కూడా ప్రమాణం చేశాను. శ్రావణిని నమ్మి నేను చేసిన ఘోరమైన తప్పిదానికి నాకు నేనే శిక్ష విధించుకున్నాను.

**అదేపనిగా డోర్ బెల్ మోగుతుంటే లేచెళ్లి తలుపు తీశాను. ఎదురుగా అభిషేకంగారు. లోపలికొచ్చి కూర్చొని, సార్! హార్డ్ డిస్క్... అన్నాడు. టేబుల్ మీద ఉంది తీసుకోండి అంటూ టేబుల్ వైపు చూశాను. కానీ టేబుల్‌పై డిస్క్ లేదు. హాలంతా వెదికాను, ఎక్కడా లేదు. ఇంతలో అభిషేకం గారు పోలీసులకు ఫోన్ చేశారు. హార్డ్ డిస్క్ ఏమైంది? ఎవరు తీశారు?**

సినిమారంగంలో రాజ్యమేలుతున్న రెండు వ్యసనాలకు ఆ క్షణం నుండి స్వస్తి పలికాను. మనసు ప్రశాంతంగా ఉంది. జీవితాంతం అనుభవించాల్సిన శిక్షగా అనిపించడం లేదు. జీవితాంతం నన్ను పాపపంకిలం నుండి కాపాడే వరాల్లాగా అనిపించాయి. అయినా ఈ శిక్ష నాకు సరిపోదేమో అనిపించింది.

శ్రావణి హార్డ్ డిస్క్ దొంగతనం చేసిందంటే ఇప్పటికీ నమ్మలేకపోతున్నాను. హార్డ్‌డిస్క్ శ్రావణి ఇంట్లోనే దొరికిందని టీవీలో చెబుతున్నారు.

అర్ధరాత్రి, ఇంటికి చేరుకున్నాను. ఇప్పుడు ఏ పరిస్థితినైనా ఎదుర్కొనే ధైర్యం వచ్చింది.

నాకు దైవబలంతో పాటూ, దేవతాబలం కూడా ఉన్నట్టు కొన్నిక్షణాల్లోనే అవగాహనలోకి వచ్చింది.

మధ్య రాత్రి దాటుతుండగా, ఫోన్ మోగింది.

"హలో!" అన్నాను.

"క్యా డైరెక్టర్ సాబ్!" ఆ గొంతు విని మూర్ఛపోయినంత పనైంది నాకు.

డీసీపీ మేడం అమెరికా నుండి ఫోన్ చేసింది.

"హలో మేడం! బాగున్నారా? ఎన్నాళ్ళకెన్నాళ్ళకు ఈ దీనుడిమీద దయ కలిగింది" అన్నాను విభ్రాంతి నుండి తేరుకుని.

"సినిమా డైలాగులా?" అంది మేడం నవ్వుతూ.

"లేదు మేడం! పొద్దుటినుంచి మీ గురించే, మీరు చేసిన సహాయం గురించే తలచుకుంటున్నాను. అప్పుడు కష్టమొచ్చినప్పుడు మీరు నన్ను యాదగిరిగుట్టకు పంపించారు. ఈరోజు కష్టమొచ్చినప్పుడు మీరు లేరు. అయినా, మీరు చెప్పారని ఊహించుకుని యాదగిరిగుట్టకు వెళ్ళి, ఇప్పుడే ఇంట్లోకి అడుగు పెడుతున్నాను. మీరు ఫోన్ చేశారు. నిజంగా చాలా సంతోషంగా ఉంది మేడం!" అన్నాను.

"ఎక్కడ ఉన్నారు? ఎప్పుడు వస్తున్నారు? ట్రూకాలర్‌లో అమెరికా నంబర్ అని వస్తోంది? దాదాపు నాలుగు నెలలు అయిపోయింది మేడం!" అన్నాను ఎక్సైటింగ్‌గా.

"కూల్ కూల్! బాగున్నాను! అన్ని విషయాలూ తర్వాత చెబుతాను. ముందు నేను చెప్పేది విను. నాకు తెలిసిన డీయస్పీనే, మీ ఇంట్లో జరిగిన దొంగతనం గురించి చెప్పాడు. ఆయనే చూస్తున్నాడు ఆ కేసు. నేను నీ గురించి చెప్పాను. ఇప్పుడు నీ ఫ్లాట్ ముందు ఒక కొరియర్ నిలబడి ఉన్నాడు. నువ్వు తలుపు తీస్తే అతను నీకో కవర్ ఇస్తాడు, తీసుకో. అతను బయటే వెయిట్ చేస్తాడు. నువ్వు అందులో ఉన్న మెటీరియల్ చూడు. అది ఐపీయస్ ఆఫీసర్లకు ట్రైనింగ్ ఇవ్వడం కోసం తయారుచేసిన స్టడీ మెటీరియల్‌లో భాగం. నువ్వు అది కాపీ చేసుకోకూడదు. తర్వాత, మళ్ళీ యాజిటీజ్‌గా సీల్‌చేసి అతనికి ఇవ్వు. అతనికి కూడా అందులో ఏముందో తెలియదు. తర్వాత ఫోన్ చెయ్యి. నాకిక్కడ డే టైమ్. సో డోంట్ వర్రీ!" అంది.

"మేడం! మీకు.."

"అవన్నీ తర్వాత... ముందు ఆ ప్యాకెట్లో ఏముందో చూడు. నీ బుర్ర తిరిగి పోతుంది".

●●●

Part of IPS Training Course Material.
This is very very confidential!'
For your eyes only.
Not to copy. Not to record.

Instructors not to allow the trainees to touch it.

Case No.PHJ/-CYB/362014. Opened on 31/7/2014.

Reconstructed with actors on real locations.

ప్యాకెట్ విప్పగానే ఆ నిబంధనలు కనిపించే సరికి నాకు వణుకు మొదలయింది. ఇన్ని ప్రికాషన్స్ తీసుకుంటున్నారంటే, ఏదో చాలా సీరియస్ నేరానికి సంబంధించిందే అయి ఉంటుంది. అది, మేడం దాన్ని నాకెందుకు పంపించిందోనని ఆదుర్దాగా ఉంది.

దానిపైన ఉన్న సూచనలు అనుసరించి ప్యాకెట్టు విప్పాను. కొన్ని న్యూస్ పేపర్ కటింగ్స్, డీవీడీలు ఉన్నాయి.

నంబర్ 1 అని ఉన్న డీవీడీని, ప్లేయర్లో పెట్టి, ప్లేబటన్ నొక్కాను.

•••

హైదరాబాదు నగరం కళ్ళముందు ప్రత్యక్షమైంది. ఎవరో గొంతు సవరించుకున్నారు.

"ఆరోజు హైదరాబాదు ప్రజలకు ఉదయం మామూలుగా ప్రారంభం కాలేదు. నాలుగు వందల సంవత్సరాల ఘనచరిత్ర కలిగిన హైదరాబాద్ నగరం, సిగ్గుతో తలవంచుకుని ప్రపంచం ముందు దోషిలా నిలబడిన సంఘటన గురించి ప్రజలు పేపర్లలో చదివారు."

ఎవరు మాట్లాడుతున్నారో కానీ గంభీరమైన గొంతు, చక్కటి భాష, భావయుక్తంగా చెపుతున్నారు.

న్యూస్ పేపర్స్ ఇంటర్ కట్‌లో చూపించారు.

## సినీవాలి
## కూపన్ నెం.17 విజేత
## కె.స్వర్ణలత
## బళ్ళారి

అంతకు ముందురోజు..

'హైదరాబాద్ నగరంలో నైజాం నవాబుల విలాసవంతమైన జీవనవిధానానికి ప్రతీకలైన ఫలక్‌నుమా ప్యాలెస్, చౌమహల్లా ప్యాలెస్‌లతో పాటు, నెహ్రూ జూలాజికల్ పార్క్ వంటి మూగ జీవుల స్థావరానికి నిలయం పాత నగరం. ప్రపంచ ప్రసిద్ధ చారిత్రక కట్టడమైన చార్మినార్, ఆధునిక మానవుడి సాంకేతిక నైపుణ్యానికి తార్కాణమైన శంషాబాద్ అంతర్జాతీయ విమానాశ్రయం ఇలా ఇటు మన ఘనచరిత్రకు, అటు ఆధునికతకు సంగమంగా నిలిచింది పాతనగరం. అక్కడికి కూతవేటు దూరంలో షాహీన్ నగర్.'

వీడియోలో ఆ మాటలకు అనుగుణంగా, ఆ దృశ్యాలు కనిపిస్తున్నాయి.

'షాహీన్ నగర్‌లోని ఒక నిర్మానుష్యమైన ప్రాంతం. ఎక్కువగా కొత్త నగరంలోని భాగ్యవంతుల ఫామ్‌హౌసులున్న ఏరియా.

సమయం మధ్యాహ్నం ఒంటి గంటవుతుంది.

అక్కడ, ఒక ఫామ్‌హౌస్‌లో ఒక చిన్నపాటి పెళ్ళిచూపుల కార్యక్రమం జరుగుతోంది.

అక్కడ జరుగుతున్న తతంగాన్నంతా కొన్ని జతల కళ్ళు, కాంపౌండ్ వాల్ బయట నుండి గమనిస్తున్నాయి.

కోట్లకు కోట్ల విలువచేసే నగలు దిగేసుకున్న భాగ్యలక్ష్ములను, లక్షలు విలువ చేసే సూట్లలో దిగబడిన భారీకాయాలను, భూమ్మీద తిరుగాడే విమానాల్లాగే ఉన్న కార్లను చూసేసరికి, తన వేట పసిగట్టిన పాములా, ఆ కళ్ళల్లో దురాశ పొంగింది. కానీ, అక్కడ చాలామంది, తమకంటే ఎక్కువమంది ఉండడంతో, అదనుకోసం వేచి చూసి కాటువేసే కాలనాగులా, తనముందున్న జీవి ఒక్క క్షణం ఆదమరిస్తే గుటుక్కున మింగే కాలసర్పంలా, అస్థిమితంగా ఉన్నా, ఊపిరిసైతం కంట్రోల్డ్‌గా పీలుస్తూ, కబళించే అవకాశం కోసం, కామం నిండిన కళ్ళతో బుసలు కొడ్తూ ఎదురు చూస్తున్నారు.

ఇంతలో, వాళ్ళకళ్ళు మెరిశాయి. కార్లు కదలటంతో, కోట్లు విలువచేసే శ్వేత ఐరావతాల్లా ఉన్న ఐదారు కార్లు ఫామ్‌హౌస్ గేటు దాటి హైదరాబాద్ నగర ట్రాఫిక్కులో అంతర్ధానమైపోయాయి.

అంతవరకు అతిథులతో కళకళలాడిన, వారి ఆటపాటలతో హోరెత్తిన ఫామ్‌హౌస్‌లో నిశ్శబ్దం తాండవించింది. ఒక సౌండ్ సిస్టంలో మాత్రం మంద్రస్థాయిలో వెస్ట్రన్ మ్యూజిక్ వినిపిస్తోంది'.

ఎవరోగానీ, సీనంతా, చాలా బాగా కల్పిత

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -19 (22-2-2017)

మా ప్రశ్న: ఆఫీసులోవారికీ, ప్రతికా విలేకరులకూ ముఖం చూపించలేక, డైరెక్టర్ ఎక్కడికి పారిపోయాడు?

మీ జవాబు-----------------------------------------------------------

చిరునామా-----------------------------------------------------------

--------------------------------------------------------------------

----------------------------------------పిన్-----------------------ఫోన్‌నెం-------------------------

**ఈ కూపన్‌ను 21 ఫిబ్రవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

పాత్రధారులతో, రీ కన్‌స్ట్రక్ట్ చేశారు.

బెడ్రూమ్‌లో బజాజ్ దిండుమీద వాలి 65 ఇంచెస్ టీవీలో బ్లూఫిల్మ్ చూస్తున్నాడు. చేతిలోని మందుగ్లాసులో నుండి విదేశీ మద్యాన్ని మెల్లిగా సిప్ చేస్తున్నాడు.

బెడ్రూం తలుపు తెరుచుకుంది. పద్దెనిమిదేళ్ళ పరువాలతో మిసమిసలాడిపోతున్న సుమన్ పచ్చటి నైట్ గౌన్ వేసుకుని, లోపలికి వచ్చింది.

'ఆవో! మేరీ జాన్!' అంటూ బజాజ్ లేచి కూర్చున్నాడు.

సుమన్ అతనికి దగ్గరగా వచ్చి, అతని చేతిలోని గ్లాసు చూసి 'ఇప్పుడే మొదలుపెట్టావా?' అని అడిగింది.

ఆమె దగ్గరకు రాగానే, గ్లాసు పక్కనపెట్టి, "నువ్వైనా, ఇదైనా ఉంటేనే కదా మజా!" అంటూ ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. అతని చేతులు ఆత్రంగా సుమన్ నైట్‌గౌను గుండీలు తొలగిస్తూనే, ఛాతిమీద తారట్లాడుతున్నాయి. బిగించిన అతని




చేతుల్లో ఆమె ఒళ్ళు నలిగిపోతోంది. ఆ హడావిడికి ఆమె తలలో ఉన్న మల్లెచెండు విచ్చుకుపోయి, పూలన్నీ మంచం మీద పరుచుకున్నాయి. బజాజ్ ఆమెమీదకు వంగి, చెర్రీపళ్ళలాంటి ఆమె పెదాలను అందుకోబోతుండగా, బెడ్రూం తలుపు భళ్ళున తెరుచుకుంది.

'కౌన్ హై రే?' అంటూ బజాజ్ వెనుకకు తిరగగానే, చెంప చెళ్ళుమనే సరికి కళ్ళముందు మెరుపులు మెరిసినట్టయింది. బజాజ్ దిమ్మెరపోయాడు. ఏదో అనబోతుండగానే మరో గుద్దు పొట్టలో పడింది. ఉంగలు చుట్టుకుని కింద పడిపోయాడు.

సుమన్ భయంతో కెవ్వుమని అరిచింది. కిందపడి ఉన్న నైట్‌గౌను అందుకోవడానికి వంగింది. అలా వంగగానే వారిలో ఒకడు ఆమెపై లంఘించి వెనుక నుంచి కౌగలించుకున్నాడు.

కిందపడిన బజాజ్ లేవడానికి ప్రయత్నించాడు. అతనికేం జరిగిందో అర్థం కావటం లేదు.

కళ్ళు తెరచి చూసేసరికి మొరటుగా రౌడీల్లా ఉన్న ఎనిమిది మంది నిలబడి ఉన్నారు. ఒక్కొక్కడూ దున్నపోతులా ఉన్నాడు. అందరి చేతుల్లో హాకీస్టిక్స్, బెత్తాలు ఉన్నాయి. భయంగా చూస్తూ, 'ఏ... ఎవరు మీరు? క్యాహోనా?' అన్నాడు.

వాళ్ళకు లీడర్‌లా ఉన్న ఒకడు ముందుకొచ్చి, చేతిలోని బెత్తంతో, నగ్నంగా ఉన్న బజాజ్ వీపు మీద, బలంగా ఒక్కటిచ్చాడు.

బజాజ్ కెవ్వుమన్నాడు.

'నోర్మూసుకుని జరిగేది చూడు! నోరెత్తితే, సౌండ్‌చేస్తే ముందు నిన్ను సఫా చేసి, తర్వాత దీని సంగతి చూస్తం. ఏమంటవ్?' అన్నాడు బెత్తంతో కొట్టినవాడు.

బజాజ్ భయంగా చూస్తూ తలూపాడు.

'ఛల్, ఫిర్ జాకే కోనే మే బైఠ్!' అని వెకిలిగా, వెర్రిగా నవ్వుతూ 'నీకు ఇప్పుడు సిన్మా చూపిస్తం రా! ఛల్‌ఛల్' అని వాడు అనగానే, బజాజ్ మూలకు వెళ్ళి కూర్చున్నాడు.

సుమన్ అప్పటికే బిక్కచచ్చిపోయింది. ఒంటి మీద, ఒక అండర్‌వేర్ తప్ప నూలుపోగులేదు. అందుకే మంచం చాటున దాక్కుంది.

'ఏ హీరోయిన్! బాహర్ ఆవో, ఇప్పుడు షూటింగ్ ఉంది' అంటూ సుమన్‌ను పిలిచారు.

సుమన్ వణికిపోతూ కూర్చుండిపోయింది. దాంతో వారిలో ఒకడు ఆమెను ఈడ్చుకుంటూ తీసుకొచ్చి రూమ్ మధ్యలో నిలబెట్టాడు. ఇంకొకడు కెమెరా పట్టుకుని, మరో ఇద్దరు సెల్ ఫోన్లలో, అదంతా షూట్ చేస్తున్నారు.

'భయ్యా! పోరిని కొంచెం ముందుకు, లెఫ్ట్‌కు జరిపితే లైట్ జబర్దస్గ ఉంటది' అన్నాడు కెమెరా పట్టుకున్నవాడు.

అదంతా చూసేసరికి సుమన్ షాక్‌కు గురయింది. బజాజ్‌తో ఆ రోజంతా హాయిగా గడుపుదామని అనుకుంటే, ఈ వెధవలంతా రావడం ఆమెను విస్మయానికి గురిచేసింది. బజాజ్‌ను చూసింది. నిస్సహాయంగా మూలకు కూర్చుని జరిగే జుగుప్సాకరమైన తతంగమంతా చూస్తున్నాడు.

'ఇదేమిటి? ఎవడుబడితే వాడు ఇంట్లోకి జొరబడి, తనో వస్తువో లేదా రోడ్డు మీద దొరికిన ప్రాపర్టీనో అన్నట్టు ప్రవర్తించడం ఏమిటి?' ఆమెకు కోపం వచ్చింది.

'ఎవర్రా మీరు? ఏం చేస్తున్నారు? మీకు అక్కా చెల్లెళ్ళు లేరా!' బిగ్గరగా అరిచింది.

దాంతో వారిలో ఒకడు, "ఫైజల్ భాయ్! ఇది బాగా వాగుతోంది. మనమెవరో చెప్పు భయ్!" అన్నాడు.

ఆ ఫైజల్ అనేవాడు ముందుకొచ్చి, సుమన్ ముందు నిలబడి, 'ఛలో బోలో? ఏం కావాలి నీకు?' అన్నాడు.

"ఎవరు మీరు? నన్నెందుకు ఇలా చేస్తున్నారు. నన్నొదిలిపెట్టు. లేకుంటే, పోలీసులను పిలుస్తా!" అని అరిచింది.

ఫైజల్ అనేవాడు, "నిజమేరోయ్! దీనికి కండకావరం బాగా ఉంది. దీనికి మనమెవరమో చెప్పాల్సిందే!" అని చేతిలో సంచిని ఓపెన్ చేశాడు.

అందులోంచి బయటకు తీస్తున్నదాన్ని చూసి, సుమన్ కెవ్వుమని అరిచింది.

ఫైజల్ దాన్ని ప్రేమగా నిమిరాడు.

సంచిలో నుంచి బయటకు రాగానే, ఆరడుగులు ఉన్న ఆ పాము ఒక్కసారిగా ఊపిరి పీల్చుకున్నట్టుగా చెంగుచెంగున అటూ ఇటూ ఊగసాగింది. ఫైజల్ దాన్ని ప్రేమగా ముద్దు పెట్టుకుని, చటుక్కున సుమన్ మెడలో వేశాడు.

సుమన్ 'వామ్మో!' అంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరిచింది.

ఒంటిమీద పాము జరజరా పాకుతుంటే, ఒళ్ళు గగుర్పొడుస్తుండగా, అసహ్యంతో, సుమన్ రామంతా ఎగురుతూ ఏడ్వసాగింది.

ఫైజల్ పామును తీసి చేతిలో పట్టుకున్నాడు.

"ఇప్పుడు చెప్పు! మేమెవరో తెలుసుకుని పోలీసులకు చెబుతావా?" అని సుమన్‌ని అడిగి కెమెరా పట్టుకున్నవాణ్ణి, "అరేయ్! వీడియో బాగా వస్తుందా?" అని అడిగాడు.

'హా భయ్యా!' అన్నాడు వాడు.

"ఇప్పుడే అసలు షూటింగ్!" అని సుమన్ వైపు తిరిగి కుడిచేతిలో ఉన్న పాముని ఎడమ చేతితో నిమురుతూ "చెప్పినట్టు వింటావా?" అని అడిగాడు.

సుమన్ వణికిపోతూ వింటానన్నట్టుగా తలూపింది.

"ఛలో! అయితే ఆ ఒక్కటి కూడా విప్పేయ్" అన్నాడు.

సుమన్ నిస్సహాయంగా నిలబడింది. బజాజ్ వైపు చూసింది.

ఫైజల్ చేతిలో పాము బుస్సుమంది.

'ఒద్దొద్దు' అంటూ ఒంటిమీదున్న ఆ ఒక్క ఇన్నర్ గార్మెంట్ విప్పేసింది. ఫైజల్ సుమన్‌ను ఆబగాచూస్తూ, ఆమె తన వక్షస్థలాన్ని, ప్రైవేట్ పార్ట్‌ను ఒక్కో చేతిలో కవర్ చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటే, ఒక్కసారిగా పామును ఆమె మెడలో వేశాడు. సుమన్ జుగుప్సగా చూస్తూ రెండు చేతులతో పామును తీసి కింద పడేసింది.

"అరే, మా షూటింగులో ఇది కంపల్సరీగా ఉండాల్సిన సీను" అంటూ, పూర్తిగా నగ్నంగా నిలబడ్డ సుమన్‌ను మంచం మీదికి నడిపించుకుపోయాడు.

***(ఇంకా వుంది)***



# పాలసీసాల్లో విషం?

వినడానికి ఇది కొద్దిగా వింతగా ఉన్నా ఇది నిజం అంటున్నారు పరిశోధకులు. పాల సీసాల్లో ఉండే బిపిఎస్ అంటే బిస్‌ఫినాల్ (Bisphenol) అనే పదార్థం శరీరంలోకి చేరి పిల్లల ఆరోగ్యం మీద తీవ్ర ప్రభావం చూపుతుందన్న విషయం ఇటీవలి పరిశోధనలో వెల్లడైంది. ప్లాస్టిక్ సీసాతో పాలు తాగిన పిల్లల్లో పెద్దయిన తరువాత ఆస్తమా, సంతానలేమి, డయాబెటిస్ వంటి ఆరోగ్య సమస్యలు తలెత్తే ప్రమాదం ఉందని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. వీరు కొన్ని కోతుల మీద పరిశోధనలు నిర్వహించారు. వీటి శరీరంలోకి బిపిఎస్ రసాయనం పంపి అనంతరం వాటిని పరిశీలించారు. తల్లి కోతుల్లో విపరీతమైన మార్పు వీరు గమనించారు. తల్లి కోతుల్లో ఉండే ఈస్ట్రోజన్ హార్మోను మీద ఈ రసాయనం ప్రతికూల ప్రభావాన్ని చూపడం వీరి దృష్టికి వచ్చింది. ఆరోగ్యంగా ఉండే తల్లి కోతి పలు అనారోగ్య సమస్యలకు గురికాగా, తన పిల్లలను పట్టించుకోకపోవడం, వాటి మీదే తిరగబడడం వంటి లక్షణాలు గుర్తించారు. ఇదంతా ఈ బిపిఎస్ రసాయన ఫలితమేనని వారు స్పష్టం చేస్తు న్నారు. ప్లాస్టిక్ సీసాలతో పిల్లలకి పాలు పడితే పై ప్రమాదాలు తప్పకపోవచ్చని హెచ్చరిస్తున్నారు. తల్లులు తమ పిల్లలకు పాలు పట్టవలసివస్తే గాజు లేదా స్టీలు సీసాలో పట్టడం ఉత్తమమని సూచిస్తున్నారు. ప్లాస్టిక్ బాటిల్స్‌తో పాలు పట్టడం వలన అప్పటికప్పుడు వచ్చే నష్టమేమీ లేకపోయినా ఆ పిల్లలు పెరిగి పెద్దయిన తరువాత అనారోగ్యానికి గురయ్యే ప్రమాదం ఉందని చెబుతున్నారు.






# ఫేస్‌బుక్‌తో కుంగుబాటు?

ఫేస్‌బుక్ చూసే వారి సంఖ్య రోజురోజుకీ ఎక్కువ అవుతోందే తప్ప తగ్గడం లేదు. ఇక వాట్సప్, ట్విటర్ వంటి ఏడు మాధ్యమాల్లో పాల్గొనే వారిలో యువత ఎక్కువగా ఉంటున్నారని అంటున్నారు పరిశోధకులు. ఈ మాధ్యమాలు యువకుల్లో ఉత్సాహం, ఆనందంకన్నా కుంగుబాటునే ఎక్కువగా కలిగిస్తున్నాయన్న విషయం పిట్స్‌బర్గ్ యూనివర్సిటీ పరిశోధకులు నిర్వహించిన అధ్యయనంలో వెల్లడైంది. సుమారు రెండు వేల మంది మీద వీరు అధ్యయనం నిర్వహించారు. వీరిలో చాలామంది రెండు లేదా అంతకంటే ఎక్కువ మాధ్యమాలు అనుసరిస్తున్న వారే. మాధ్యమాల జోలికి పోని వారిలో కన్నా వీరిలోనే కుంగుబాటు ఎక్కువ అన్నది పరిశోధకులు గుర్తించారు. దీనికి కారణం వీరు అనుసరిస్తున్న మీడియా మాధ్యమాలా? లేక మరేదైనా కారణం ఉందా? అనే అంశంపై అధ్యయనం నిర్వహించనున్నారు. మాధ్యమాల్లో నిజాల కన్నా గొప్పలు ఎక్కువగా ఉండడం, వాటిని తాము అందుకోలేకపోయామన్న బాధతో కుంగుబాటుకి గురవుతూ ఉండవచ్చని పరిశోధకులు అంచనా వేస్తున్నారు.

ట్విటర్, ఫేస్‌బుక్ ఫాలో కావడం తప్పు కాదు కానీ, అందులో అన్నీ నిజమని నమ్మడం అంత మంచిది కాదనీ వీరు సూచిస్తున్నారు.

# పిల్లలకు మేలు చేసే చెడు అలవాట్లు

చిన్న పిల్లలు సాధారణంగా నోట్లో వేలు వేసుకుంటూ ఉంటారు. ఇది చెడ్డ అలవాటని తల్లులు దాన్ని మానిపించడానికి ప్రయత్నిస్తూ ఉంటారు.



ఇదంతా సహజమే! అయితే ఈ అలవాటే పిల్లలు పెద్దయిన తరువాత వారికి శ్రీరామరక్షగా నిలుస్తుంది అంటున్నారు కెనడా యూనివర్సిటీ పరిశోధకులు. నోట్లో వేలు వేసుకోవడం నిజానికి చాలా చెడ్డ అలవాటే అయినా, కొన్నిరకాల ఇన్‌ఫెక్షన్లను తట్టుకునే శక్తి దీనివల్ల పిల్లలకు వస్తుందని వారు చెబుతున్నారు. ఎలాగంటే పిల్లలు నోట్లో వేలు పెట్టుకోవడం ద్వారా క్రిములు కొద్ది కొద్దిగా శరీరంలో చేరతాయని, సహజంగా శరీరంలో ఉండే రోగనిరోధకశక్తి వాటిని సమర్థవంతంగా ఎదుర్కొంటుందనీ, ఈ క్రిములు ఎక్కువైనా పెరిగే రోగనిరోధకశక్తి వాటిని నిరోధిస్తుందని అంటున్నారు. క్రిములు శరీరంలోకి చేరినా వాటిని తట్టుకుని ఆరోగ్యంగా ఉండే పిల్లలు పెద్దయిన తరువాత ఎలాంటి ఆరోగ్యసమస్యనైనా సమర్థవంతంగా ఎదుర్కొగలరని వీరు చెబుతున్నారు. పిల్లల్ని నోట్లో వేలు వేసుకోమని చెప్పడం తమ అభిప్రాయం కాకపోయినా, ఆ అలవాటు మంచే చేస్తుందని చెప్పడమే తమ అభిమతమని వారు స్పష్టం చేస్తున్నారు.

# గోళ్ల రంగుతో అధిక బరువు

ఇది అమ్మాయిలను నిరాశపరిచేదే అయినా వాస్తవమని చెబుతున్నారు డ్యూక్ యూనివర్సిటీ పరిశోధకులు. గోళ్లరంగు తయారీలో ఉపయోగించే ట్రైఫినైల్ ఫాస్ఫేట్ అనే పదార్థం హార్మోన్ల మీద తీవ్ర ప్రభావం చూపి అధికబరువుకు కారణం అవుతుందని వారు అంటున్నారు. నెయిల్ పాలిష్‌ను పశువుల మీద పరీక్షించగా సంతానోత్పత్తి మీద తీవ్ర ప్రభావాన్ని చూపడం గమనించారు. అదే మనుషుల్లో అయితే హార్మోన్లలో సమస్యలు తలెత్తి అధికబరువుకు కారణం అవుతుందనీ, తద్వారా సంతానలేమికి దారితీస్తుందనీ చెబుతున్నారు. గోళ్లరంగు వేసుకున్న పది నుంచి పద్నాలుగు గంటల తరువాత దాని ప్రభావం మొదలవుతుందని అంటున్నారు. గోళ్లను నోట్లో పెట్టుకోవడం, అవి వేసుకున్న చేతితో ఆహారం తీసుకోవడం వంటి వాటి ద్వారా ఈ రంగూ, దానిలో ఉన్న ట్రైఫినైల్ ఫాస్ఫేట్ శరీరంలోకి చేరతాయి. కృత్రిమ గోళ్లు పెట్టుకుని వాటికి రంగు వేసుకున్న వారి శరీరంలో పై పదార్థం చేరకపోవడం పరిశీలకుల దృష్టికి వచ్చింది. తరచూ గోళ్లకు రంగు వేసుకోకూడదనీ, ఒకవేళ తప్పనిసరైతే వేసుకున్నా వాటిని నోట్లో పెట్టుకోకుండా సాధ్యమైనంత వరకూ స్పూను, ఫోర్క్ వంటి వాటిని ఉపయోగించి ఆహారం తీసుకుంటే మంచిదని వారు సూచిస్తున్నారు.



-అవినాష్




# దారం ముక్కలు

**'డిటెక్టివ్ శరత్ ఊళ్లోలేడు, ఇప్పుడెలా?' అసిస్టెంట్ రాముతో అంది సెక్రటరీ సుధ.**

**'ఏమైంది?' అడిగాడు రాము.**

**'ఓ కవర్ వచ్చింది. పైన 'ఫర్ యువర్ ఐస్ ఓన్లీ' అని రాసి ఉంది. 'ఎలా?' అంది సుధ.**

'ఏదీ ఇటివ్వు, నేను చూస్తాను. డిటెక్టివ్ లేనప్పుడు అసిస్టెంటే డిటెక్టివ్' అంటూ ఆమె చేతిలోంచి కవర్ లాక్కున్నాడు. విప్పిచూశాడు. లోపల మడచిన ఓ తెల్లకాగితం ఉంది. మడత విప్పాడు. దాన్లో ముడివేసిన రెండు దారం ముక్కలున్నాయి. 'పుస్తకాల నడుమ ఆధారం ఉంది' అని తెల్లకాగితం పైన రాసి ఉంది. రాముకు అర్థం కాలేదు.

'బాస్ ఎప్పుడు వస్తాడు?'

'మారువేషంలో పరిశోధనకు వెళ్ళారు. తనే ఫోన్ చేస్తానన్నారు'

తెల్లకాగితంలో ఆ వాక్యంవైపు, ముడివేసిన దారం ముక్కలవైపు చూస్తూ కూచున్నాడు రాము.

●●●

'మళ్లీ వచ్చింది కవర్' రాముకి ఇచ్చింది సుధ.

కవర్ తెరిచాడు రాము. మళ్లీ అదే వాక్యం. అదే దారం ముడి!

'పుస్తకాల నడుమ ఆధారం ఉంది' అన్న వాక్యం కింద, ఓడిపోతున్నావు' అని కొత్తగా రాసి ఉంది.

'ఏమిటిది?' స్వగతంగా పైకే అని, కాస్సేపు ఆలోచించి ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఫోను చేశాడు.

'దిసీజ్ ఇన్‌స్పెక్టర్ ఇంద్రజిత్. ఎవరు మాట్లాడేది?' గంభీర స్వరం ధ్వనించింది.

'ఇన్‌స్పెక్టర్ విజయ్...?' అన్నాడు రాము.

'లాంగ్‌లీవ్. అతనిస్థానంలో నేను వచ్చాను. మీరెవరు?'.

'డిటెక్టివ్ శరత్‌కి అసిస్టెంట్‌ని, రామూని. నాకు గమ్మత్తైన వార్నింగులొస్తున్నాయి. మీతో మాట్లాడాలి'.

'రండి'.

●●●

రెండు ఉత్తరాలను, దారం ముడుల్ని కనుబొమలు ముడిచి చూశాడు ఇంద్రజిత్.

'వీటిమీద వేలిముద్రల కోసం చూశాను. లేవు. పంపినవారి అడ్రస్ ఏమీలేదు. చేతి రాత ఆధారంగా తెలుస్తుందేమోనని చూశాను. తెలియటం లేదు' చెప్పాడు రాము.

'మొదటి లెటర్ రాగానే ఎందుకు చెప్పలేదు?' గద్దించినట్టే అడిగాడు ఇంద్రజిత్.

'ఆకతాయి పనేమో అనుకున్నా. రెండవది వచ్చేసరికి అనుమానం వచ్చింది'.

ఇంద్రజిత్ ఏవో ఫైల్స్ తీసిచూశాడు. మళ్ళీ పక్కన పెట్టేశాడు. చివరికి ఓ ఫైలు తీసి చదివి మౌనంగా రామువైపు తోశాడు.

మిస్సింగ్ పర్సన్స్ ఫైలు.. 'దాన్లో ఇద్దరు అమ్మాయిల ఫొటోలపై వేలుపెట్టి, 'నీకు మొదటి కవర్ అందినప్పుడు వీళ్ళల్లో ఒక అమ్మాయి మిస్సయింది. రెండోకవర్ వచ్చినప్పుడు రెండో అమ్మాయి మిస్సింగ్. మొదటి అమ్మాయి శవం నిన్న దొరికింది. మెడచుట్టూ ఈ ముడివేసిన తాడుతో నొక్కిచంపాడు. అత్యాచారం చేయలేదు'.

'అంటే... ఈ ఉత్తరానికి, అమ్మాయిల అదృశ్యానికి సంబంధం ఉందా?'

'సంబంధం ఉండటమేకాదు, డిటెక్టివ్ శరత్‌ని ఛాలెంజ్ చేయటానికి ఎవరో చేస్తున్నారని నా అనుమానం. రెండో శవం దొరకాలి. మూడోఉత్తరం రావాలి' అన్నాడు ఇంద్రజిత్.

'జాడ తెలియకుండా పోయినవాళ్ళపై పరిశోధన చేస్తాను. వీడెవడో సీరియల్ కిడ్నాపర్ కమ్ కిల్లర్‌లా ఉన్నాడు. ఆ ఆడపిల్లలకీ, వీడికీ ఏదో కామన్‌ఫ్యాక్టర్ ఉండివుంటుంది, అది తెలిస్తే దొంగ దొరికినట్టే' అన్నాడు రాము.

ఇంతలో ఇంద్రజిత్ ఫోను, రాము ఫోను ఒకేసారి మోగాయి.

ఫోన్లో మాట్లాడి ఇద్దరూ ఒకరివైపొకరు చూసుకున్నారు.

'రెండో శవం దొరికింది' అన్నాడు ఇంద్రజిత్.

'మూడో ఉత్తరం వచ్చింది' అన్నాడు రాము.

●●●

'ఇప్పటివరకు శ్యామల, అనురాధ, రమణి అనే ముగ్గురు అమ్మాయిలు కిడ్నాపయ్యారు. రెండు హత్యలు జరిగాయి. డిగ్రీ స్టూడెంట్స్. వేర్వేరు కాలేజీలు. ముగ్గురి ఒకరికొకరు అపరిచితులే. కనీసం ముగ్గురు ఆకారాల్లోనూ పోలికలేదు. ఎక్కడో హత్యచేసి, వేరేచోట పారేస్తున్నాడు హంతకుడు. శవాలు చెత్తకుండీల్లో దొరుకుతున్నాయి. మెడచుట్టూ మాత్రం ముడివేసిన దారంతప్ప శరీరాలపై గాయాలులేవు. అత్యాచారం చేయడం లేదు. వాడు ఎలా ఎత్తుకుపోతున్నాడో! ఆధారాలు లేకుండా పర్‌ఫెక్ట్ క్రైమ్ చేస్తున్నాడు?'

సేకరించిన సమాచారం ఎదురుగా పెట్టుకుని ఆలోచిస్తున్నాడు రాము. ఇంతలో 'మరో శవం దొరికింది'ని ఫోన్.

మరో కవర్‌తో సుధ లోపలికొచ్చింది.

●●●

'శ్యామల, అనురాధ, రమణి, ఆనంద్, దేవి...' ఇప్పటికి ఐదుగురు కిడ్నాపయ్యారు. నలుగురిని ఒకేరకంగా చంపేశాడు. రెండ్రోజులు గ్యాప్ ఇచ్చి చంపుతున్నాడు. అంటే వాణ్ణి పట్టుకునేందుకు మనకే టైమిస్తున్నాడన్నమాట! కొరియర్ కూడా వేర్వేరుచోట్ల నుంచి చేస్తున్నాడు. కంపెనీ మారుస్తున్నాడు. ఎలా?' ఆలోచిస్తూ అన్నాడు రాము.

'బాధ్యతలు చేపట్టగానే ఇలాంటి కేసు రావటం నా దురదృష్టం. మీడియా గోల పెట్టేస్తోంది' ఇంద్రజిత్ అన్నాడు.

'ఎక్కడా ఆధారం దొరకట్లేదు. ఇంట్లో కారణం చెప్పి వెళ్ళి కిడ్నాపవుతున్న అమ్మాయిలు అనుకున్న చోటకు అంటే లైబ్రరీలు, ఫ్రెండ్స్ ఇళ్ళకు చేరుకోవడంలేదు. ఎలా కిడ్నాపులు చేస్తున్నాడు వీడు, ఎవరూ చూడకుండా? మిస్సైన ఇద్దరిలో లైబ్రరీ కామన్ ఫాక్టర్‌గా ఉంది. కానీ ఏమీ తేలటం లేదు'.

'మరో శవం దొరికి, మరో కవర్ వచ్చేలోపు వాణ్ణి పట్టుకోవాలి. ప్రతి కవర్‌లోనూ వాడు వెక్కిరిస్తున్నాడు' కోపంగా అన్నాడు ఇంద్రజిత్.

ఇంతలో ఫోన్ మోగింది. భయంగా మొహాలు చూసుకున్నారు. ఫోనెత్తాడు రాము. ఆవైపు డిటెక్టివ్ శరత్! 'బాస్.. నువ్వు అర్జంటుగా రావాలి. కఠినమైన కేసు ఎదురుచూస్తోంది' హడావిడిగా చెప్పాడు రాము. ఫోను పెట్టేసి సంతోషంగా అరిచాడు' శరత్ వస్తున్నాడోచ్' అని.

●●●

కేసు వివరాలు చదివాడు శరత్.

"రామూ... విద్యార్థులు ఎక్కువగావెళ్ళే లైబ్రరీల దగ్గర ఈ అమ్మాయిల ఫొటోలు చూపించి వివరాలు కనుక్కో. లైబ్రరీలో వాళ్ళకి మెంబర్‌షిప్ ఉందేమో కనుక్కో'.

**ఇప్పటివరకు అయిదుగురు అమ్మాయిలు కిడ్నాపయ్యారు. వారిలో నలుగురు ఒకేరకంగా హత్యకు గురయ్యారు. డిటెక్టివ్ శరత్‌ని సవాలు చేస్తున్నాడు కిడ్నాపర్. కిడ్నాప్‌కి ముందు ఒక లెటర్, హత్యకు ముందు ఒక లెటర్ రాస్తున్నాడు శరత్‌కి. ఉత్తరంలో రెండు దారం ముక్కలుంటున్నాయి. అసిస్టెంట్ రామూ ఒక్కడే ఉన్నాడు. శరత్ ఊళ్ళోలేడు. ఏం చెయ్యాలో అంతుబట్టడంలేదు రామూకి. మరి హంతకుడు పట్టుబడ్డాడా?**

'యెస్ బాస్' లేచాడు రాము.

'బాస్...!' అంటూ సుధ కవర్ తెచ్చిచ్చింది.

'తెరచి చదివాడు. ఇది చివరిది... నువ్వు ఓడి పోతున్నావు' అని రాసివుంది.

ఇంద్రజిత్ చేతికిచ్చాడు కవర్.

'ఇప్పటికి ఆరుగుర్ని కిడ్నాప్ చేశాడు. ఇది చివరిదంటున్నాడు' అంటూ అమ్మాయిల పేర్లు వరుసగా రాశాడు శరత్.

శ్యామల, అనురాధ, రమణి, ఆనంద, దేవి, అమల... ఆ పేర్లు చూస్తున్న శరత్ కళ్లు చిన్నవయ్యాయి. అన్ని పేర్ల మొదటి ఆంగ్ల అక్షరాలు ఒకచోట రాశాడు. sarada...

'ఇప్పుడు చివరి అమ్మాయి పేరు శారద కావాలి' అన్నాడు శరత్.

'కానీ డిగ్రీ స్టూడెంట్స్‌లో ఎందరో శారదలు ఉంటారు. ఈ శారదెవరో ఎలా తెలుస్తుంది?' అన్నాడు ఇంద్రజిత్. అంతలోనే అతడిఫోన్ మోగింది. మాట్లాడాక అతడి ముఖంలో ఆందోళన...' మినిస్టర్‌గారి అమ్మాయి శారద మిస్సింగ్' అన్నాడు.

•••

'అమ్మాయి కాలేజీకి వెళ్ళింది. ఫ్రెండ్స్‌తో లైబ్రరీకి వెళ్తానని కారు డ్రైవర్‌కి చెప్పిందిగానీ వెళ్ళలేదు. ఎటుపోయిందో.. ఫ్రెండ్స్ తెలియదంటున్నారు' కన్నీళ్ళతో చెప్పాడు మంత్రి.

'ఏ లైబ్రరీ?' అడిగాడు శరత్.

'తెలియదు'

'వాడు మనకు పంపే వాక్యం 'పుస్తకాల నడుమ ఆధారం ఉంది'.

నా అనుమానం వాడు ఏదైనా లైబ్రరీలో పని చేస్తున్నాడేమో!' శరత్ అన్నాడు.

రాము ఫోన్ చేశాడు. 'బాస్... డిగ్రీ పిల్లలు వెళ్ళే లైబ్రరీ కనుక్కున్నాను. లైబ్రరీ పేరుతో దగ్గర్లో వున్న సినిమాహాలుకి వెళ్తారు. ఒకవేళ లైబ్రరీకి వెళ్తే మాత్రం పురాతన కాలం నాటి ఆ లైబ్రరీకే వెళ్తారు".

'ఛలో' అన్నాడు శరత్.

•••

కారు లైబ్రరీముందు ఆగుతుండగా 'సామ్' ఎక్కడ? అడిగాడు శరత్.

అర్థం కానట్టు చూశాడు ఇంద్రజిత్.

'కిడ్నాప్ అయిన ఏడుగురి పేర్లు రాయండి. Syamala, Anuradha, Ramani, Ananda, Devi, Amala, Sarada దీన్లో మొదటి పేరులో మొదటి అక్షరం S రెండో పేరు వదిలేయండి. మూడో పేరులో రెండో అక్షరం A, తరువాత రెండు పేర్లు వదిలేయండి. ఆరో పేరులో రెండో అక్షరం M కలిపితే సామ్. మళ్లీ శారదతో 'ఎస్' మొదలవుతుంది.

ఇద్దరూ గబగబా లైబ్రేరియన్ దగ్గరకు వెళ్ళారు.

'మీ లైబ్రరీలో 'సామ్' అనే వారెవరయినా ఉన్నారా?'

'సామ్ ఎవరూ లేరు' చెప్పింది లైబ్రేరియన్.

శరత్, ఇంద్రజిత్ నిరాశతో వెనుతిరుగుతుంటే లైబ్రేరియన్ పక్కనే ఉన్న ఆమె అంది. 'మేడమ్ మన స్వామిని అందరూ 'సామ్' అంటారు కదా!'



గిరుక్కున వెనక్కు తిరిగాడు శరత్.

•••

విద్యార్థుల సెక్షన్‌లోకి వెళ్ళి 'సామ్' ఎక్కడ?' అడిగాడు శరత్.

'కిందకి వెళ్ళాడు. నా రిఫరెన్స్ బుక్ తేవటానికి' చెప్పిందో అమ్మాయి.

కింద అంటే నేలమాళిగ. శరత్ తుపాకీ తీశాడు. ఇంద్రజిత్‌తో కలిసి శబ్దం చేయకుండా భూగృహం లోకి మెట్లు దిగారు.

కింద బోలెడన్ని పుస్తకాల ర్యాక్‌లు ఉన్నాయి. చిన్నలైటు వెలుగుతోంది. భయంకరంగా ఉంది. నిశ్శబ్దం మరీ భయంకరంగా ఉంది. అంతా వెతికి 'లేదు' అన్నట్టు సౌంజ్ఞ చేశాడు ఇంద్రజిత్.

ఏదో అనబోతున్న శరత్ ఆగిపోయాడు. ఎక్కడో చిన్నశబ్దం వినిపించింది.

జాగ్రత్తగా అడుగులేస్తూ వెతకసాగాడు. చూస్తే, గదిచివర చిన్న తలుపు ఉంది.

నిశ్శబ్దంగా తలుపు దగ్గరకు వెళ్ళాడు. శరత్ తలుపు తోయబోతుంటే తలుపు తెరచుకుంది. ఓ నడివయసు వ్యక్తి బైటకు రాబోయి శరత్‌నిచూసి ఆగిపోయాడు. తుపాకీ గురిపెట్టాడు శరత్.

'వెల్‌కమ్ శరత్' అన్నాడు చిరునవ్వుతో.

'నువ్వే గెలిచావ్' అన్నాడు చేతులెత్తి.

వారినిదాటి లోపలకు వెళ్ళాడు ఇంద్రజిత్. లోపల బెదురుచూపులతో చూస్తున్న శారద స్థంభానికి కట్టేసి ఉంది.

•••

'స్వామి మానసికరోగి. తన తెలివిని ఎవరూ గుర్తించటంలేదనీ, అందరిదృష్టీ తనపై పడాలంటే ఏదో నేరం చేయాలనీ నిశ్చయించుకున్నాడు. పుస్తకాల కోసం వచ్చే కాలేజీ అమ్మాయిలపై పడింది అతని దృష్టి. ఒంటరిగా వచ్చేవారిని ఎన్నుకున్నాడు. అయితే, హత్యలు ఎవరికీ తెలియకపోతే మజాలేదని, డిటెక్టివ్ శరత్‌కి ఛాలెంజ్ చేశాడు. కిడ్నాప్‌చేసి భూగృహంలో దాచేవాడు. ఎవరికీ అనుమానం రాలేదు. పుస్తకం వెతకటానికి రమ్మంటే అమ్మాయిలు అమాయకంగా వచ్చేవారు.

మాళిగ గదిలోవున్న కుళ్లిన శవాలు, వాటి డి.ఎన్.ఏలను, మిస్సింగ్ అమ్మాయిల జాబితాతో పోల్చిచూసి పరీక్షలు చేస్తే, వీడు ఎంతమందిని చంపాడో తెలుస్తుంది. అమాయకుల్ని హత్యచేసి తన అహం తృప్తి పరచుకుని ఆధిక్యం నిలుపుకునేవాడు ఈ స్వామి' కేసు వివరించాడు శరత్.


**-కస్తూరి మురళీకృష్ణ**

*సెల్: 98496 17392*

# యువ కెరటాలు

**సమాజం మనకు ఏమిచ్చింది? అని ఆలోచించే కన్నా మనం సమాజానికి ఏం ఇచ్చాం అని ఆలోచిస్తే సమాజాన్ని, దేశాన్ని మరింత ముందుకు తీసుకెళ్లగలం. అందుకోసం ఎందరో ఎన్నో సేవాకార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వివిధ రంగాల్లో విస్తృతమైన సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న వారికి అనేక రకాల గౌరవం ఇచ్చి వారిని మరింత ఉత్తేజం చేస్తున్నాం కూడా! ఇలాంటి వారు ఇంకొందరు ఉంటే సమాజంలో మరింత అభివృద్ధి జరుగుతుందనడంలో సందేహం లేదు.**

ఫోర్బ్స్ పత్రిక గురించి తెలుసు కదా! ప్రపంచ స్థాయిలో గుర్తింపు పొందిన పత్రికల్లో ఇదీ ఒకటి. వివిధ రంగాల్లో నిపుణులు, గుర్తింపు పొందిన వ్యక్తులను గుర్తించి ఈ సంస్థ ఒక జాబితా విడుదల చేస్తుంది. అందులో రాజకీయం, ఫ్యాషన్, క్రీడా, వినోదం ఇలా అన్ని రంగాలూ ఉంటాయి. అందులో పెద్దవాళ్లకి, చిన్నవాళ్లకి ఇలా వివిధ కేటగిరీలలో అవార్డులు అందిస్తుంది.

ఈ సంవత్సరం వివిధ రంగాలలో నైపుణ్యం ప్రదర్శించిన యువకెరటాల జాబితా విడుదల చేసింది ఫోర్బ్స్. అందులో, 30 ఏళ్లలోపుగల ముప్పై మంది భారతీయుల జాబితాను '30 అండర్ 30' పేరిట ఫోర్బ్స్ ఇండియా విడుదల చేసింది. ఇందులో ఫ్యాషన్, క్రీడలు, వినోదం, సామాజిక సేవ వంటి పలు విభాగాల్లో పలువురు యువతులు, యువకులు చోటు దక్కించుకున్నారు. ఈ నేపథ్యంలో ఈ జాబితాలో చోటు సంపాదించుకున్న కొందరు యువతుల గురించి మనమూ తెలుసుకుందామా?



### తాప్సీ పన్ను

తాప్సీ పన్ను ఈమె గురించి ప్రత్యేక పరిచయం అక్కర్లేదు. వివిధ భాషల్లో తన హావభావాలతో ఎందరి మనసులనో దోచేసిన అందాల సుందరి. ఇటీవల ఆమె నటించిన సామాజిక ప్రయోజనాత్మక చిత్రం 'పింక్'. బాలీవుడ్ దర్శకుడు అనిరుద్ధ్‌రాయ్ చౌదరి దర్శకత్వంలో రూపొందిన చిత్రం. లైంగిక దాడుల నేపథ్యంలో మహిళలు ఎదుర్కొంటున్న సమస్యల్ని ప్రతిబింబిస్తూ ఈ చిత్రాన్ని రూపొందించారు. ఈ చిత్రంలో మీనల్ అరోరా పాత్రలో తాప్సీ పన్ను చక్కని నటప్రతిభ కనబరిచింది. అందాలతార తాప్సీకి ఈ చిత్రం మంచి విజయం అందించడమే కాదు, బాలీవుడ్‌లో మరిన్ని అవకాశాలు చేజిక్కించుకుని ప్రస్తుతం చేతినిండా సినిమాలతో బిజీబిజీగా గడుపుతోంది. తన పాత్ర ద్వారా సమాజంలోని మహిళలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి అవగాహన కల్పించినందుకు గాను ఈ ఏడాది ఫోర్బ్స్ జాబితాలో ఎంటర్‌టైన్‌మెంట్ విభాగంలో స్థానం సంపాదించుకుంది తాప్సీ. భవిష్యత్తులో కూడా మహిళలపై జరుగుతున్న అన్యాయాల గురించి పోరాటం చేయడానికి తనవంతు సహాయం చేస్తానంటోంది ఈ సుందరి.

### తెలుగింటి కోడలు మసాబా గుప్తా

బాలీవుడ్‌లో పేరొందిన ప్రముఖ ఫ్యాషన్ డిజైనర్స్‌లో మసాబాగుప్తా కూడా ఒకరు. తన నటనతో ప్రేక్షకుల్ని ఆకట్టుకున్న ఒకనాటి బాలీవుడ్ నటి నీనాగుప్తా, క్రికెట్ దిగ్గజం వెస్టిండీస్ క్రికెట్ ప్లేయర్ వివియన్ రిచర్డ్స్‌ను వివాహమాడి క్రీడాలోకమంతా తనవైపు చూసేలా చేసుకుంది. వీరి గారాల పట్టి మసాబాగుప్తా.

ఈమె కూడా తల్లి నీనాగుప్తా బాటలో పయనిస్తూ, ఫ్యాషన్ ప్రపంచంలో ఆదరాభిమానాలు సొంతం చేసుకుంటోంది. ప్రేమపెళ్లి చేసుకుని తెలుగింటివారి కోడలైంది. మొదట్లో టెన్నిస్ క్రీడాకారిణి కావాలని అనుకున్నా అనుకోకుండా ఫ్యాషన్ డిజైనింగ్ దిశగా అడుగులు వేసిన మసాబా, లాక్మే ఫ్యాషన్ వీక్ వంటి ప్రతిష్ఠాత్మక



ఫ్యాషన్ షోలతో పాటు బాలీవుడ్ ఫ్యాషనిస్ట్ సోనమ్‌కపూర్ వంటి స్టైలిష్ సెలబ్రిటీలకు కూడా ఎన్నో డిజైన్లు రూపొందించారు. ముఖ్యంగా కాటన్, మస్లిన్ వంటి ఫ్యాబ్రిక్‌తోనే భారతీయతను ప్రతిబింబించేలా డిజైన్లు రూపొందించడం మసాబా ప్రత్యేకత. చిన్న వయసులోనే తన కెరీర్‌లో అత్యుత్తమ విజయాలు సాధిస్తున్న మసాబా ఈ ఏడాది ఫోర్బ్స్ జాబితా ఫ్యాషన్ విభాగంలో చోటు దక్కించుకుంది.

### ఏంజెలికా ఆరిబం

ఇంఫాల్‌లో జన్మించింది ఏంజెలికా ఆరిబం. హైస్కూల్ విద్యాభ్యాస సమయంలో ఆమె కుటుంబంతో సహా ఢిల్లీకి మకాం మార్చింది. చిన్నప్పటినుంచి చాలా చురుకైన వ్యక్తి. కేవలం చదువులోనే కాకుండా వివిధ అంశాల్లో చురుగ్గా



రాణించేంది ఏంజెలికా. ఢిల్లీ విశ్వవిద్యాలయ అనుబంధ శ్రీ వెంకటేశ్వర కళాశాలలో బయోకెమిస్ట్రీ పూర్తి చేసిన ఏంజెలికా, చదువుతోపాటు విద్యార్థి రాజకీయాలవైపు కూడా దృష్టి సారించింది. ఎందరో విద్యార్థుల సమస్యలు తీర్చింది. విద్యార్థులకు సంబంధించిన రాజకీయ కార్యకలాపాల్లో ఉత్సాహంగా పాల్గొనడమే

# ఎలా సంపాదించిందో తెలుసా?



అలెగ్జాండ్రా అండర్సన్ ప్రపంచంలోనే పిన్న వయస్కురాలైన బిలియనీర్‌గా ఫోర్బ్స్ జాబితాకెక్కింది. ఈ నార్వే చిన్నదాని సంపద అక్షరాలా ఎనిమిదివేల కోట్లు! పందొమ్మిదేళ్ల అమ్మాయి ఏం చేస్తుంది. కాలేజీకి వెళుతుంది. లేదంటే ఫ్రెండ్స్‌తో సినిమాలు, షికార్లు చేస్తుంది. మహా అయితే పుస్తకాలతో కుస్తీ పడుతూ పోటీ ప్రపంచంలో ఏం జరుగుతుందో గమనిస్తుంది. కానీ అలెగ్జాండ్రా అలా చేయలేదు. తన కుటుంబీకుల నుంచి అప్పనంగా వచ్చిన ఆస్తి రెట్టింపు చేయడమే పనిగా పెట్టుకుంది. ఊహ తెలిసినప్పటి నుంచి అంటే దాదాపు ఏడు సంవత్సరాల నుంచి రియల్ ఎస్టేట్ షేర్లలో పెట్టుబడులు పెట్టింది. దీంతో తన ఆస్తి రెట్టింపు అయింది. అలా ఫోర్బ్స్ జాబితాలో పిన్న వయసులోనే బిలియనీర్ స్థానం సంపాదించుకుంది అలెగ్జాండ్రా అండర్సన్. అంతేకాదండోయ్ ఇంత ఆస్తి ఉన్నా ఏనాడూ దర్పం ప్రదర్శించేది కాదు. ఇన్ని వేల కోట్ల ఆస్తి ఉన్నప్పటికీ పాత కార్లు వాడుకునేది. అంతేకాదు తనకు గుర్రపు రేసులు, క్విజ్ పోటీలు అంటే చాలా ఇష్టం. వాటిల్లో పాల్గొని వచ్చిన ప్రైజ్ మనీతో అవసరాలు తీర్చుకునేది. ఒక్కోసారి పేద అమ్మాయిలా ఉండే అండర్సన్ బ్యాంక్ ఖాతాలో ఓసారి కోటి రూపాయలు ఉండడం చూసిన తన స్నేహితులు నోరెళ్లబెట్టే వారని తెలిపింది.

కాకుండా ఢిల్లీ యూనివర్సిటీ స్టూడెంట్స్ యూనియన్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌గా, జాతీయ విద్యార్థుల సమాఖ్య సెక్రటరీగా ఎన్నికైన తొలి ఈశాన్య రాష్ట్ర పౌరురాలిగా గుర్తింపు సంపాదించుకుంది. భవిష్యత్తులో మెరుగైన సమాజాన్ని తీర్చిదిద్దాలనేదే తన కోరిక. ఇవే ఏంజెలికాకు ఫోర్బ్స్ పత్రికలో లా, పాలసీ, పాలిటిక్స్ విభాగంలో చోటు లభించేలా చేశాయి.

### రిచా సింగ్

శారీరక రుగ్మతలు ఎలాగైనా తొలగించుకోవచ్చు. కానీ మానసిక రుగ్మతలకు మందు లేదు. వాటిని కేవలం కౌన్సెలింగ్ ద్వారానే తొలగించుకోవచ్చు. అందుకోసమే ఏర్పడింది 'యువర్ దోస్త్'. మానసిక రుగ్మతలతో సతమతమయ్యేవారు, మానసిక నిపుణుల నుంచి చక్కని కౌన్సెలింగ్ తీసుకోవడానికి వీలుగా రూపొందించిన అద్భుతమైన వేదిక. దీనికి సహ వ్యవస్థాపకురాలు, సీఈవో కర్ణాటకకు చెందిన రిచాసింగ్.

2014లో ఈ కౌన్సెలింగ్ వేదిక ప్రారంభమైంది. ప్రతిరోజూ 750 మందికిపైగా నిపుణులు, 1200 సెషన్స్ ద్వారా తొమ్మిదిలక్షల మందికి పైగా బాధితులకు సేవలు అందిస్తున్నారు. ఎందరో దీనివల్ల లాభపడుతున్నారు. సోషల్ ఎంట్రప్రెన్యూర్‌గా రాణిస్తున్న రిచా కూడా ఈ ఏడాది ఫోర్బ్స్ పత్రికలో సామాజిక సేవా విభాగంలో స్థానం సంపాదించుకుంది.

### అర్చనా చౌదరి

సమాజంలో ఎందరో దీనులు, నిరుపేదలు ఉన్నారు. ఈశాన్య రాష్ట్రాల్లో ఈసంఖ్య ఇంకా ఎక్కువ. అందులో మహిళలకు మరింత న్యాయం చేకూర్చడం అత్యవసరం. ఈ అంశం మీదనే వారికి న్యాయం చేకూర్చేలా అర్చన అనే యువతి పనిచేస్తోంది. అసోంకు చెందిన ఈమె నజ్దీక్ అనే సంస్థలో జూనియర్ ప్రోగ్రామ్ అసోసియేట్‌గా పనిచేస్తోంది. అట్టడుగు వర్గాల మహిళలకు పూర్తిన్యాయం అందేలా చూడడమే ఈ సంస్థ లక్ష్యం. స్థానిక ఆదివాసీల హక్కుల విషయంలో జరుగుతున్న ఉల్లంఘనలను గమనిస్తూ ఎప్పటికప్పుడు రిపోర్ట్ ఇచ్చేలా 18 మంది మహిళలకు శిక్షణ ఇచ్చింది అర్చన. జాతీయ ఆరోగ్య మిషన్‌లో భాగంగా ఆమె అందించిన ఈ సేవలే అర్చనకు ఫోర్బ్స్ పత్రికలో లా, పాలసీ, పాలిటిక్స్ విభాగంలో చోటు దక్కేలా చేశాయి.

### సుచితా సాల్వన్

విభిన్నమైన రుచులు ఆస్వాదించాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటారు కదూ. ఈ అంశాన్నే ప్రధానంగా తీసుకుంది లిటిల్ బ్లాక్ బుక్ అనే సంస్థ. ఈ సంస్థ ద్వారా ఢిల్లీలో స్థానికులకు కూడా తెలియని ప్రదేశాలు, అక్కడ దొరికే రుచులు మొదలైన వాటికి సంబంధించిన సమాచారం అందిస్తూ కొత్త అనుభూతులను అందరికీ పరిచయం చేస్తోంది సుచితా సాల్వన్. ఈ సంస్థ ఎంతగా ప్రాచుర్యం పొందిందంటే, ఈ సంస్థకున్న పదిహేను లక్షలమంది వినియోగదారులే అందుకు నిదర్శనం. అలాగే ట్విట్టర్‌లో కూడా ఈ సంస్థకు అపారమైన ఫాలోయింగ్ ఉంది. 2012లో ఈ సంస్థ ప్రారంభించిన సుచితా సాల్వన్ అంతకు ముందు బీబీసీ మార్కెటింగ్ విభాగంలోనూ పనిచేశారు. అయితే కాస్త వినూత్నంగా మనసుకు నచ్చిన పనిచేయాలన్న తపనతో ఈ సంస్థను ప్రారంభించిందట. ఆరంభం నుంచి నేటి వరకు సుచిత పడిన కష్టం శ్రమే ఫోర్బ్స్ జాబితాలో సోషల్ మీడియా మొబైల్‌టెక్ కమ్యూనికేషన్ విభాగంలో ఆమెకు చోటు దక్కేలా చేశాయి.



### అదితి అశోక్



మన దేశం నుంచి ఒలింపిక్స్‌కి అర్హత సాధించిన మొట్టమొదటి గోల్ఫ్ క్రీడాకారిణి అదితి అశోక్. పతకం సాధించలేక పోయినా అత్యుత్తమ ఆటతీరుతో ఫైనల్స్ వరకు దూసుకెళ్లింది అదితి. అలాగే మహిళా యూరోపియన్ టూర్‌లో వరుసగా రెండుసార్లు టైటిల్స్ సాధించడమే కాకుండా అత్యుత్తమమైన ఆటతీరుతో 'రూకీ ఆఫ్ ది ఇయర్'గానూ నిలిచింది అదితి.

భవిష్యత్తులో గొప్ప క్రీడాకారిణిగా రాణించి దేశానికి పేరుతేవడమే తన లక్ష్యం అంటోంది ఈమె. గోల్ఫ్ క్రీడలో అదితి కనబరిచిన ఉత్తమ ప్రదర్శనే ఆమెకు ఫోర్బ్స్ జాబితాలో క్రీడా విభాగంలో చోటు దక్కేలా చేసింది.

- నివేదిత

# ఎందుకూ... నీకెందుకూ...

-గోగినేని మణి

**"నీకెందుకిదంతా? నీపనేదో నువ్వు చూసుకోక ఊరి వ్యవహారాల్లో తలదూర్చటం ఎందుకు?" ఆఫీసర్ మాటలకు సమాధానం చెప్పకుండా మౌనంగానే ఆయన వైపు చూశాను. ఈ ప్రశ్న నేనె దుర్కోవటం మొదటిసారి కాదుగా, సమాధానం చెప్పటానికి! అందుకే ఆయన కొంచెం చిరాకు తగ్గించుకుని నావైపు సానుభూతిగా చూసి "సరేలే పద, నీపని తొందరగానే అవుతుందిలే" అన్నారు.**

ఎం.ఆర్.ఓ. ఆఫీసునుండి బైటపడి ఇంటిదారి పట్టిన నా మనసునిండా ఆలోచనలే. మా ఊరి హైస్కూలు పక్కన ఉన్న రెండెకరాల ఖాళీ జాగాని ఒక రాజకీయనాయకుడి అండతో కొందరు ఆక్రమించి, ఇళ్ళస్థలాలుగా చేసి అమ్మే ప్రయత్నాన్ని నేను అడ్డుకున్నాను. మా ఊరు యువకులతో కలిసి ధర్నాకు దిగాను. అది ఎవరికీ చెందినదికాదు, ప్రభుత్వ భూమేనంటూ సర్వే చెయ్యాలని అర్జీ పెట్టాను. అప్పటినుండి ఎందరో నాయకులు, అధికారులనుండి 'నీకెందుకూ..' అనే ప్రశ్న ఎదుర్కొంటూనే ఉన్నాను.

'నీ సొంత భూమిలోకి ఎవరైనా అడుగు పెడితే, అప్పుడడుగు. అంతేగానీ ఊరికి చెందిన భూమి గురించి నీకెందుకూ...!' అనడుగుతారు. అదేమిటో నాకర్థం కాదు! మా ఊరికి చెందిన విలువైన ఆస్తి అన్యాక్రాంతమైపోతోందంటే, నాకు ఎందుకని నేను ఊరుకోవాలా? పౌరుడిగా నాకు బాధ్యత ఉండదా! ఆఫీసులచుట్టూ తిరుగుతూ, ఎంతమంది ఆఫీసర్లకు ఎన్నిసార్లు నా వాదన వినిపించానో..!

చిన్నప్పటినుండి 'ఎందుకూ... నీకెందుకూ..' అని నేనెదుర్కొన్న కొన్ని సందర్భాలు నా మనసులో మెదిలాయి.

నేను ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నప్పుడు సెలవులకు ఒకసారి తాతగారి ఊరు వెళ్ళాను. పక్కింటి పిల్లలిద్దరితో ఆడుకుంటున్నప్పుడు ఆ పిల్లల నాన్నవచ్చి ట్యూషన్‌కి టైమైందని తీసుకెళ్తుంటే, తాతగారు 'ఇక్కడున్న నాలుగు రోజులూ నువ్వూ, వాళ్ళతోవెళ్ళి కాసేపు పాఠాలు వింటూ ఉండరా.." అన్నారు, సరేనని ఉత్సాహంగా వెళ్ళాను.

వరుసగా మూడురోజులు వెళ్ళినా ఆ పంతులుగారు పాఠం చెప్పేదేం నాక్కనిపించలేదు. వాళ్ళింటి అరుగుమీద మేం కూర్చోగానే "పుస్తకాలు తీసి చదవండిరా" అనేవారు. వీధిలో వెళ్తున్న వాళ్ళెవరినో ఆపి, నిలబడే ఏదో మాట్లాడటం.. 'ఏమండీ' అని వంటగదిలోనుండి ఓ గావుకేక రాగానే లోపలికెళ్ళి వంటపనిలో సాయంచేసి రావటం... ఇదే తంతు! ఇక పిల్లలిద్దరూ నోటు బుక్కుల్లో ఏవో గీతలు గీసుకుంటూ సరదాగా కబుర్లతో కాలక్షేపం చేసి టైమవ్వగానే పుస్తకాలు సర్దేసుకుని బయలుదేరటం.. అంతే!

నాలుగోరోజు ఆ పంతులుగారు పిల్లల్ని "మీకు మార్కులేం బాగా రావటంలేదని మీ నాన్న ఫిర్యాదు చేస్తున్నాడు. స్కూల్లో పాఠాలు సరిగ్గా వినిచావరా? ఇంట్లో కాసేపైనా చదివేడవరా? ఏం చేస్తార్రా మీరు?' అంటూ గదమాయించేసరికి నాకు చాలా ఆశ్చర్యమేసింది.

బడిలో పాఠాలు శ్రద్ధగావిని, ఇంటికొచ్చాక కుదురుగా కూర్చొని బాగా చదువుకుంటే, ఇక ట్యూషన్‌కి రావటం ఎందుకూ...? ఆ వయసులోనే ఏం భయంలేకుండా ఆ మాస్టారినే నా సందేహం అడిగాను. అంతే. ఆయన కోపంతో ఊగిపోతూ మమ్మల్ని మా ఇంటిముందుకు లాక్కొచ్చి "వేలెడంత వెధవ... నన్నే వేలెత్తి చూపిస్తాడా, అయిదో తరగతికే ఇంత పొగరుంటే పెద్దయ్యాక, ఇంకెలా ఉంటాడో.." అంటూ చిందులు తొక్కారు. "నేనిక ట్యూషన్ చెప్పను" అని తీర్మానించేసి వెళ్ళిపోయారు.

మా పిల్లల తప్పులేకపోయినా మీ మనవడి వల్ల మా పిల్లలకి ట్యూషను పోయిందని పక్కింటి పిల్లల నాన్న నిష్టూరంగా అనేసరికి తాతగారికి కోపం వచ్చింది. "ఆ మాస్టారు చదువు చెబుతున్నాడో, లేదో నీకెందుకురా?" అంటూ చివాట్లు పెట్టారు. నాకప్పుడు భలే ఆశ్చర్యమేసింది. చదువు చెప్పకపోవటమే అసలు తప్పు. కానీ అదేమని అడగటం తప్పు ఎలా అవుతుంది? చెప్పని ట్యూషన్‌కి ఫీజు ఇవ్వాల్సిన అవసరం లేకుండా పోతే, సంతోషించాలిగానీ బాధ దేనికి! నాకు అర్థం కాలేదు.

నేను హైస్కూలు చదువులో ఉన్నప్పుడు కూడా ఇంకోసారి ఇలాగే జరిగింది. అప్పట్లో మా చినమామయ్య కూడా మా ఊళ్ళోనే ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. అత్తయ్యకి డెలివరీ టైమ్ ఇంకో వారం పదిరోజులుందనగా చెకప్‌కోసం అత్తయ్యని హాస్పిటల్‌కి తీసుకెళ్ళింది అమ్మమ్మ. అత్తకి వెంటనే సిజేరియన్ చేసెయ్యాలనీ హాస్పిటల్‌లో చేరమనీ డాక్టరమ్మ చెప్పారట. ఆ సమయానికి మామయ్య ఊళ్ళోలేడు. మర్నాడు వచ్చాడు. మా ఇంటికివచ్చి తల్లీ, బిడ్డా క్షేమంగానే ఉన్నారనిచెప్పి, నాచేతికి మందుల ప్యాకెట్ ఇచ్చి "నువ్వెళ్ళి కాసేపు హాస్పిటల్‌లో ఉండరా, నేను ఆఫీసుపని చూసుకు వస్తాను" అన్నాడు.

నేను హాస్పిటల్ రూముకి వెళ్ళేసరికి అమ్మమ్మ అదోలా ఉంది. ఏమైందని అడిగితే వివరంగా చెప్పుకొచ్చింది. ముందుగా అనుకోకపోవటంవల్ల, వెంట ఎవరినీ సహాయంగా తీసుకెళ్ళే వీలులేకపోవడంవల్ల ఆ రాత్రి అమ్మమ్మ ఒక్కతే అత్తయ్యకు తోడుగా ఉంది. అమ్మమ్మకి కీళ్ళ నొప్పులు. రెండు నిమిషాలు కూడా నిలబడలేదు. కాళ్ళు, చేతుల్లో అంతగా పట్టు ఉండదు. అందువల్లనే పిల్లాడికి మందుచుక్కలు వేయటానికి మధ్య రాత్రివేళ నైట్‌డ్యూటీ నర్సును నిద్రలేపి పిలుచుకొచ్చింది. కొంచెం చిరాగ్గానే వచ్చింది నర్సు. ఆ సమయంలో పిల్లాడు ఆవిడచీర ఖరాబు చేసినందుకు ఇంకొంచెం చిరాకు పెరిగి సణుక్కుంటూ వెళ్ళిందట.

ఉదయం రౌండ్సుకి వచ్చిన పిల్లల డాక్టరు వెంట ఆ నర్సు వచ్చింది.

"రాత్రిపూట విసిగించామని ఆ నర్సు మనమీద ఏం చెప్పిందో, ఆ డాక్టరు ఏంచిరాకులో ఉన్నారో తెలియదుగానీ, ఆడము....లు ఇంట్లో మీ పనులు మీరే చేసుకుంటారుగా! ఇక్కడకొచ్చేసరికి నర్సు కావల్సొచ్చిందా? ఇంకానయం డాక్టరే రావాలని అడగలేదు" అంటూ ఆ డాక్టరు ఎన్ని పెద్దపెద్ద కేకలేశాడో చెప్పలేను! అనుకున్న టైముకి కాకుండా అప్పటికప్పుడు హాస్పిటల్లో చేరాల్సి వచ్చిందనీ, నా ఆరోగ్యం సరిగ్గాలేకపోయినాగానీ రాత్రేకదా అని తోడుగా ఉన్నాననీ చెబుతుంటే వినిపించుకుంటేగా! ఆయన ధోరణి ఆయనదే. ఒకటే కేకలు..! ఇలాంటి డాక్టర్ని నా జీవితంలో ఇప్పటివరకూ చూడలేదనుకో" అంటూ గద్గద స్వరంతో అమ్మమ్మ చాలాసేపు బాధపడింది.

మామయ్యవచ్చాక అమ్మమ్మ జరిగిందంతా మళ్ళీ తు.చ. తప్పకుండా చెప్పింది. "ఇప్పటివరకూ నేనెవరితోనూ ఇలాంటి మాటలనిపించుకోలేదు" అంటూ అవమానం జరిగినట్టు వాపోయింది.

మామయ్యకీ చాలాకోపం వచ్చింది. అడిగి వస్తానంటూ ఆవేశపడ్డాడుగానీ "ఏదో నాలుగు

**ఎందుకూ? నీకెందుకూ? అనే ప్రశ్న చిన్నప్పటినుండీ అతను ఎదుర్కొంటూనే ఉన్నాడు. కానీ ఆ ప్రశ్నలకు చిన్న వయసులోనే భయపడలేదతను. అన్యాయాన్ని నిలదీసేవాడు. పెద్దయ్యాక కూడా అదే అలవడింది. స్వగ్రామంలో భూకబ్జాదారుల్ని ప్రతిఘటించాడు. గ్రామస్థుల్ని ఏకంచేసి సమావేశపరిచాడు. కానీ అప్పుడుకూడా నీకెందుకూ? అనే ప్రశ్న వినబడిందతనికి! ఎవరు అడిగారాపశ్న? మరి అతనేం చేశాడు?**



రోజులు ఇక్కడుండి వెళ్ళిపోయేవాళ్ళం, మనకు ఆ డాక్టరుతో గొడవ ఎందుకులే, డాక్టరమ్మనిబట్టి గదా మనమిక్కడ చేరాం" అని చల్లబడిపోయాడు.

డాక్టరుగారి మాటలకు నాకు చాలాకోపం వచ్చింది. ఇంట్లో ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటారు. నిజమే. అయితే అలా చేసుకోలేని పనులున్నప్పుడేకదా హాస్పిటల్లో నర్సులు, డాక్టర్లు అవసరమయ్యేదీ? వాళ్ళ అవసరమైనప్పుడే కదా ఫీజులుకట్టి హాస్పిటల్‌కి వచ్చేదీ? ఉత్తినే రారు గదా...! అంతపెద్ద చదువు చదివిన డాక్టరుగారు పెద్దావిడ వయసు కూడా పట్టించుకోకుండా అమర్యాదగా కేకలు వేయటం ఏమిటి? ఒకవేళ నర్సు కంప్లైంట్ చేసినా, 'కస్టమర్ ఈజ్ ఆల్వేస్ రైట్' అన్న పద్ధతిలో అనునయంగా అమ్మమ్మని అడిగి వుంటే బాగుండేది. అసలు సమస్యే ఉండేదికాదు. ఇతర వృత్తుల్లో ఉన్నవాళ్ళ సంగతి వేరే గానీ, ఈ వృత్తిలోమాత్రం డాక్టర్లు తమ వ్యక్తిగత చికాకులు పక్కనపెట్టి రోగుల్ని ఆదరంగా పలకరించాల్సిన ధర్మం ఉంది. డాక్టరు చిరునవ్వుతో పలుకరిస్తే, రోగికి సగంజబ్బు ముందే నయమైనట్టనిపిస్తుందంటారు! సాంత్వన పొందిన రోగి, డాక్టరును దైవసమానంగా భావించి నమస్కరిస్తాడు! అందుకే మనపెద్దలు వైద్యుణ్ణి నారాయణుడితో పోల్చారు. సమాజంలో అంతటి గౌరవప్రదమైన స్థానంలో ఉన్న వ్యక్తి ప్రవర్తన అమర్యాదకరంగా ఉండొచ్చునా?

ఇంటికి వెళ్తాననిచెప్పి బయలుదేరిన నేను ఆ డాక్టరుగారి రూము ఎక్కడో కనుక్కునివెళ్ళి, ఈ మాటలన్నీ టకటకా అడిగేసి, 'చదివింది

నేచురోపతి, హోమియోపతి, ఆల్లోపతి, ఏదైనా సరే...డాక్టరుకు పేషెంట్‌పట్ల తప్పకుండా ఉండాల్సింది మాత్రం సానుభూతి!" అనే కొటేషను గుర్తు చేశాను. నిర్ఘాంతపోయి చూస్తున్న డాక్టరుగారి దగ్గర ఆ తర్వాత ఒక్కక్షణం కూడా ఆగకుండా బైటకు వచ్చేశాను.

ఆ సాయంత్రమే ఊరునుండి వచ్చిన బంధువులావిణ్ణి హాస్పిటల్‌లో అత్తయ్య దగ్గరుంచి, అమ్మమ్మను మా ఇంటికి తీసుకువచ్చాడు మామయ్య.

"ఆ డాక్టరుగారి గదికెళ్ళి ఏదో అన్నావట. నీకెందుకురా అనవసర విషయాలు.." తప్పు ఆయనదే అనుకో, అయినా పెద్దవాళ్ళతో గొడవెందుకని నేనే ఊరుకుంటే, పిల్లాడివి నీకెందుకూ...? ఇంకా పాఠాలు నేర్చుకునే వయసులోనే ఉన్నావు. పెద్దవాళ్ళతో వాదన సరికాదు...!" అని వచ్చీరాగానే నన్ను కోప్పడ్డాడు మామయ్య.

నాకు వింతగా అనిపించింది! తనకంటే పెద్దదైన అమ్మమ్మతో డాక్టరుగారు అలాంటి భాషలో కేకలు వేయటం తప్పుకాదా? డాక్టరుగారి మాటలు తల్చుకుని తల్చుకుని అమ్మమ్మ ఎంత బాధపడిందో చూసీ, పట్టనట్టు ఉండటం నాదృష్టిలో తప్పుగా అనిపించిందిమరి! అవమానం దిగమింగి బాధపడేకంటే, ప్రశ్నించటమే మనసుకు కొంతైనా ఉపశమనంగా ఉంటుంది! డాక్టరుగారి తీరును ఎత్తిచూపిస్తే, ఆయనకూడా ఆత్మవిమర్శ చేసుకుని మరోసారి అలా ప్రవర్తించకుండా ఉండే అవకాశమూ కలిగించినట్లవుతుందిగానీ, అడగటంలో నష్టమేముంది?

"పిల్లలకే కాదు మామయ్యా, కొందరు పెద్దలకీ పాఠాలు అవసరమే. తెలుసుకోనీ, మాననీగానీ.." చిరునవ్వుతో జవాబుచెప్పి ఊరుకున్నాను.

మామయ్య నావైపు చురుగ్గా చూశాడుగానీ అమ్మమ్మ చూపుల్లో మాత్రం 'మానాయనే..' అనే భావం, మురిపెం కనిపించింది!

●●●

నేను కాలేజీ చదువు ఫైనలియర్‌లో ఉండగా ఒక సందర్భంలోనూ 'నీకెందుకూ...' అనే ప్రశ్న ఎదుర్కొన్నాను.

నాన్నగారి చెల్లెలు మాకు కొంచెం దూరంలోనే ఉంటుందిగానీ ఆయన ముగ్గురు అన్నయ్యలు మాత్రం వేరే రాష్ట్రాల్లో ఉంటారు. అందువల్ల పెదనాన్నలు అప్పుడప్పుడు మాత్రమే మా ఇంటికి వస్తుంటారు, అత్తయ్యమాత్రం పిల్లల్ని తీసుకుని తరుచు వస్తూ ఉంటుంది. అత్తయ్య ఉన్న రెండురోజులూ ఇంట్లో పండుగలా సరదా వాతావరణమే.

కానీ ఆ రోజు...

అత్తయ్య ఏం అడిగిందో తెలియదుగానీ అత్తయ్యతో అమ్మ కొంచెం గట్టిగా మాట్లాడటం వినిపించి ఆశ్చర్యపోయాను.

'బరువుభారాలు మేమే మోయాలి... ఆస్తుల్లో హక్కులు, వాటాలుమాత్రం అందరికీ ఉన్నాయంటారు.." అంటూ ఇంకా ఏవేవో అంది.

నాన్న మౌనంగా ఉండిపోయారు. అత్తయ్య కొంచెం నిష్టూరంగా "నాది అనుకుని అడిగాను. కాదని నువ్వు ఇప్పుడు చెప్పాకనే తెలిసింది" అని నాన్నవైపు నిష్టూరంగా చూసి కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.

అప్పుడు ఆ వివరం ఏమిటో తెలియలేదుగానీ తర్వాత తెలిసింది.

నాన్నకి తన ముగ్గురన్నయ్యలూ, చెల్లెలూ అంటే చాలా ఆపేక్ష. తాతగారు నాన్న దగ్గరే ఉండేవారు. తాతగారు తన ఆస్తుల వివరాలూ, బాధ్యతలూ అన్నీ నాన్నకి అప్పగించి పవర్‌పట్టా కూడా ఇచ్చారట. వీలునామాలా రాసిన కాగితాల్లో ఎవరికేది చెందుతుందో కూడా రాశారు. ఊళ్ళో ఉన్న ఒక స్థలం అత్తయ్యకి చెందేట్లు రాశారట. దాన్ని ఇప్పుడు అమ్మేయాలనే ఉద్దేశంతో నాన్నగారి దగ్గరున్న ఆ కాగితాలు అడిగిందన్నమాట! అత్తయ్య మునుపటిలా మా ఇంటికి రావటం మానుకుంది. ఒకరోజు సాయంకాలం ఒంటరిగా కూర్చుని నాన్న ఏదో ఆలోచిస్తున్నట్టుగా కనిపిస్తే, నేనువెళ్ళి పక్కనే కూర్చుంటూ "ఏదైనా కథ గురించి ఆలోచిస్తున్నారా?" అనడిగాను. నాన్నకి అప్పుడప్పుడూ కథలు రాసే అలవాటు!

కాదన్నట్లుగా తలఊపి ఏదో చెప్పటానికి తటపటా యిస్తున్నట్లుగా రెండు నిమిషాలు మౌనంగా, నిర్లిప్తంగా చూస్తుండిపోయారు. తరువాత చిన్నస్వరంతో అన్నారు. "చూశావా... మీ అత్తయ్య మనసు కష్టపెట్టుకుందేమో రావటం మానేసింది" అంటూ బరువుగా నిట్టూర్చి మళ్ళీ అన్నారు. "ఎందుకోగానీ నాకీమధ్య తరచు ఒక సందర్భంలో మానాన్న నా గురించి అన్న మాటలు గుర్తుకొస్తున్నాయి. నాకు పవర్‌పట్టా ఇస్తున్నప్పుడు 'పెద్దవాళ్ళని కాదని చిన్నవాడికి ఇవ్వటం ఏమిటీ?' అని మా అమ్మ అభ్యంతరం చెబితే, అప్పుడు మానాన్న ఏమన్నారో తెలుసా!" పెద్దా చిన్నా అని వయసు సంగతి కాకుండా నిస్వార్థంగా నలుగురికీ సమన్యాయం చేయగల సమర్థతగురించి మాత్రమే ఆలోచించి ఈ నిర్ణయం తీసుకున్నానని చెప్పారు. నామీద నాన్నకున్న నమ్మకానికి నేను పూర్తి న్యాయం చేయలేకపోయానేమో అనిపిస్తోందిరా...!"

"అందరూ కలిసి కూర్చుని నిజాయితీగా మాట్లాడుకుని సమస్యలు పరిష్కరించుకోవాలిగానీ ఆస్తిపాస్తుల భాగాల కోసం అనుబంధాలు వదులుకోవటం సరికాదు..!' నాన్న ఇద్దరు ముగ్గురికి ఇదే సలహా ఇవ్వటం నేను విన్నాను.

అందుకే 'మీరేదైనా చెయ్యాలనుకుంటే మీకు అడ్డేముంది?' అనడిగాను.

"నీకు అర్థంకాదులే. కొన్ని పనులు చేయటానికి కనిపించని

## బ్యాంకాక్‌పై రకూల్ కన్ను

'దీపముండగానే ఇల్లుచక్కబెట్టుకోవాల'న్న సామెతను రకూల్ అక్షరాలా పాటిస్తున్నట్టుంది. హీరోయిన్‌గా తన సంపాదనను చాలా వరకూ వ్యాపారంలోనే ఇన్వెస్ట్ చేస్తోంది. హైదరాబాద్‌లో ఓ ఖరీదైన జిమ్‌ను ప్రారంభించిన రకూల్ ఇప్పుడు బ్యాంకాక్‌లో కూడా ఇలాంటి జిమ్‌నే ప్రారంభించాలని చూస్తోందట! ఈ జిమ్ వ్యాపారాన్ని ఆమె బ్రదర్ చూసుకుంటున్నాడు. ప్రస్తుతం షూటింగ్‌లతో బిజీగా ఉన్న రకూల్ టైము సర్దుబాటు చేసుకొని బ్యాంకాక్‌లో ఏర్పాటు చేయబోయే జిమ్ మీద దృష్టి పెట్టాలని చూస్తోందట! చూడబోతే చైన్ రెస్టారెంట్లలా, చైన్ జిమ్‌లు పెట్టే ఆలోచన రకూల్‌కి ఉందన్నట్టుగా కనపడుతోందని టాలీవుడ్ జనాలు అంటున్నారు.



సంకెళ్ళు అడ్డుపడుతూ ఉంటాయి!" అని నిట్టూర్చారు నాన్న.

నాకప్పుడు నాన్నరాసిన కథలోనే ఒక వాక్యం గుర్తుకొచ్చింది.

"ఆత్మీయుల రాకపోకలు, పలకరింపులతో అవదా ఇల్లు అందాల హరివిల్లు.. ఆనందం ఆరోగ్యం అవుతాయి మన స్వంతమే...!"

అత్తయ్య విషయంగా నాన్న ఏదో అపరాధ భావనతో మథనపడుతున్నారని నాకు బోధపడింది. నాన్నకి ప్రశాంతత చేకూరటానికి నేనేం చేయగలనా?" అని చాలాసేపు ఆలోచించాను.

●●●

వారం పదిరోజుల తర్వాత అమ్మ, నాన్న ఏవో కాగితాలు కనిపించటం లేదంటూ బీరువా వెతుక్కుంటుంటే, ఆ కాగితాల్ని నాన్న ఇమ్మన్నారంటూ అత్తయ్య వాళ్ళ ఊరెళ్ళి ఇచ్చి వచ్చాననే విషయం నేనే మెల్లగా చెప్పాను.

నాన్న నావైపు చాలా ఆశ్చర్యంగా చూశారు.

అమ్మకోపం మాత్రం తారాస్థాయికి చేరింది.

ఇంటి వ్యవహారాలు నీకెందుకురా..? అప్పుడే అంత పెద్దవాడివైపోయాననుకుంటున్నావా? చెప్పాపెట్టకుండా ఏదైనా చేసెయ్యొచ్చు అనుకుంటున్నావా? ఈ గొడవలన్నీ నీకేం తెలుసనీ? నీకెందుకూ?" అంటూ చాలాసేపు చివాట్లుపెట్టి ఆయాసపడి ఊరుకుంది.

నేనూ ఇంట్లో వాడినేగా! ఇంటి విషయాలు నీకెందుకు? అని అమ్మ అంటుందేమిటో! నాన్న మనసు గ్రహించి, ఆయన చేయలేకపోతున్న పని నేను నిస్సంకోచంగా చేసేశాను! ఆస్తిపాస్తులనేవి ఆనందాన్నివ్వాలి. అపరాధ భావనతో మథనపడే కంటే, ఆ ఆస్తిపాస్తుల్ని వదులుకోవటమే ఉత్తమం! బాధపడటం అనవసరం!

పెద్దవాళ్ళని సంప్రదించకపోవటం మాత్రం తప్పే అనిపించింది. నాన్న దగ్గరకెళ్ళి క్షమాపణ కోరుతున్నట్లుగా మెల్లగా నసిగాను. నాన్న అనునయంగా నా భుజంతట్టి "మాదేదైనా చెందేది నీకేగా. నువ్వే వద్దనుకుంటే సమస్యేముందీ?" అన్నారు.

"లెస్ లగేజ్ మోర్ కంఫర్ట్ అని కదా అన్నారు. అందుకే జీవిత ప్రయాణం సుఖంగా సాగించటానికి లగేజీ తగ్గించుకుంటున్నానన్నమాట!" నా మాటలకు నాతోపాటు నాన్నా నవ్వేశారు.

నాకు నిశ్చింతగా అనిపించింది! అమ్మకోపం ఎంత! చితుకులమంటలా వెంటనే చల్లారిపోతుందని నాకు తెలుసు.

●●●

ఆ తర్వాత కొన్నాళ్ళకి నాన్నకి హార్ట్ఎటాక్ వస్తే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాం. రెండు రోజుల్లోనే ఆపరేషన్ చేయాలనీ, ఖర్చు మూడులక్షలు పైమాటే అవుతుందనీ డాక్టర్లు తేల్చిచెప్పారు. అప్పటికప్పుడు డబ్బు ఏర్పాటు చేసుకోవటమెలా? అని మేం ఆలోచిస్తుంటే, విషయం తెలిసి అత్తయ్య డబ్బు తీసుకువచ్చింది. అమ్మ కొంచెం సంకోచంగా "ఏదో ప్రయ్నత్నిస్తాంగా, నీదెందుకూ?" అంది.

"ఈ సమయంలో నీదీ నాదీ అనేమిటి వదినా. మనందరం ఒకటేగా!" అని అత్తయ్య అనేసరికి అమ్మ విప్పారిన మొహంతో అత్తయ్య భుజం చుట్టూ చేయివేసి ఆప్యాయంగా చూసింది.

ఆపరేషన్ విజయవంతంగా పూర్తయి నాన్న ఆరోగ్యంగా ఇంటికి తిరిగొచ్చారు. అందరి మనసులూ తేలికపడ్డాయి. సందడి, సంతోషం మళ్ళీ మా ఇంటి ముగింట వచ్చి వాలాయనిపించింది..!

సమస్యల్ని సామరస్యంగా పరిష్కరించుకుని అనుబంధాలు నిలబెట్టుకోగలిగితే, జీవితంలో ఆనందానికీ, ఆహ్లాదకర వాతావరణానికీ లోటు ఉంటుందా!

●●●

నా చదువు పూర్తయింది. ఉద్యోగ ప్రయ్నత్నాల్లో ఉండగానే నాన్న రిటైరయ్యారు. మాఊరికెళ్ళి ఉన్న కొద్దిపాటి భూమిలో వ్యవసాయం చేసుకుంటూ అక్కడే స్థిరపడాలని నాన్న నిర్ణయించుకున్నారు. అంతలో మాపక్క ఊరిలోనే నాకు ఉద్యోగం వచ్చింది. రోజూ అక్కడికి వెళ్ళి వస్తూ మా ఊళ్ళోనే అమ్మావాళ్ళతో కలిసి ఉండొచ్చని ఆనందంగా ఆ ఉద్యోగంలో చేరిపోయాను.

ఒకరోజు ఎవరోవచ్చి మాఊరు ఖాళీజాగాలో కొలతలు తీస్తుంటే విషయం ఏమిటని ఆరాతీశా. అపార్ట్‌మెంట్లు కట్టటానికి, ఫ్లాట్లు వేయటానికని చెప్పారు. అది మా ఊరి ప్రభుత్వభూమి అని నాకు తెలుసు. అందుకే పోరాటానికి సిద్ధమయ్యాను. నా కుటుంబమూ, స్నేహితులూ మద్దతుగా నిలిచారు.

అధికారులకు లంచమిచ్చి తమపేరిట నకిలీ పత్రాలు సృష్టించుకున్నారు వాళ్ళు. నేను ఈ విషయం పట్టించుకోకుండా దూరంగా ఉంటే కోటిరూపాయలిస్తామని ఆశ చూపారు. ఆ ప్రలోభానికి లొంగకపోయేసరికి ఎన్నో రకాలుగా బెదిరించారు. భయపెట్టారు. కొట్టించారు కూడా. ఎలాగో కొద్దిపాటి దెబ్బలతో తప్పించుకోగలిగాను. అప్పటి నుండి ఈ విషయం ఎందరో అధికారులదృష్టికి తీసుకెళ్తూ ఎన్నోసార్లు ఆఫీసులచుట్టూ ప్రదక్షిణలు చేస్తూనే ఉన్నాను.

ఈ ఆలోచనల్లోంచి బయటపడి ఇంట్లోకి అడుగుపెట్టగానే, "ఏమైందిరా...?" అనడిగింది అమ్మ.

"ఎమ్మార్వోగారు కొంచెం సానుకూలంగా మాట్లాడారు కాబట్టి తొందరలోనే పనవుతుందనిపిస్తోంది" అని జవాబు చెప్పాను. "ఏం అవుతుందో ఏమోగానీ నువ్వుమాత్రం ఏడాదికి పైగా పట్టువదలని విక్రమార్కుడిలా ఆఫీసుల చుట్టూ తిరుగుతూనే ఉన్నావు.." అంటూ అమ్మ నిట్టూర్చింది.

'అవును.. ఆ భూమిని మేం స్వాధీనపరచుకునే వరకూ పట్టువదలను" మనుసులోనే గట్టిగా తీర్మానించుకున్నాను.

●●●

ఆ భూమి ఆక్రమించుకోజూస్తున్నవాళ్ళు ఒక రోజు పని ప్రారంభించారు. అదృష్టవశాత్తూ అప్పుడే అది ప్రభుత్వ భూమి అని తేల్చిచెప్పే కాగితాలు నా చేతికి అందాయి.

మాకు ఒక అస్త్రం దొరికింది కాబట్టి పోరాటం



## తాగక తప్పలేదట!

ఇదేదో హీరో నోటి వెంట వస్తే నిజమేనేమో! అనుకోవచ్చు. కానీ ఓ హీరోయిన్ నోటి వెంట వస్తే దానికి బోలెడన్ని అర్థాలు వెతుక్కోవచ్చు. కోలీవుడ్‌లో స్టార్‌హీరోయిన్‌గా పేరు తెచ్చుకున్న హన్సిక చేతిలో ప్రస్తుతం ఒకే ఒక్క సినిమా ఉంది ఈ సినిమా సక్సెస్ మీదే ఆమె కెరీర్ ఆధారపడి ఉందట! ఈ సినిమాను ఎలాగైనా సక్సెస్ చేయాలన్న పట్టుదలతో ఉన్న హన్సిక మునుపెన్నడూ లేని విధంగా అందాల విందు చేయడమే కాకుండా, షూటింగ్‌కి ఓ రోజు తాగి వచ్చిందట! ఆ సీన్లో హన్సిక తాగి నటించాల్సి ఉంది. మామూలుగా అయితే సహజంగా రాదనీ, ఇంటి దగ్గరే ఫుల్‌గా తాగి వచ్చేసిందట! నిజంగా తాగిన వాళ్లు ఎలా ప్రవర్తిస్తారో అలా నటించేసి ఆ సీన్ బ్రహ్మాండంగా వచ్చేందుకు తన వంతు కృషి చేసిందట! సీను కోసం అయితే తప్పులేదు అనుకున్నా, సినిమాల్లో చాలా సీన్లు ఉంటాయి. మరి అవన్నీ సహజంగా రావాలంటే దేనికైనా తెగించాలి! హన్సిక నిజంగా అలా చేస్తుందా? అన్న అనుమానాన్ని చాలా మంది వ్యక్తం చేస్తున్నారు. షూటింగ్‌కి తాగి రావడం ఒక తప్పు అయితే సహజత్వం కోసం అంటూ దాన్ని సమర్థించుకుంటున్న హన్సిక మీద కోలీవుడ్‌లో జోకులు వేసుకుంటున్నారు.



క్రనెప్పల చెరసాల దాటి
నిద్రపిట్ట వేకువలోకి ఎగిరిపోయిన వేళ
చిక్కనిరాత్రి చీకటి నల్లని సిరాగా మారి,
చిత్తం జల్లెడపై జారి,
గుప్పెడు అక్షరాలుగా మారుతుంటే
కలలుగా కలియదిరుగుతూ దిగులు ఛాయలు

## రేయి చిట్లి వేకువై...

నేపథ్యంలో ఊగిసలాడుతున్నాయి.
విముక్తి కోరి బంధిత భావాలు
కన్నీటి బొట్లుగా రాలిపోతున్నాయి.
ప్రశ్నలేగానీ జవాబుల్లేని తక్కెడ
ఓ పక్కగా ఒరిగిపోతుంటే
చెత్తబుట్ట నాజూకు ఆలోచనలతో నిండిపోయింది.
ఇక్కడ... ఇప్పుడు...
జప్తు అయిన జీవితాన్ని
విముక్తం చేయాలంటే
బాకీపడ్డ కాలశకలాల్ని చెల్లించాల్సిందే!
ఇక్కడ.... ఇప్పుడు...
అగ్నిపునీత అక్షరాలు



ఆకృతి దాల్చాలంటే
దహించే ఆలోచనల క్రతువు జరగాల్సిందే!
సృజనకి ముందు పురిటి వేదన అనుభవించాల్సిందే!

**-మల్లారెడ్డి మురళీమోహన్**
**సెల్: 88611 84899**

ఉధృతం చేసే ఆలోచనతో ఊరి ప్రజలందరం ఒకచోట సమావేశమయ్యాం.

కోట్లు ఖరీదుచేసే ఆభూమిని మనమే స్వాధీన పరచుకుని, ప్రజలకి ఉపయోగపడేలా ఒక హాస్పిటల్, కాలేజీ ఏర్పాటు చేసుకోవాలని నేను చెప్పగానే, వచ్చే ఎన్నికల్లో పోటీ చేయాలని కొందరు నాకు సూచించారు. రాజకీయాలంటే నాకు తగని చికాకు. నాయకుణ్ణి అవ్వాలనే ఆలోచన అస్సలులేదు! ఆ విషయమే చెప్పి "కలిసికట్టుగా అందరం కృషిచేస్తే మనమే మన ఊరు అభివృద్ధి చేసుకోవచ్చు, దానికి రాజకీయాల అవసరం లేదు" అని వివరించాను. నామాట అంగీకరించి, కలిసికట్టుగా మద్దతు ఇస్తామని అంగీకరించే వాళ్ళంతా లేచి నిలబడి ప్రమాణం చేస్తున్నట్టుగా ఒకచేయి ముందుకు జాచమని కోరాను. అందరూ లేచి నిలబడి అలా చేశారు. ఒక పెద్దాయన మాత్రం లేవలేదు సరికదా, లేచి నిలబడి ఏదో చెప్పబోతున్న పిల్లాణ్ణి 'నీకెందుకూ?" అంటూ వెనక్కిలాగటం నా కళ్ళబడింది. 'నీకెందుకూ...' అనే మాట నాకు ఆవేశం కలిగించింది.

తల్లిదండ్రులు, గురువు, వైద్యుడు... వీళ్ళని మనపెద్దలు దైవసమానులుగా పేర్కొన్నారు. అయినాసరే, వాళ్ళ మాటల్లో, ప్రవర్తనలో మనకు అర్థంకాని, నచ్చని విషయాలు ఎత్తిచూపటం, ప్రశ్నించటం నా ఉద్దేశంలో తప్పుకాదు.

"ఏం తాతా ఆ అబ్బాయేదో చెప్పబోతుంటే ఆపుతున్నావెందుకు?" దగ్గరకెళ్ళి అడిగాను.

'పదోతరగతి చదువుతున్న బుడ్డోడు. పెద్ద చదువు చదివినవాడివి. నీకేదో చెప్పటం ఏమిటంటున్నాను బాబూ" అన్నాడు.

"అందరూ నా మాటే వినాలనుకోవటంలేదు. నేనేం నాయకుణ్ణికాదు. నేను మీలో ఒకణ్ణి. మనందరం కలిసికట్టుగా నిర్ణయం తీసుకోవాలి. అందుకే ఎవరేంచెప్పినావిని, ఎలా పోరాటం చేయాలో, మనఊరు బాగుచేసుకోవటానికి ఏం చేయాలో నిర్ణయించుకుందాం. అందుకేగా అందరం ఇక్కడ చేరాం. దీపాన్ని పెద్దలు పట్టుకున్నా, పిల్లలు పట్టుకున్నా వెలుగులో తేడా ఉండదు! మంచి మాటలు పిల్లలు చెప్పినా వినిపించుకోవాలన్నారు, అవునా?" అన్నాను.

అతను నావైపు అభిమానంగా చూస్తూ నా మాటలు నిజమేనని అంగీకరిస్తున్నట్లు తల ఊపాడు.

నువ్వు చెప్పాలనుకున్నదేమిటని పిల్లాణ్ణి అడిగాను.

"మనఊరునుండి లంచం తీసుకోవటమనే అవినీతి రాక్షసిని తరిమికొట్టాలి! ఒక సర్టిఫికెట్ కోసం లంచమివ్వలేదని ఏవో వంకలుచెబుతూ ఎంత విసిగించారో చెప్పలేను. పేదవాళ్ళమని తెలిసీ, మమ్మల్ని డబ్బు అడగటం తప్పు కదన్నా..." టకటకా చెప్పాడు.

"చాలా మంచిమాట చెప్పావు" అభినందనగా నేను అనగానే అందరూ చప్పట్లు కొట్టారు.

"అవినీతిని తరిమికొడితే, అభివృద్ధి దానంతట అదే జరుగుతుంది. ఆ మధ్య పేపరులో చదివాను. ఒక ఊళ్ళో వాళ్ళందరూకలిసి వరకట్నాలు ఇవ్వకూడదు, తీసుకోకూడదని నిర్ణయించుకుని అమలు జరిపారు. తమది వరకట్నరహిత గ్రామమని సగర్వంగా ప్రకటించుకున్నారు. మద్యపానం ఉండకూడదని మరోగ్రామం తీర్మానించింది. ఆ తీర్మానం అమలుచేసి తమది మద్యపానరహిత గ్రామమని ఆనందంగా ప్రకటించుకున్నారట! మనం కూడా లంచం ఇవ్వటం, తీసుకోవటం నేరం అనే చట్టం నిజాయితీగా పాటించి, మన ఊరునూ అవినీతి అడుగుపెట్టలేని గ్రామంగా ప్రకటించుకోగలిగే రోజుకోసం శ్రమిద్దాం!" అని నేను అనగానే అందరూ మళ్ళీ చప్పట్లు కొట్టారు.

అప్పుడు ఆ పెద్దాయన్ని అడిగాను. "ఏం తాతా.. నా మాటలు నువ్వెందుకు అంగీకరించలేదు. నీకు నచ్చలేదా..?"

అతను తను కప్పుకున్న దుప్పటి తొలగించి, "నాకు ప్రమాదంలో ఒక కాలూ, చెయ్యీ పోయాయయ్యా! నలుగురిలోకీ రావటం ఎప్పుడో మానుకున్నాను. కానీ మన ఊరి పిల్లలు మీరు, ఈ మంచిపనికి నేనూ నా గొంతు కలిపి, మద్దతు తెలిపి ఆశీర్వదించాలనే ఆశ కలిగి ఇక్కడికి వచ్చాను. నా కొడుక్కి చెబితే, తీసుకొచ్చి ఇక్కడ కూర్చోబెట్టాడు..!" రుద్ధ కంఠంతో అన్నాడు.

ఆ మాటలకు నా మనసు పులకించిపోయింది! కళ్ళు చెమ్మగిల్లాయి!

"తాతా... ఇంత గొప్ప మనసున్న మీలాంటి పెద్దలంతా మాకు వెన్నుదన్నుగా నిలబడితే.. మేం ఏదైనా సాధిస్తాం...!" ఆత్మవిశ్వాసంతో ఆనందంగా అన్నాను.

అవును, ఊరివాళ్ళందరం ఒక్కటై కృషిచేస్తే అనుకున్నది సాధిస్తాం..."

మా ఊరి పేరు ఆనందపురం! సార్థక నామధేయ గ్రామంగా మేం చెప్పుకునే రోజు వస్తుందనే నమ్మకం నాకుంది!.

**సెల్: 94907 53335**



# సెక్సో క్లాక్!

కూడు, గూడు, గుడ్డ తర్వాత మనిషి ప్రాధాన్య మిచ్చేది తిండి, నిద్ర, సెక్స్‌కే. ప్రస్తుతకాలంలో ఈ మూడింటికీ టైమింగ్స్ లేవు. గతంలో సంప్రదాయ బద్ధంగా, నియమబద్ధంగా ఉమ్మడికుటుంబాల్లో ఈ దినచర్యలన్నింటినీ వయసుకు అనుగుణంగా క్రమ పద్ధతిలో పాటించేట్టు తర్ఫీదు ఇచ్చేవారు. ఇప్పుడా అవకాశం, అనుకూలత సమాజానికి లేదు. ప్రస్తుత అలవాట్లకు అనుగుణంగా సెక్స్ టైమింగ్స్ విషయంపై బ్రిటన్‌లో రెండువేలమందిని ఎంపికచేసి అధ్యయనం చేశారు. వారి వారి అవకాశాన్నిబట్టి సెక్స్‌లో పాల్గొనే టైమింగ్స్ పరిశీలించారు. వీరిలో ప్రతి పది మందిలోనూ ఎనిమిదిమంది వారాంతంలో ఒకే సెక్స్ టైమింగ్స్ పాటిస్తున్నట్లు చెప్పారు. వాటినే బెస్ట్ టైమింగ్స్‌గా అధ్యయనవేత్తలు పేర్కొన్నారు.

విశ్రాంతిరోజుల్లో (సబ్బాత్) అంటే శనివారం, ఆదివారాల్లో వీరు ఎక్కువ సెక్స్‌లో పాల్గొంటున్నారు. సెక్స్‌లో పాల్గొనేందుకు ఆదివారం ఉదయం తొమ్మిది



గంటల సమయం సెక్స్ సంబంధాలకు అత్యంత అనుకూలమైనదని ఎక్కువమంది ఆ సమయమే ఎంచుకున్నారని వెల్లడించారు. మంగళవారం రాత్రి తొమ్మిదిగంటల సమయం సెక్స్‌కి అత్యంత మనోహరమైనదని అధ్యయనవేత్తలు పేర్కొంటున్నారు. అయితే ఆదివారంకంటే శనివారం ఉదయం 10.30, 11.30, శనివారం రాత్రి 9.30, 11.15, 11.30 ఆదివారం రాత్రి 9.30 సమయాలు టాప్ స్లాట్స్‌గా పేర్కొంటున్నారు. శుక్రవారం రాత్రి 10.30 సమయం కూడా మోస్ట్ పాపులర్ టైమింగ్‌గా, టాప్ ఫేవరెట్ టైమింగ్‌గా అధ్యయనం పేర్కొంది.

శీతాకాలాన్ని పదహారుశాతం మంది ఇష్టపడగా, వసంత రుతువును 14 శాతం మంది, వేసవికాలాన్ని నాలుగుశాతంమంది సెక్సీయస్ట్ సీజన్‌గా పేర్కొన్నారు. ఫోర్‌ప్లేకి ముందు మద్యం సేవిస్తామని 22 శాతం మంది చెప్పారు. దీర్ఘకాలిక లైంగిక సంబంధాలున్నవారు రోబోటిక్ తరహాలో సెక్స్ చేస్తే బోరింగ్, రొటీన్ ఫీలవుతారని, పైన పేర్కొన్న టైమింగ్స్ ట్రై చెయ్యాలనీ హైస్ట్రీట్ కెమిస్ట్, సెక్స్ ఎడ్యుకేటర్ అలిక్స్ ఫాక్స్ సలహా ఇస్తున్నారు. పైన పేర్కొన్న పాపులర్ టైమింగ్స్ కనుక పాటిస్తే రిలాక్సేషన్‌కి కావాల్సినంత సమయం దొరుకుతుందని ఆమె అంటున్నారు.

నవ్య






**ఆమె గెలిచిందా? ఓడిందా?**

(నవలిక)

రచన: గంటి భానుమతి
ధర: 100 రూ.
పేజీలు: 97
ప్రతులకు: గంటి భానుమతి, మల్లాపూర్, హైదరాబాద్- 599 076.
ఫోన్: 040- 27151439, సెల్: 8897 643 009
మరియు అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

తన కూతురి ఆలోచనారహిత ప్రవర్తన, బంధాలు, ప్రేమలకు అర్థం తెలియని అవగాహనాలేమి, ఆలోచనారాహిత్యం పట్ల ఒక తల్లి పడే ఆవేదన, భావాల సంగమమే ఆమె గెలిచిందా? ఓడిందా? నవలిక. జీవిత చదరంగంలో గెలుపోటములు, ఈర్ష్యాద్వేషాలు సర్వసాధారణం. కానీ దాంపత్య జీవితంలో అవి శ్రుతిమించితే, ఆ జీవితం నరకప్రాయమే! నంటూ తనదైన శైలిలో కళ్ళకు కట్టారు గంటి భానుమతి. నేటి యువజంటలు తప్పక చదవవలసిన మినీ నవల ఇది.

**ఆయుధం** (నవల)

రచయిత: టి.ఎస్.ఏ. కృష్ణమూర్తి
ధర: 180, పేజీలు: 264
ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రములు,
టి.ఎస్.ఏ. కృష్ణమూర్తి
3-169-16 రామారావు కాలనీ
బాపూజీ మునిసిపల్ స్కూల్ ఏరియా.
మదనపల్లె, చిత్తూరు జిల్లా - 517 325
ఫోన్: 08571-221963, సెల్: 93472 98942

సమాజంలో మార్పుకోసం, స్వేచ్ఛకోసం, అస్తిత్వం కోసం ఎన్నో పోరాటాలు జరిగాయి. విప్లవవాదాలు పుట్టుకొచ్చాయి. వాటిని సాధించటానికి కొందరు హింసను ఆయుధంగా చేసుకుంటే, మరికొందరు అహింసా మార్గాన్ని ఎంచుకున్నారు.



మరి ఈ నవల్లో రాజయ్య దేనికోసం పోరాడాడో, అందుకు ఎలాంటి ఆయుధాన్ని ఎంచుకున్నాడో, నవల చదివి తెలుసుకోవాల్సిందే! చక్కని భావ వ్యక్తీకరణతో వంద సంవత్సరాల నాటి పరిస్థితులను, ఆనాటి సామాజిక సమస్యలను కళ్ళకు కట్టినట్టుగా ఆవిష్కరించారు రచయిత టి.ఎస్.ఏ. కృష్ణమూర్తి. ఆద్యంతం ఆసక్తికరంగా మలచారు.



**మనోధర్మం** (కథల సంపుటి)

రచయిత: ఇందూ రమణ
ధర: 180
పేజీలు: 238
ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని బ్రాంచీలలో
ప్రచురణ: శ్రీ లోగిశ ప్రచురణలు
డోర్‌నెం. 7-50, శ్రీ సాయి నిలయం,
నియర్ బంగారమ్మ టెంపుల్,
సింహాచలం, విశాఖపట్నం- 530 028
సెల్: 9951171696.

జీవనగమనంలో ఎదురయ్యే సున్నిత అంశాలను కథావస్తువులుగా తీసుకొని, వాటికి కొంత హాస్యచతురతను మేళవించి కథలుగా మలిచారు రచయిత ఇందారమణ. 24 కథలూ పాఠకులను రంజింపచేసేవే. ఒకదానికొకటి పొంతన లేకుండా నవరసాల మేలు కలయికతో అందంగా పేర్చి కూర్చిన కథలు ఇవన్నీ. కథలన్నీ కూడా ఏదో ఒక వార, మాసపత్రికలలో ప్రచురించబడినవే. వాటన్నింటినీ ఏర్చికూర్చి కథాసంపుటిగా మన ముందుకు తీసుకువచ్చారు రచయిత ఇందూ రమణ. పాఠకుల మనసులను హత్తుకుంటాయనడంలో ఎటువంటి సందేహం లేదు.

**రెక్కలొచ్చాయి** (కథా సంపుటి)

రచన: సి. యమున
ధర: 100, పేజీలు: 160
ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు
ప్రచురణ: వనవాసి ప్రచురణలు
గాంధీనగర్- హైదరాబాద్
సెల్: 95504 45911.

'ప్రేమంటే' ఏమిటో, ఆ పాత 'స్మృతి మధురాలు' ఎంత మధురమైనవో, మనల్ని మనం 'అద్దం'లో తరచి చూసుకునే విధంగా 'మనసుకు రంగులు' అద్దిన కథాసంపుటి 'రెక్కలొచ్చాయి'. ఓ పువ్వునీ, ఓ పావురాయినీ కథా వస్తువులుగా తీసుకుని 'కొత్తకోణం'లో పాతకులపై తనదైన 'ముద్ర' వేశారు రచయిత్రి.



ఈ సంపుటిలోని 18 కథలూ దేనికదే అన్నట్టుగా 'మనోహరం'గా మనసు లోతుల్లోకి తరచి చూసేవిధంగా మలచినవే. మనచుట్టూ జరిగే విషయాలు, మనం చిన్నవిగా భావించే అంశాలను తీసుకుని కథలుగా మలచి, చక్కని భావవ్యక్తీకరణతో పాఠకులముందుకు కథాసంపుటిగా తీసుకువచ్చారు యమున.

**- లక్ష్మీ నర్మద**

**సాయంత్రం ఏడవుతోంది.**

**అప్పుడే చీకటి పడుతోంది.**

**ఆ ప్రాంతపు గైడ్‌తో కలిసి నిమ్తలాఘాట్ చేరుకున్నాడు అక్షయ్.**

**అక్కడ ఉన్న శివాలయంలోకి తీసుకెళ్ళాడు గైడ్.**

**భూతనాథుడి దర్శనం చేసుకుంటే అక్షయ్ సంకల్పం నెరవేరుతుందని నమ్మబలికాడతను.**

గంగానది ఒడ్డున అక్కడక్కడ శవాలు కాలుతున్నాయి.

మంటలు పైకి లేస్తున్నాయి.

ఒకపక్క ఎలక్ట్రికల్ క్రిమెటోరియమ్ కనబడుతోంది. పొల్యూషన్ తగ్గటానికి ఫర్నేస్‌లు ఏర్పాటు చేశారట అక్కడ.

విషాదమైన మొహాలతో అక్కడక్కడ కాలుతున్న శవాలకు సంబంధించిన వాళ్లు కనబడుతున్నారు. వాళ్లు కూడా అక్కడ నుంచి తొందరగా తప్పుకోవాలనే ప్రయత్నంలో ఉన్నట్లున్నారు. ఎవరో తరుముతున్నట్లుగా ఉన్నాయి వాళ్ల మొహాలు.

నది ఒడ్డున ముందుకు నడుస్తున్నారు.

వర్షం మొదలైంది.

"చూశారా? అయినా శవాలు కాలటం ఆగలేదు. ఇక్కడ ఆత్మలు సంచరిస్తాయి. అందుకే వర్షం నీటికి కూడా అవి ఆరటం లేదు" అన్నాడు గైడ్.

'పడింది నాలుగు చినుకులు. దానికే ఆగుతాయా?" విసుగ్గా అన్నాడు అక్షయ్.

"రోజూ ఎంతమందిని కాలుస్తారిక్కడ?" అడిగాడు అక్షయ్.

"ముప్ఫయి నుంచి డెబ్బై మందిని" చెప్పాడు గైడ్.

"రవీంద్రనాథ్‌టాగూర్‌కి కూడా ఇక్కడే అంతిమక్రియలు నిర్వహించారు" ఉత్సాహంగా చెప్పాడు.

"మరి అటువంటి పవిత్రమైన ప్రదేశంలో ఆత్మలు ఉంటాయంటావేమిటి?" అడిగాడు అక్షయ్.

బుర్రగోక్కున్నాడు గైడ్.

చకచకా నడుస్తున్నారు.

కాళ్ల కింద ఇసుక కదులుతోంది.

ఎండిన పుల్లలు కాళ్ల కింద పడి విరుగుతున్నాయి.

సడన్‌గా కెవ్వుమని అరిచాడు గైడ్.

ఉలిక్కిపడ్డాడు అక్షయ్.

'ఏమైంది?' అడిగాడు.

### జరిగిన కథ

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోతారు. ఇక తనకు మిగిలిన ఒకే ఒక బంధం నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచాలనుకుంటాడు అక్షయ్. అకస్మాత్తుగా నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ కంప్లయింట్ ఇస్తాడు అక్షయ్. ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన వెబ్‌సైట్ లింక్ ద్వారా ఆన్‌లైన్‌లో రన్ అవుతున్న ప్రాస్టిట్యూట్ రింగ్‌వారిని కాంటాక్ట్ చేస్తాడు. టీవీ ఛానల్ ద్వారా స్టింగ్ ఆపరేషన్ చేసి, వాళ్లను అరెస్టు చేయిస్తాడు అక్షయ్. కానీ నైరా జాడ మాత్రం దొరకదు. పేపర్లో వచ్చిన ఓ వార్త ఆధారంగా పసిపిల్లలను బలిచేసేవారిని వెతుకుతూ కలకత్తా వెళతాడు. అక్కడ అతనికి ఓ గైడ్ తారసపడి, అఘోరాల దగ్గరకి తీసుకువెళతానంటాడు. **ఆ తర్వాత...**

"నా పక్కనే ఎవరో ఉన్నట్లనిపించింది, వీపు మీద తట్టినట్లయింది!"

"అంతా నీ అనుమానం" కొట్టి పారేశాడు అక్షయ్. భయపడుతున్నాడని మాటల్లో పెట్టాడతన్ని.

"మీ తమ్ముడు ఇక్కడ కనపడితే?" అడిగాడు.

"గుర్తుపడతానో, లేదో కూడా అనుమానమే! అసలిప్పటివరకు ఎవరూ వాడు కనబడ్డాడని చెప్పలేదు. ఏమైపోయాడో?" నిట్టూర్చాడు.

సరిగ్గా అప్పుడే ఒక గబ్బిలం శబ్దం చేస్తూ వాళ్ళ తలల మీదుగా వెళ్ళింది.

ఏడ్చినంత పనిచేశాడు గైడ్.

"అనవసరంగా ఏదో సహాయం చేద్దామని, నాలుగు డబ్బులొస్తాయని వచ్చాను. కానీ ప్రాణాలు పోగొట్టుకునేట్లున్నాను" గొణుక్కుంటున్నాడతను.





# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

11

- కంఠంనేని స్వప్న



అక్కడికి వచ్చేముందు అక్షయ్ ఆ ఏరియా డి.ఎస్.పి.ని కలిసి వచ్చాడు. తన బెంగాలీ కొలీగ్‌కి కాబోయే భార్యట ఆమె. అక్కడ ఎటువంటి సంఘ విద్రోహక చర్యలు జరుగుతున్నా ఒక్క రింగ్ ఇస్తే చాలు... తమ వాళ్ల అక్కడుంటారని మాటిచ్చిం దామె.

ఒళ్లు గగుర్పొడిచేలా మళ్లీ అరిచాడు గైడ్.

కాలు కింద ఏదో మెత్తగా తగిలిందట.

దూరంగా కిచకిచమంటూ పరిగెడుతున్న ఎలకని చూసి గాని శాంతించలేదు.

"నీ భయం ఏమోగానీ, నీ అరుపులకి, అఘోరా బాబాలు కూడా గుండె పగిలి చస్తారు" విసుగ్గా అన్నాడు అక్షయ్.

పక్కనే కాలుతున్న శవం నుంచి టప్పున శబ్దం వచ్చింది.

భోరున ఏడవటం మొదలెట్టాడతను.

"నేనింక వెళ్లిపోతాను. అలా ముందుకెళ్తూ ఉండండి. వాళ్లే కనబడతారు. చూడగానే తేడాగా అనిపిస్తారు. మీకే అర్థమవుతుంది".

డబ్బులు తీసుకుని వెనక్కు తిరిగాడు.

"మాటల్లో చాలా దూరం వచ్చేశాం. ఒక్క డినీ వెనక్కి వెళ్ళలేను. మీతోనే వస్తాను" గబ గబా మళ్లీ పక్కనే నడుస్తూ అన్నాడు.

"వస్తేరా, కానీ ఊరికే ఏడ్చి గొడవచేయకు" చెప్పాడు అక్షయ్.

దాదాపు నిర్మానుష్యంగా మారిందా ప్రదేశం.

ఒక పక్కగా కూర్చుని ఎదురు చూడటం మొదలెట్టారు.

దాదాపు అర్ధరాత్రవుతుండగా ఆ ప్రాంతంలో మళ్లీ కదలికలు మొదలయ్యాయి.

ఒళ్లంతా బూడిద పూసుకుని, జుట్టు అట్టలు కట్టిన వారు ఒక్కొక్కళ్లుగా చేరుకుంటున్నారు. చిన్న బట్టని మాత్రమే ఒంటికి చుట్టుకున్నారు. మెడలకీ, చేతులకీ ఎముకలతో చేసిన ఆభరణాలున్నాయి.

"వాళ్లు స్నానాలు అవీ చేయరు. ఒంటిని శుభ్రం చేసుకోవడమంటే తన ఒంటిని ప్రేమించ డమేనని వాళ్ల ఉద్దేశం. దానికి వాళ్లు వ్యతిరేకం" ముక్కుమూసుకుంటూ గుసగుసగా అన్నాడు.

వెలుతురులో నీడలు కనపడో, గుసగుసలు వినబడో ఇటువైపు చూశాడొక బాబా.

వాళ్ల వైపు వచ్చాడు.

వేలు చూపిస్తూ హెచ్చరించాడు.

"వెళ్లిపొండి. ఆత్మలు సంచరించే టైమ్ ఇది. మామూలు మనుష్యులు ఇక్కడుంటే ప్రమాదకరం".

గుండెలు అవిసిపోయాయి అక్షయ్‌తో ఉన్న గైడ్‌కి.

నోట మాటలేకుండా గుడ్లప్పగించి చూడ సాగాడు.

అక్షయ్ లేచి నిలబడ్డాడు.

"మీ మీద డాక్యుమెంటరీ.." చెప్తున్నాడు.

గట్టిగా నవ్వాడు అఘోరా బాబా.

"మీరు వెతుకుతున్నది ఇక్కడ దొరకదు. వెళ్ళి పోండి!" నిర్లక్ష్యంగా అన్నాడు.

మళ్లీతాను అంతకుముందున్న ప్రదేశానికి వెళ్ళి నెగడు రాజేశాడు.

ఏవో మంత్రాలు జపిస్తున్నాడు.

మరో ఇద్దరు అతనివద్ద చేరారు.

కాసేపటి తర్వాత వాళ్లు తమవైపు చూపించి ఏదో చెప్పుకోవటం కనబడింది అక్షయ్‌కి.

గైడ్ అక్షయ్‌కి బల్లిలా అతుక్కున్నాడు.

"వదులు! అందరూ నన్ను గే అనుకుంటారు. దూరంగా కూర్చో" విసుక్కున్నాడు అక్షయ్.

కాలిన శవాల నుంచి మాంసం లాగి తినటం కనబడుతోంది.

కడుపులో దేవినట్లయింది అక్షయ్‌కి.

కొద్దిసేపటి తర్వాత ఆ ప్రదేశం సద్దుమణిగింది.

ఎటునుంచి వచ్చినవాళ్లు అటే వెళ్లిపోయారు.

ఊహించినటువంటి బలుల కార్యక్రమాలేవీ



## పబ్లిసిటీ కోసమేనట!

న్యూడ్ ఫోటోలు, న్యూడ్ వీడియోలు పోస్ట్ చేయడం బాలీవుడ్‌లో కొందరు హీరోయిన్లకు అలవాటుగా మారింది. ఈ వేషాలు ఏమిటి అంటే పబ్లిసిటీ అనేయడం ఓ ఫ్యాషన్ అయింది. సరిగ్గా ఇలాంటి మాటలే చెబుతోంది గోవా బ్యూటీ ఇలియానా! ఇటీవల బాత్‌టబ్‌లో నగ్నంగా ఉన్న ఫోటోలను నెట్‌లో పెట్టింది. ఇలియానా ఇలాంటి ఫోటోలు పెట్టిందేమిటి? అన్న అనుమానం చాలా మందికి వచ్చింది. అయితే అదంతా పబ్లిసిటీ కోసమట! ఇటీవలి కాలంలో బాలీవుడ్‌లో అవకాశాలు లేక ఇలియానా గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటోంది. ఇలాంటి ఫోటోలు పెడితే అవకాశాలు వస్తాయనుకుందో ఏమో వెంటనే వాటిని పోస్ట్ చేసింది. కాకపోతే పబ్లిసిటీ పేరుతో ఇలాంటి చీప్ ట్రిక్స్ ప్లేచేయడం ఏమిటి అంటున్నారు బాలీవుడ్ జనాలు.

అక్కడ జరగటం లేదు.

మరికాసేపు వెయిట్‌చేసి లేచి నిలబడ్డారు అక్షయ్, అతనితో ఉన్న గైడ్.

సమయం రాత్రి రెండవుతోంది.

ఇక బయలుదేరి ఆ ప్రదేశం నుంచి వెళ్లిపోదామనుకుంటుండగా మళ్లీ కదలికలు మొదలయ్యాయి. మరింత చీకట్లోకి నక్కారు.

ఈసారి కనబడుతోన్న స్వామీజీలు వేరే తెగకి చెందినవాళ్లలా ఉన్నారు. నల్లటిబట్టలు ధరించి ఉన్నారు. తలకు నలుపురంగు బట్ట చుట్టి ఉంది. మెడలో పూసల దండలు. చేతికి ఉంగరాలు. పొడుగాటి నల్ల తిలకం పెట్టుకుని ఉన్నారు.

వాళ్లతో కొంతమంది మామూలు మనుష్యులు కూడా ఉండటం గమనించాడు అక్షయ్.

చిన్నముగ్గేసి, పూజ జరిపారు.

కోడిని నరికి, ఏవో మంత్రాలు చదువుతున్నారు.

ఆ రక్తాన్ని ముగ్గుచుట్టూ చల్లారు. జుట్టులాంటి పదార్థాలున్న కవర్ ముగ్గులో పెట్టారు.

పిండితో ఒక బొమ్మచేసి, దాన్ని ముగ్గు మధ్యలో ఉంచి, మళ్లీ మంత్రాలు చదువుతున్నారు.

బొమ్మని బయటికి తీసి, ఏవో శాపనార్థాలు పెడుతూ మేకులాంటి దానితో ఆ బొమ్మని ఒళ్లంతా గుచ్చుతున్నారు.

"చేతబడి!" గుసగుసగా అన్నాడు గైడ్.

"వాళ్లు ఎవరి బొమ్మనయితే చిత్రహింసలు పెడుతున్నారో, బయట ఆ వ్యక్తి నరకం చూస్తుంటాడు. అతనికి ఎందుకిలా అవుతుందో డాక్టర్లకు కూడా అంతుబట్టదు" సంబరంగా చెప్పాడు.

"సినిమా పరిజ్ఞానం బాగా వాడావుకానీ ఏమీ ప్రభావం ఉండదు. ఎక్కువలో ఎక్కువ చేతబడి చేయిస్తున్నామనుకుంటున్న వారికి కొద్దిగా మానసికానందం దొరుకుతుందేమో.. స్ట్రెస్ బస్టర్ లాగా" అన్నాడు అక్షయ్.

తన మాట నమ్మట్లేదని ఉడుక్కున్నాడు గైడ్.

చిన్న, చిన్న చేతబడి కార్యక్రమాల తర్వాత చేతబడి కోసం వచ్చినవాళ్లను పంపేశారా మంత్రగాళ్ళు.

పెద్ద ముగ్గువేసి అందరూ దానిచుట్టూ కూర్చుని మంత్రాలు జపిస్తున్నారు.

కాళీమాత విగ్రహం కనబడుతోంది.

మెడనిండా పుర్రెలతో, రక్తంతో తడిచిన నాలుక బయటికి జాపి భయంకరంగా కనబడుతోంది.

దగ్గర్లో చిన్న మారుతీ వ్యాన్ ఆగింది.

ఇద్దరు పిల్లల్ని ఈడ్చుకుంటూ లాక్కొస్తున్నారు.

చేతులు కట్టేసి ఉన్నాయి. వాళ్ళు భోరున ఏడుస్తూ వదిలించుకోవటానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు.

కళ్లు చిట్లించి చూశాడు అక్షయ్.

నైరా లేదు వాళ్లలో.

"ఆ వాతావరణం తమలాంటి పెద్దవాళ్లకే భయాన్ని కలిగిస్తోంది. ఆ పిల్లలు ఎంత భయపడుతున్నారో!" అక్షయ్‌కి బాధగా ఉంది.

పిల్లల్ని ఈడ్చుకెళ్ళి కాళీమాత విగ్రహం ముందు కూర్చోబెట్టారు.

బలవంతంగా మెడ వంచి పట్టుకున్నాడొకడు.

మరొకడు వేటు వేయటానికి సిద్ధమవుతున్నాడు.

అక్షయ్ రియాక్టవబోయే లోపు జరిగిందా సంఘటన.

గైడ్ పెద్దగా అరుస్తూ వాళ్లమీదకు దూకాడు.

అతనిలోని ఫాదర్ ఇన్‌స్టింక్ట్ నిద్రలేచినట్లుంది.

అక్షయ్ అతనితో కలిశాడు.

ఎక్కడనుంచి వచ్చారో ఇద్దరు అఘోరా బాబాలు సైతం అక్షయ్ వాళ్లకి తోడయ్యారు.

కాసేపట్లోనే నల్లడ్రెస్సుల బాబాలు తోక ముడిచారు.

అప్పటికే సమాచారం అందిన పోలీసులు అక్కడికి చేరుకుని వాళ్లందరినీ అరెస్ట్‌చేసి తీసుకెళ్ళారు.

అఘోరా బాబా చెప్పటం మొదలెట్టాడు.

"మనదేశం మొత్తం మీద పదిహేను, పదహారుమందికి మించి అఘోరాలు లేరు. చాలామంది అఘోరాలమనీ, మధ్యలో వెనక్కొచ్చి మళ్లీ మనుషుల్లో కలిశామని చెప్పేవాళ్లంతా టెస్టుల్లో ఫెయిలయిన అఘోరాలు!

"మీ భాషలో చెప్పాలంటే ఐ.ఎ.ఎస్‌కి ప్రిపేరవుతున్నారని చెప్పుకునే మన చుట్టుపక్కల ఇళ్లల్లో ఉండే పిల్లలు, ప్రిపేర్ అవుతున్న సమయంలో, వాళ్లు ఐ.ఎ.ఎస్ అయినట్లే ఫీలవుతారు. మనమూ వాళ్ల గురించి గొప్పగా భావిస్తాము. ఎన్నాళ్ళున్నా అది పూర్తవదు. మనం కూడా కొన్నాళ్లకి ఆ విషయం మర్చిపోతాము".

"అఘోరాలు ఎవరికీ హానిచేయరు. ఒకరిని బలి ఇవ్వరు. కాలిన శవాలను అసహ్యించుకోకుండా తినడమనేది టెస్ట్‌లో ఒక భాగం లాంటిదే! శవాలంటే మనం భయపడతాము. అటువంటిది వాటిని తినటానికి ఎంతో గుండెదిటవు కావాలి".

"అఘోరాలని చెప్పుకుని చిన్న చిన్న మాయలు ప్రదర్శించి స్వార్థప్రయోజనాల కోసం నిధులనీ, శక్తులనీ ప్రజల్ని ప్రలోభ పెడుతుంటారు కొంతమంది. నరబలి ఇస్తే కాళీమాత సంతోషించి శక్తులు ప్రసాదిస్తుందనీ, నిధులు ఎక్కడ ఉన్నాయో చెప్తుందనీ, ఇలా ఎన్నో అపోహలు కల్పిస్తారు వీళ్లు.

ఆశ్చర్యంగా వింటున్నారు అక్షయ్, గైడ్.

అక్షయ్ అడిగాడు.

"మీకు నిజంగా మహిమలుంటాయా?"

**చీకట్లు ముసురుతున్నవేళ గైడ్‌తో కలిసి నిమ్మలాఘాట్‌కి చేరుకున్నాడు అక్షయ్. ఇద్దరూ కలిసి నది ఒడ్డున నడుస్తున్నారు. క్రమంగా జనసంచారం తగ్గింది. కాలుతున్న శవాలు, గబ్బిలాల అరుపులు తప్ప ఏవిధమైన శబ్దం లేదు. ఆ నిశ్శబ్ద వాతావరణానికి గైడ్ వణికిపోసాగాడు. ఇద్దరూ ఒకపక్కన నక్కి కూర్చుని ఎవరికోసమో ఎదురుచూస్తున్నారు. వారు ఎవరికోసం ఎదురుచూస్తున్నారు?**

"అది మీ ఊహకి వదిలేస్తున్నా?" తన పక్కనున్న అఘోరా వైపు చూస్తూ నవ్వి అన్నాడు బాబా.

"నేను నా మేనకోడలి కోసం వెతుకుతున్నాను. ఎప్పుడు దొరుకుతుందో, ఎలావుందో చెప్తారా?" అడిగాడు అక్షయ్. అతను మాయల్నీ, మంత్రాల్నీ నమ్మకపోయినప్పటికీ ఏ పుట్టలో ఏ పాముందోనని దేనినీ వదిలిపెట్టదల్చుకోలేదు.

"భవిష్యత్తులోకి తొంగి చూడాలనుకోవటం

తప్పు. జీవితం మనకి అందించే సవాళ్లని అధిగమిస్తూ, జీవితాన్ని అన్వేషిస్తూ పోవాలి. భవిష్యత్తు ముందే తెలిసిపోతే మానసికంగా కుంగిపోతాం. లేదా అంతా బాగుందనిపిస్తే మొద్దుబారిపోతాం. సోమరితనంగా తయారవుతాం. నీ వల్ల మంచి జరగాల్సి ఉంది. నీ ప్రయత్నం నువ్వు చెయ్యి" చెప్పాడు అఘోరా బాబా.

'నీ బొంద! తెలివిగా చెప్పావు. రేపు ఏది ఎటుజరిగినా, నేను ఆరోజే చెప్పానని వాదించుకోవటానికి అనువుగా' గొణుక్కున్నాడు అక్షయ్.

తమ కృతజ్ఞతలు చెప్పాక వాళ్లు వెళ్లిపోతుండగా అడిగాడు గైడ్.

"ఇంతకీ మాకెందుకు సహాయం చేయాలనిపించింది?"

ఒక సెకండ్ ఆగిపోయాడు వాళ్లలో ఒక అఘోరా.

వెనక్కి తిరిగి నవ్వాడు.

"అమ్మనీ, నాన్ననీ, వదిననీ, పిల్లల్నీ అడిగానని చెప్పు" అన్నాడు.

మరుక్షణం చీకట్లో కలిసిపోయారు.

గైడ్ నమ్మలేనట్లుగా అక్షయ్‌వైపు చూశాడు.

"నువ్వూ అదే విన్నావా?" అపనమ్మకంగా అడిగాడు.

"నీతో వచ్చినందుకు తిట్టుకున్నాను కానీ ఇద్దరు పిల్లల్ని కాపాడగలిగాం. నా తమ్ముణ్ణి చూడగలిగాను" సంతోషంతో వెక్కెక్కి ఏడుస్తున్నాడతను.

●●●

నిరాశతో వెనక్కు తిరిగొచ్చాడు అక్షయ్.

తాము రక్షించిన పిల్లల తల్లిదండ్రులు సంతోషంలో తమకి పూజలు చేసినంత పనిచేశారు.

"వాళ్లని కాపాడినందుకు తనకీ సంతోషంగానే ఉంది. కానీ, మరి నైరాని కాపాడేదెవరు?"

ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ నుండి ఫోన్ వచ్చిందప్పుడు.

"కొంచెం ప్రోగ్రెస్ కనబడుతోంది" చెప్పాడతను.

"కనెక్టింగ్ రోడ్స్ సీసీ పుటేజెస్ పరిశీలిస్తే ఆ టైమ్‌లో రెండు మూడు వాహనాలే తిరిగినట్టు తెలుస్తోంది. వారి వివరాలన్నీ మేము చెక్‌చేస్తున్నాం. త్వరలోనే పురోగతి ఉంటుందనుకుంటున్నాను".

"ఫైనల్లీ...!" అన్నాడు అక్షయ్.

అతని స్వరంలో వెటకారం ధ్వనించిందేమో శ్రీకాంత్ అన్నాడు "ఇది మీ ఐటీ కాదు, అన్నీ నిమిషాలమీద జరిగిపోవటానికి! ప్రతిదానికీ ప్రొసీజర్, చాలా లెవెల్స్‌లో అప్రూవల్స్ తెచ్చుకోవాల్సి ఉంటుంది".

"ఐ అండర్‌స్టాండ్! నా అన్వేషణ నేను కొనసాగిస్తున్నాను. ఏ కొంచెం క్లూ దొరికినా నాకు ఫోన్ చేయండి" అన్నాడు అక్షయ్.

●●●

'ఆ రోజు ఫ్రస్ట్రేషన్‌లో మెసేజ్ ఇవ్వొద్దన్నాను. అంతమాత్రాన మానేస్తుందా?' ఫోన్‌వేపు చూస్తూ అనుకున్నాడు హర్ష.

'ఒకవేళ ఫోన్ ప్రాబ్లమ్ ఏమో!'

ఫోన్ రీస్టార్ట్‌చేసి చూశాడు.

"అయినా తన పిచ్చిగానీ ఫోన్ ప్రాబ్లమ్ అయితే ఎవరి మెసేజెస్ రాకూడదు కదా! మిగతా వాళ్ల నుంచి వస్తున్నాయి. తనవి వాళ్లకి డెలివర్ అవుతున్నాయి."

ఫోన్ ఊపి చూశాడు, అతనికే నవ్వొచ్చింది.

'ఇదేమైనా పెన్‌లో రీఫిలా, లేకపోతే రిమోట్ కంట్రోలా? ఊపితే మెసేజెస్ రావటానికి.'

మాటిమాటికీ ఫోన్ ఆన్‌చేసి చూస్తున్నాడు.

'రానివాటికోసం ఎదురుచూసి పిచ్చెక్కినట్లుంది. ఆ టైమ్‌లో వేరే ఎవరు మెసేజ్ చేసినా చెంప చెళ్లుమనిపించాలనిపిస్తోంది.'

'అదే అలవాటయిపోతుందిలే' అని తనకి తానే సర్ది చెప్పుకున్నాడు మళ్లీ.

'ఫోన్ ఆన్‌లో పెడితే అదే పనిగా చెక్ చేస్తున్నాడు తను. ఆఫ్ చేసేయాలి' ఎటూ ఆఫ్‌లో ఉంటుంది కాబట్టి ఎదురుచూడటం తగ్గిపోతుంది. తనవైపునుంచి ఎదురు చూడకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడు.

ఫోన్ ఆఫ్ చేశాడు.

## మనమీదేనర్రోయ్!

సరసి





రెండు గంటలు గడిచాయి.

"బాగా అయింది. మెసేజ్ చేస్తే ఎందుకు డెలివర్ అవలేదో అర్థం కాక చచ్చిపోతుంది" అనుకున్నాడు.

అతని డెస్క్ ఫోన్‌కి ఫోన్ వచ్చిందప్పుడే!

అతని బాస్! ఏదో అర్జంట్ పని ఉండి సి.ఇ.ఓతో ఉన్న మీటింగ్ నుంచి ఇన్‌ఫర్మేషన్ కోసం ఫోన్ చేస్తే ఆఫ్ వచ్చిందట. మెసెంజర్ మీద పింగ్ చేస్తే రిప్లయ్‌లేదట.

"నువ్వు ఈ మధ్య నార్మల్‌గా ఉండట్లేదు. ఆఫీస్ వాళ్లు ఇచ్చిన ఫోన్ అది. 24X7 నువ్వు అందుబాటులో ఉండాలనేగా! ఆఫ్ చేస్తే ఎలా?" మెత్తమెత్తగా చీవాట్లు పెడుతున్నాడు.

ఎప్పుడూ ఎవరూ వేలెత్తి చూపే అవసరం తెచ్చుకోలేదేమో! అవమానంగా తోచింది హర్షకు.

గబాల్న ఫోన్ ఆన్ చేశాడు.

'There is always someone who cares for you without your Knowledge... take care Dear'

మెసేజ్ ఫ్లాష్ అయింది.

తనకెంతో ఇష్టమైన మెసేజ్ టోన్.




"నీ గురించి అనుక్షణం ఆలోచించేవాళ్లు ఒకరున్నారు" అన్న అర్థం.

ఈసారి అతను ఒక్క సెకండ్ కూడా ఆలోచించలేదు.

ఈగో, అవతల వాళ్లు ఎవరు, వాళ్లకి తనంటే నిజంగా ఇష్టమేనా? తనని ఆట పట్టిస్తున్నారా... అన్నీ పక్కన పెట్టేశాడు.

ఆమె పట్ల "Missed You" రిప్లయ్ ఇచ్చాడు. ఒక మనిషి ఎవరో తెలీకుండా ఆ మనిషిని ఎప్పుడూ చూడకుండా చెప్పలేనంత ఇష్టం కలుగుతుందంటే అంతకు పూర్వం అతను నమ్మేవాడు కాదేమో!

•••

సీమ షేర్ చేసిన నైరా పోస్ట్‌ని వేలమంది షేర్ చేశారు.

రోజూ ఏదైనా క్లూ దొరుకుతుందేమో, ఎవరైనా నైరా ఆచూకీ చూశామంటారేమోనని ఎదురు చూస్తున్నారు. కానీ ఏమీ లాభం లేకపోయింది.

సోషల్‌మీడియా ద్వారా జరిగిన ఎన్నో అద్భుతాల గురించి చదువుతుంటాం. నైరా విషయంలో ఏ మిరాకిల్ జరగదేమిటి?

ఆలోచిస్తూ మెసేజెస్ చెక్ చేస్తోంది సీమ.

"నా ఫ్రెండ్‌గా ఉంటావా?" ఒకడి మెసేజ్.

ఫ్రెండ్ స్పెల్లింగ్ తెలీని మగవాళ్ళెంతమంది ఉంటారో ఆమెకి ఫేస్‌బుక్‌లో అకౌంట్ ఓపెన్ చేశాకే తెలిసొచ్చింది.

"ఫ్రెండ్ స్పెల్లింగ్ ఒక వెయ్యిసార్లు ఇంపోజిషన్ రాయమని' రిప్లయ్ ఇచ్చింది.

"ఐ లవ్ యూ!" ఇంకొకడి మెసేజ్.

డైరెక్ట్‌గా ఏ ఇతర సంభాషణ లేకుండా మొదటి మెసేజ్ 'ఐ లవ్ యూ!' అని పెట్టేవాళ్ల ఇమ్మెచ్యూరిటీకి నవ్వుకోవాలో, చెప్పుతో వాళ్లని చెళ్ళున కొట్టాలో ఆమె తేల్చుకోలేక పోతోంది.

అలా మెసేజెస్ స్క్రోల్ చేస్తుండగా కనబడిందొక మెసేజ్.

"నైరా అనే పాప ఫోటో మీరు షేర్ చేసింది చూశాను. ఆ పాపలాంటి అమ్మాయినే 'బెంగుళూరు ఎక్స్‌ప్రెస్'లో ఎవరో తీసుకెళ్తుండగా చూశాను. అచ్చం అలాగే ఉంది. అంతచక్కగా ఉండి, దిగులుగా ఉన్నట్లుండడంతో ఎందుకో గుర్తుండిపోయింది. పైగా ఆమెతో పాటున్న వ్యక్తి కొద్దిగా క్రూరంగా కూడా ఉన్నట్లనిపించింది".

షాక్ తిన్నట్లయింది సీమ.

ఆ మెసేజ్ వచ్చి కూడా మూడురోజులు దాటినట్లుంది.

తనే ప్రైవేట్ మెసేజెస్ చెక్ చేసుకోలేదు.

గబగబా రిప్లయ్ ఇచ్చింది.

"మీరెవరు? మీ నంబర్ ఇస్తారా? ఒకసారి మీతో మాట్లాడాలి. ఇంకే వివరాలు గుర్తొచ్చినా తప్పకుండా మెసేజ్ చేయండి"

అవతల వ్యక్తి ఆన్‌లైన్ కనబడటం లేదు.

మెసేజ్ చూసుకున్నట్లు కూడా రావటం లేదు.

వెంటనే ఆ మెసేజ్ అక్షయ్‌కీ, శ్రీకాంత్‌కీ పంపింది సీమ.

•••

సీసీ ఫుటేజ్ ఆధారంగా గుర్తించిన వాహనాల్లో ఒకటి ఆ ఏరియాలో పెట్రోలింగ్ చేస్తున్న పోలీస్ జీప్ అని తేలింది.

దాన్ని అనుమానితుల లిస్ట్‌లో నుంచి కొట్టేశాడు శ్రీకాంత్.

రెండవది వీకెండ్‌కి శ్రీశైలం వెళ్లి పొద్దునే తిరిగొచ్చిన బండి! అందులో మొత్తం ఫ్యామిలీ దిగటం ఆ ఏరియా సీసీ ఫుటేజ్‌లో కనబడింది. అయినప్పటికీ రెండురోజులు నిఘావేసి అనుమానించదగ్గదేదీ దొరకకపోవటంతో దాన్నికూడా ఫిల్టర్ చేసేశాడు శ్రీకాంత్.

ఇక మిగిలింది ఒక తెలుపురంగు ఇన్నోవా.

దానికి నంబర్ ప్లేట్ లేకపోవడంతో అనుమానం అటే మళ్లింది.

సిటీలో కొన్ని సీసీ కెమెరాలు పనిచేయకపోవడంతో దాన్ని వెంట వెంటనే ట్రేస్ చేయలేకపోయారు. అయితే అదేరోజు మధ్యాహ్నం మూడు ఆ ప్రాంతంలో ఆ కార్ ఎయిర్‌పోర్ట్ ముందు పార్క్ చేసుండటం గమనించారు.

నైరా కిడ్నాప్ ఉదంతాన్ని టీవీలో చూసిన వారిలో ఒకతను టీవీ ఛానల్‌కి ఫోన్ చేశాడు. అతన్ని, రకరకాల ప్రశ్నలు అడిగిన టీవీ ఛానల్ వాళ్లు తమ ఎక్స్‌పీరియన్స్‌తో అతను చెప్తున్నది నిజమనిపిస్తోందని, ఒకసారి మాట్లాడి చూడమని శ్రీకాంత్‌కి అతని నంబరిచ్చారు.

అతని కథనం ప్రకారం ఆరోజు అతను గౌలిగూడ బస్టాండ్‌లో నిలబడి బస్‌కోసం వెయిట్ చేస్తున్నాడు.

ఒక పాప సన్నగా మూలిగినట్లుగా ఏడవటం వినిపించి అటు తిరిగాడు.

అచ్చు నైరాలాగే ఉన్న పాపతో ఒకమ్మాయి నిలబడి ఉంది. నైరా ఏడుస్తోంది. తనతో ఉన్నమ్మాయి కోప్పడుతోంది. ఆవిడకి ఒక ఇరవైఐదేళ్లు ఉండవచ్చు. ఎరుపు రంగుకి ఆకుపచ్చ రంగు అంచున్న చాందినీ చీర కట్టుకుని ముసుగులా తల మీదుగా వేసుకుని ఉంది. ఆమె కట్టు, బొట్టు మరాఠీ వాళ్లలాగా అనిపించింది.

తను అటే చూడటం గమనించి నవ్వి మాటలు కలిపిందట.

"ఆ పాప తన కూతురనీ, అస్సలు తినట్లేదనీ, మాట వినట్లేదనీ" ఫిర్యాదుగా చెప్పిందట.

తర్వాత గట్టిగా గదమాయించి బిస్కెట్లు తినిపించింది. అప్పుడు ఆ పాప నిమిషాల్లో ఆమె భుజం మీద తలాన్చుకుని నిద్ర పోయిందట.

"నాకు ఇప్పుడు డౌట్ వస్తోంది. ఆ బిస్కెట్లలో మత్తుమందుందేమో" అన్నాడతను. ఆవిడ ముంబై బస్సెక్కి వెళ్లిపోవటం చూశానన్నాడు.

తలపట్టుకున్నాడు శ్రీకాంత్.

'ఒకరు బెంగుళూరు వెళ్లే రైల్లో కనపడింది అంటున్నారు. ఇంకొకరు ముంబై బస్‌లో ఎక్కడం చూశామని అంటుంటే, తమ దగ్గరున్న ఆధారాలను బట్టి ఆమెని ఎక్కించుకెళ్లిన కార్ ఎయిర్ పోర్ట్‌లో కనబడింది..'

ఏం చేయాలో తీవ్రంగా ఆలోచించసాగాడు.

**(ఇంకా వుంది)**

# దిద్దుబాటు

-పేరం ఇందిరాదేవి



**డిసెంబర్ నెలలో ఉండాల్సినంత చలిలేదు. సూర్యకిరణాలు ఇంకా వేడెక్కలేదు. అందుకే ఈ ఉదయం ఆహ్లాదకరంగా ఉంది. ఆదివారం కనుక ఆఫీసుకెళ్ళే తొందర కూడా లేదు. మనసుకు విశ్రాంతిగా ఉంది.**

**ప్రతీ ఆదివారం ఒక మంచి పుస్తకం చదవడం అలవాటు నాకు. రావూరి భరద్వాజగారి "పాకుడు రాళ్ళు" పుస్తకం తీసుకుని పైన నా గదిలో కిటికీ దగ్గర కూర్చున్నాను. గోల వినపడ్డంతో విశాలంగా ఉండే కిటికీలోంచి కిందకి చూశాను. నా కొడుకు అనూప్, వాడి స్నేహితులు కుర్చీలు వేసుకుని తోటలో క్యారమ్స్ ఆడుతున్నారు. నూనూగు మీసాల యవ్వనంతో తుళ్ళింతలాడుతున్నారు.**

ఏ బాదరబందీ లేని వయసు. కేరింతలాడుతున్నారు. ఇంకో రెండేళ్ళలో ఈ యువకులంతా కంప్యూటర్లముందు చలనంలేని జీవితాలకు బలవుతారనే తలంపే నాకు బాధ కలిగించింది. అనూప్ బాగా చదువుతాడు. డిగ్రీ చదివించి సివిల్స్‌కు పంపాలని, ఆదర్శవంతమైన కలెక్టర్‌ను చేయాలనే నా ఆశను వాడు ఆశయంగా తీసుకోలేదు. కంప్యూటర్ ఇంజనీరింగ్‌పై వాడికున్న ఆసక్తిని తండ్రిగా నేను గౌరవించాల్సివచ్చింది. నా చూపులు, ఆలోచనలు పిల్లలపైనుండి మరల్చి పుస్తకంలోకి తల దూర్చాను. అరవై, డెబ్బైల మధ్యకాలంనాటి తెలుగు సినిమారంగం నేపథ్యంగా కథానాయిక మంజరి జీవితచరిత్ర ఆసక్తికరంగా ఉంది. ఇక అందులో లీనమైపోయాను.

అకస్మాత్తుగా అనూప్ అతని స్నేహితుల మధ్య ఓ భిన్నస్వరం వినపడటంతో తలతిప్పి కిందికి తోటలోకి చూశాను. పాప్‌కార్న్ అమ్మే ఓ ముసలాయన తన పెద్ద మూట పిల్లలముందు పెట్టాడు. అక్కడున్న ఆరుగురికీ పేపర్‌కవర్లలో ఒక డబ్బాతో పాప్‌కార్న్ వేసిచ్చాడు. అతనికి ఎనభై దాకా వయసుంటుంది. కుర్రాళ్ళు అడిగే ప్రశ్నలకు సమాధానం ఇస్తున్నాడు. నేనూ ఆసక్తిగా వింటున్నాను.

"రోజుకు ఎన్ని మూటలు అమ్ముతావు తాతా?" అనూప్ అడిగాడు.

"ఎన్నో ఎక్కడ నాయనా! ఒక్కమూట అమ్మే సరికి నా ఊపిరి పోతుంది" ముసలాయన భుజం మీది తుండు తీసుకుని ముఖం తుడుచుకున్నాడు.

"ఎంత సంపాదిస్తావేంటి?" మరో పక్క నుంచి వచ్చింది ప్రశ్న.

"ఇయ్యన్నీ అమ్మితే నూరు మిగులుతుంది నాయనా!"

"అన్నీ అయిపోతాయా? మిగలవా? మిగిలితే మెత్తగా అయిపోతాయికదా, ఎవరు కొంటారు?" రఫిక్ మంచిప్రశ్న వేశాడు.

"బట్టీ కాణ్ణించి అటే అమ్మడానికి పోతా బాబూ, మధ్యాన్నంకల్లా అయిపోతాయి. చల్లకాలం ఒక్కోసారి మిగిలిపోతే మేమే ఇంట్లోకి వాడుకుంటాం".

"మెత్తగా అయిపోతే మీరుమాత్రం ఎలా తింటారు తాతా?" రోహన్ ఆసక్తిగా అడిగాడు.

"ఏం జేస్తాం నాయనా, పేలపిండి చేసుకుంటాం"

"అదెలా చేస్తారు?" నకుల్‌కి ధర్మసందేహం కలిగింది.

"ఈ పేలాలకి బెల్లం కలిపి దంచుతాం, ఆ పొడి తింటాం. ముద్దలు చేసుకుని కూడా తింటాం".

"రోజుకు నూరంటే నెలకు మూడువేలు, మీ ఇంట్లో ఎంతమంది ఉన్నారు? సరిపోతాయా? మూడువేలకోసం ఈ వయసులో కష్టపడుతున్నావే" అనూప్ సానుభూతి పలుకులు విని, వాడు ఆ కోణంలో ఆలోచించినందుకు నేను తృప్తి పడ్డాను.

ఆరుగురు కుర్రాళ్ళూ, రెండోసారి మళ్ళీ ఆరు డబ్బాలు వేయించుకునేటప్పటికి ముసలాయన నింపాదిగా అక్కడే అరుగుమీద కూర్చున్నాడు. "నేను, నా ముసల్ది, కోడలు, మనవడు ఉన్నాం బాబూ, వానలు పడక, పంటలు పండక మాపల్లె ఇడిసిపెట్టి ఈ ఊరు వచ్చాం. నా కొడుకు కేన్సర్ వచ్చి చనిపోయాడు. వాడున్నంత కాలం ఆటో వేసి సంపాదించేవాడు, నా మనవణ్ణి చదివించాడు, మమ్మల్ని కూచోపెట్టి సాకాడు. కొడుకు చనిపోయాక నాకీతిప్పలొచ్చాయి, కొడుకు జబ్బునయం కాలా, చచ్చిపాయే, అప్పుమాత్రం మిగిలింది, కోడలు కూడా పనికిపోతుంది. ఇంత జేసినా వడ్డీ కూడా కట్టలేకపోతున్నాం" ముసలాయన గొంతు దుఃఖంతో జీరబోయింది. అతని ముఖం నాకు స్పష్టంగా కనపడకపోయినా, కొడుకును తలుచుకుని అతని కళ్ళల్లో నీరు తిరిగి ఉంటుందని ఊహించా. మనసు బరువెక్కింది.

కుర్రాళ్ళు అంతగా స్పందించినట్లు నాకు అనిపించలేదు. ఆరుగురిలో ఇద్దరి సంభాషణ వేరే విషయాలమీదకు వెళ్ళింది. "జీబ్రాకి మస్క్యులైన్ జెండర్ చెప్పరా చూద్దాం?" అన్నాడొకడు.

ఇంగ్లీషుపట్ల ఆసక్తి కనబరిచే నేను, మగ జీబ్రాని స్టాల్లోన్ లేక మేల్ జీబ్రా, ఆడదాన్ని మేర్ అంటారేమో అనుకున్నా. ఆసక్తిగా కుర్రాళ్ళు ఏం చెబుతారో అని ఎదురుచూశాను.

ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు, పైగా ఎవరికీ సమాధానంమీద ఆసక్తి లేకపోయింది, ఆడుతున్న క్యారమ్స్‌లో రెడ్ కొట్టడం, ఫాలోఅప్ కొట్టడంపై ఘర్షణ పడ్డారు.

"మగజీబ్రాని ఏమంటారో చెప్పరా! మాకు ఎవరికీ తెలియదులే, సరేనా!" అన్నాడు నకుల్.

"జీ బనియన్... హి....హీ" అన్నాడు.

"అదేంటి జీ బనియన్ ఎప్పుడూ వినలేదే, నువ్వు చెప్పేది నిజమేనా! రేయ్ నకుల్! గూగుల్ సెర్చ్ కొట్టరా... తప్పయిందో! వీడికుంది" అన్నాడు అభిజిత్.

"జీ బ్రా ఆడదిరా అప్పుడు జీ బనియన్ కదా మగది" వెకిలిగా నవ్వాడు వాడు.

"ఓహో అలావచ్చావా! వీడు అడిగాడంటే ఇలాంటిదే అయి ఉంటుందనుకున్నా" అభిజిత్ అన్నాడు.



ఒకరివీపు మీద ఒకరు కొట్టుకుంటూ అందరూ నవ్వడం మొదలెట్టారు.

వాళ్ళ ఆసక్తులు గమనించి నేను కాస్త నిరాశ పడ్డా. కానీ మళ్ళీ సర్దిచెప్పుకున్నా, ఆ వయసులో కొందరికి అలాంటి ఆసక్తి ఉంటుందిలే అని.

లాన్ పక్కనున్న కుళాయి చూపిస్తూ "ఆ నీళ్ళు తాగొచ్చా నాయనా? అన్నాడు ముసలాయన.

"ఆ.... తాగుపో తాతా!" అన్నాడు అనూప్.

ముసలాయన నీళ్ళకోసం పోగానే ఇద్దరు కుర్రాళ్ళు పిడికిళ్ళతో పాప్‌కార్న్ తీసుకుని తమ కవర్లలో వేసుకున్నారు.

తప్పు అన్నట్టు రఫీక్ వారించబోయాడు.

తప్పేమీ లేదన్నట్టు తలలెగరేశారు అభిజిత్, అనూప్.

నేను యధాలాపంగా వాళ్ళని చూస్తూ, ఆ సంభాషణ వింటున్నవాణ్ణల్లా ఈ సంఘటనతో చాలా జాగ్రత్తగా వాళ్ళని పరిశీలిస్తున్నాను. పైనున్న నాగది నుంచి వాళ్ళు నాకు స్పష్టంగా కనపడుతున్నారు, వాళ్ళ మాటలుకూడా స్పష్టంగా వినపడుతున్నాయి. తలెత్తి పైకి పరీక్షగా చూస్తే తప్ప నేను వాళ్ళకు కనపడను.

ముసలాయన నీళ్ళు తాగొచ్చి "మీరంతా చదువుకుంటున్నారా బాబూ! లేకుంటే ఉద్యోగం చేస్తున్నారా? నా మనవడు కూడా బియ్యే చది వాడు, మొన్నే పరీక్షలు పాసయ్యాడు. మీరంతా పెద్దోళ్ళ పిల్లలు కదా! మా వాడికి ఏదైనా చిన్న ఉద్యోగం చూడండి నాయనా!" అన్నాడు.

ఇంతలోకే కుర్రాళ్ళ సంభాషణ సినిమాల మీదకి వెళ్ళింది. మధ్యాహ్నం మాట్నీకి వెంకటేష్, పవన్‌కల్యాణ్‌ల "గోపాల గోపాల" లేక అక్షయ్ కుమార్ "బేబి"... దేనికి వెళ్ళాలనే చర్చ మొద లెట్టారు. ముసలాయన మాటలు ఎవరూ పట్టించు కోలేదు.

కాసేపయ్యాక మళ్ళీ తన అభ్యర్థన వాళ్ళ ముందుంచాడు.

అనూప్ ఫోన్లో ఎవరితోనో మాట్లాడు తున్నాడు, మిగతావాళ్ళు కూడా ఆయన మాటలు పట్టించుకోలేదు.

"రేయ్... తాత తన మనవడికి ఉద్యోగం అడుగుతున్నాడురా!" ముసలాయన అభ్యర్థన స్నేహి తులకు వినిపించాడు రఫీక్.

"ఓ ఆర్నెల్లుపోతే మాకే కావాలి ఉద్యోగాలు, ఎవరిస్తార్రా?" ఓ కొత్తముఖం అంది.

ఆ కుర్రాడు వీళ్ళలో కొత్తగా చేరినట్టుంది. నేనింతకుముందు చూడలేదు.

ముసలాయన మళ్ళీ కొంచెంగట్టిగా "మీరంతా ఉన్నోళ్ళుకదా బాబూ మీ నాయనల్ని అడిగి నా మనవడికి ఉద్యోగం చూడండి" అన్నాడు వాళ్ళకు వినిపించేలా.

"వీళ్ళ నాయన మన జిల్లాకలెక్టర్, వాణ్ణి అడుగుతాతా, ఖచ్చితంగా నీ మనవడికి ఉద్యోగం ఇప్పిస్తాడు" అన్నాడు ఆ కొత్త కుర్రాడు అనూప్‌ని చూపిస్తూ.

అందరూ నవ్వు ఆపుకుంటున్నారు.

"అవునా బాబూ, మావాడికి ఉద్యోగం ఇప్పి

**స్నేహితులతో కాలక్షేపం చేస్తున్నాడు అతని కొడుకు. వాళ్ల మాటలన్నీ మేడ మీద గదిలోకి వినిపిస్తూనేవున్నాయి ఆ తండ్రికి. అవన్నీవింటూ ఆలోచనలో పడిపోయాడా తండ్రి. ఒక వ్యక్తిని ఆట పట్టించడం మొదలెట్టారు వాళ్లంతా. తన కొడుకు ఆ వ్యక్తికి పెద్ద వాగ్దానం చేయడంతో ఆ ఎగతాళి పరాకాష్ఠకు చేరింది. అది విని విస్తుపోయాడు తండ్రి. ఇంతకీ ఏమిటా వాగ్దానం? అసలు అక్కడ ఏం జరిగింది? అవతలి వ్యక్తి ఎవరు?**

స్తావా? శానా కష్టాల్లో ఉన్నాం బాబూ" ముసలా యన అభ్యర్థన నా గుండెలకు తాకింది. రెండో సారి అతని కళ్ళలో కన్నీరు తిరిగి ఉంటుంది. అనూప్ ఏం చెబుతాడో అని నేను నా చెవులు రిక్కించి విన్నాను నా గుండె వేగంగా కొట్టు కుంది.

"అవును తాతా, మా నాన్న కలెక్టర్! నీ మన వడికి ఉద్యోగం ఇప్పిస్తాలే! రేపు పదిగంటలకు కలెక్టర్ ఆఫీసుకు వచ్చేయ్. నీ మనవడికి తెలి సుంటుందిలే. నీ మనవడి పేరేంటి? మా నాన్నకు చెప్పాలిగా" ఆనూప్ మాటలకు నాకళ్ళు బైర్లు కమ్మాయ్.

"నా పేరు సోమప్ప బాబూ" ముసలాయన గొంతులో ఆనందంచూసి నాకు మతిపోయింది.

"నీ పేరు కాదహే... నీ మనవడిపేరు చెప్పు. ఉద్యోగం వచ్చాక మాకందరికీ పార్టీ ఇవ్వాలి" ఆ కొత్తకుర్రాడు ఎగతాళిస్వరం విని నాకు వెంటనే వెళ్ళి వాడి చెంపలు పగలగొట్టాలనిపించింది. జరగబోయేది చూద్దామని ఆగాను.

"నా మనవడిపేరు వెంకటేశ్వర్లు బాబూ బియ్యే ఫస్ట్‌క్లాసులో పాసయ్యాడు, కంప్యూటర్ నేర్చుకు న్నాడు. ఇంగ్లీషు మాట్లాడటం కూడా నేర్చు కుంటున్నాడు" ఆశ, ఆనందం నిండిన గొంతుతో అన్నాడు ముసలాయన.

"కంప్యూటర్ కూడా నేర్చుకున్నాడా, గుడ్ వెరీగుడ్ అయితే ఉద్యోగం గ్యారంటీలే. రేపు పది గంటలకు కలెక్టరాఫీసు దగ్గరికి.. గుర్తుంది కదా!" అనూప్ చెబుతోంటే మిగతా కుర్రాళ్ళంతా నవ్వు ఆపుకుంటున్నారు. నాకు ఒక్కసారిగా అధఃపాతా ళానికి జారినట్లనిపించింది. ఏదో బరువంతా తలలోకివచ్చి చేరినట్లనిపించింది. శరీరం కంపిం చింది. వీణ్ణి కలెక్టర్ చేసి ఉంటే ఏం చేసేవాడు? ఒక చదువురాని అమాయకుడైన పేద వృద్ధుణ్ణి తమ సరదాకోసం ఎంత అవలీలగా నమ్మిం చారు? ఈ యువత దేశాన్ని ఏం చేయబోతోంది? నా ఆశయాలకు తగిన కొడుకును నేను కనలేక పోయానా! నా పెంపకంలో లోపముందా? నా రక్తంలోగానీ, వాళ్ళమ్మ రక్తంలో గానీ ఇంత నిర్దయ లేదే!

ఈనాటి విద్య సంస్కారాన్ని ఇవ్వలేక పోతోందా...! సామాజిక రీతిలో నైతికత నశిం చిందా! నా కొడుకు ఇలా ప్రవర్తించడానికి కార ణాలు వెతుక్కుంటూ, కిటికీ కడ్డీని గట్టిగా పట్టు కున్నాను.

ముసలాయన మూట కట్టుకోబోతూ మళ్ళీ అందరికీ తలా పిడికెడు పాప్‌కార్న్ వాళ్ళ చేతుల్లో వేశాడు. కుర్రాళ్ళు జేబుల్లోంచి డబ్బులు తీసి చ్చారు. సంచి భుజాన పెట్టుకుని మళ్ళీ అందరికి



దండాలుపెట్టాక "రేపు పది గంటలకు కలెక్టర్ ఆఫీసు దగ్గరే ఉంటాం బాబు, తమరు వస్తారు కదా!" అన్నాడు ముసలాయన ఆశగా.

"నేనున్నా లేకపోయినా, వెంకటేశ్వర్లు అనే అబ్బాయి, తాత సోమప్ప వస్తారని మా నాన్నకు చెబుతా, ఏదో ఒక ఉద్యోగం ఇప్పిస్తాకదా!" అనూప్ ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతూనే అన్నాడు.

"అలాగే బాబు" వంగిపోయిన అతని నడుము,

తేలిగ్గా ఉన్న ఆ సంచి ఎత్తుకోగానే మరింత వంగిపోయింది.

●●●

వారం తర్వాత ఆదివారం మళ్ళీ క్యారమ్స్ ఆడటానికి అనూప్ తన స్నేహితుల దండును తీసుకొచ్చాడు. స్నేహితులంతా తోటలోకి దారి తీస్తే నీళ్ళబాటిల్ కోసం లోపలికి వచ్చిన అనూప్ సోఫాలో కూర్చున్న సోమప్పను ఆయన మన వణ్ణి చూసి కంగారుగా నన్నూ వాళ్ళమ్మనూ మార్చిమార్చి చూశాడు. "దండాలు బాబు, నీ దయవల్ల నా మనవడికి ఉద్యోగం వచ్చింది, నీ



ఋణం ఎలా తీర్చుకోగలం?" ముసలాయన చెబుతోంటే అనూప్‌కు నోటమాట రాలేదు.

"థాంక్యూ సార్....!" సోమప్ప మనవడు అనూప్‌తో చేయి కలుపుతూ అన్నాడు.

తాత మనవడు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు. అనూప్ ముఖంలో కత్తిగాటుకు నెత్తురు చుక్కలేదు, ఉలుకు పలుకు లేకుండా సోఫాలో కూర్చున్నాడు.

"నీవు చేసినతప్పు సరిదిద్దడానికి మీ నాన్న ఎంతమంది చుట్టూ తిరిగారో, ఎంత కష్టపడ్డారో తెలుసా...! ఆ ముసలాయన్ని ఆట పట్టించడానికి నీకు సిగ్గులేదా! ఆయన వయసేంటి? ఆర్థికపరిస్థితి, కుటుంబపరిస్థితి ఏంటి? నీవు, నీ స్నేహితులు చేసిందేమిటి? ఇంత మానవత్వంలేని మనిషిగా ఎలా తయారయ్యావురా! ఎందుకురా నీకీ చదువులు? ఛీ...ఛీ... నీలాంటి జాలిలేని వెధవని కన్నానేంట్రా!" వాళ్ళమ్మ ఉక్రోషంతో కేక లేస్తోంది.

మౌనంగా ఉన్న నన్నుచూసి, "ఏమిటండి మీరేమి అనరా వాణ్ణి" అంది కోపంగా.

నిజానికి నాకు అనూప్‌ని ఏమీ అనాలనిపించ లేదు. తల్లిదండ్రుల నుండి విజ్ఞత నేర్చుకునే స్థితిలోలేదు నేటి యువతరం. కానీ నేను అక్కడ నుండి లేచి వాడికి దగ్గరగా వెళ్ళి "మేము సరిదిద్దలేని తప్పులు చేయకు నాన్నా!" అని నా గది లోకి వచ్చేశాను.

సెల్: ***98488 04504***

# సౌభాగ్య చక్రం

ఫిబ్రవరి 15 నుంచి
ఫిబ్రవరి 21 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. పోటీల్లో విజయం సాధిస్తారు. 17, 18 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి. షేర్లు, బ్యాంకు లావాదేవీలు లాభిస్తాయి. 19, 20, 21 తేదీల్లో దూరంలో ఉన్న వ్యక్తులకు సంబంధించిన సమాచారం కలవరం కలిగిస్తుంది. ప్రయాణాలు, చర్చల్లో నిదానం అవసరం. విద్యార్థులకు శుభప్రదం. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, శ్రీవారు, శ్రీమతి విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఉద్యోగ వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉన్నత పదవులు అందుకుంటారు. 17, 18 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. సమావేశాలు, వేడుకల్లో గౌరవ మన్ననలు అందుకుంటారు. సంకల్పం ఫలిస్తుంది. 19, 20, 21 తేదీల్లో పెట్టుబడులు, ఆర్థిక నిర్ణయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

విద్య, ఆర్థిక వ్యూహాలు, వేడుకలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ఉన్నత విద్యా విషయాల్లో ప్రోత్సాహకరం. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పెట్టుబడి వ్యూహాలు ఫలిస్తాయి. 17, 18 తేదీల్లో సహోద్యోగులతో సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 19, 20, 21 తేదీల్లో సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. ఉన్నత పదవులు అందుకుంటారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

రుణప్రయత్నాలు, కొనుగోళ్లు, పెట్టుబడులు, ఉన్నత విద్య, దూర ప్రయాణాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. వడ్డీలు, బోనస్‌లు అందుకుంటారు. 19, 20, 21 తేదీల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. హోటల్, ఆస్పత్రులు, పరిశ్రమల రంగాల వారికి సంకల్పం నెరవేరుతుంది. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సమావేశాలు, విందుల్లో పాల్గొంటారు.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

కాంట్రాక్టులు, విద్యా విషయాలు, భాగస్వామి విషయాలు, ఆర్థిక సంస్థలతో పనులకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో చర్చలు, సమావేశాలు ఫలిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. 17, 18 తేదీల్లో కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి సంకల్పం నెరవేరుతుంది. 19, 20, 21 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఇంట్లో వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. విందుల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. సన్నిహితుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 19, 20, 21 తేదీల్లో భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలు, శుభకార్యాలకు ఏర్పాట్లు చేస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలో వారికి శుభప్రదం. పెట్టుబడులు లాభిస్తాయి.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, ప్రియతముల విషయాలు, షాపింగ్, వృత్తి, వ్యాపారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. సంకల్పం నెరవేరుతుంది. 17, 18 తేదీల్లో పెట్టుబడులు పొదుపు పథకాలు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 19, 20, 21 తేదీల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. కొత్త స్నేహాలు చిగురిస్తాయి. కృషి రంగంలో పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

గృహారంభ ప్రవేశాలు, వేడుకలు, విద్యా విషయాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. దూరంలో ఉన్న బంధుమిత్రుల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. వేడుకల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాలవారు కీలక నిర్ణయాలు తీసుకునేందుకు తగిన సమయం. 19, 20, 21 తేదీల్లో ఆర్థిక విషయాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు సేకరిస్తారు. అదనపు ఆదాయం లభిస్తుంది.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, గృహారంభ ప్రవేశాలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. 17, 18 తేదీల్లో దూరప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారు కీలక సమాచారం అందుకుంటారు. 19, 20, 21 తేదీల్లో బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం. వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

అదనపు ఆదాయం, పెట్టుబడులు, వేడుకలు, ఉన్నత విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లకు అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 17, 18 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బ్యాంకులు, ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 19, 20, 21 తేదీల్లో ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. ప్రయాణాల్లో నిదానం అవసరం. విద్యార్థులకు శుభప్రదం. సినీరాజకీయ రంగాల వారు కీలక సమాచారం అందుకుంటారు.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

సమావేశాలు, వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 17, 18 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు. ప్రముఖులను కలుసుకుంటారు. 19, 20, 21 తేదీల్లో పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. అంచనాలు తలకిందులయ్యే అవకాశం ఉంది. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. ఆర్థికంగా ప్రోత్సాహకర సమయం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, రుణప్రయత్నాలు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధ, గురువారాల్లో గత అనుభవాలతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. రుణప్రయత్నాలు ఫలిస్తాయి. సంస్మరణల్లో పాల్గొంటారు. 17, 18 తేదీల్లో ఉన్నతవిద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. సంకల్పం నెరవేరుతుంది. 19, 20, 21 తేదీల్లో కీలక నిర్ణయాల అమలుకు తగిన సమయం కాదు. వృత్తి వ్యాపారాల్లో ప్రోత్సాహకరం. ప్రముఖులను కలుసుకుంటారు. ఉన్నతపదవులు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల సహకారం లభిస్తుంది.



## అక్కగా మిస్సమ్మ

'ఖుషి' సినిమా పేరు వినగానే పవన్‌కల్యాణ్‌తో పాటు భూమికా చావ్లా కూడా టక్కున గుర్తుకు వస్తుంది. ఆ సినిమా తరువాత భూమిక తెలుగులో చాలా సినిమాలు చేసింది. కెరీర్ పీక్ స్టేజ్‌లో ఉండగానే పెళ్ళి చేసుకుని సెటిలై పోయింది. పెళ్ళి తరువాత అడపాతడపా తప్ప పెద్దగా సినిమాలు చేయడం లేదు. 'ఎంఎస్ ధోని'లో అక్క పాత్రనూ, 'లడ్డుబాబు'లో అమ్మ క్యారెక్టర్‌నూ చేసింది. తిరిగి ఇన్ని రోజుల తరువాత నానికి అక్కగా ఓ సినిమాలో చేయబోతోంది! ఈ సినిమాలో అక్క పాత్రకు బోలెడంత ఇంపార్టెన్స్ ఉందట! అందుకే కథ వినగానే ఓకే చెప్పేసిందట! అక్క, అమ్మ, వదిన పాత్రలు చేస్తున్న హీరోయిన్లు చెప్పే కబుర్లే ఇవి అంటూ టాలీవుడ్ జనాలు భూమిక మాటలను లైట్ తీసుకుంటున్నారట! ఆ మధ్య నిర్మాతగా అవతారమెత్తి ఓ సినిమా తీసి చేతులు కాల్చుకున్న తరువాత తిరిగి నిర్మాణ రంగం వైపు భూమిక చూడలేదు. కాకపోతే మంచి కథ, అభిరుచి ఉన్న డైరెక్టర్ దొరికితే భూమిక ఓ సినిమా తీసే అవకాశం ఉందని ఆమె సన్నిహితులు అంటున్నారు.




## శ్రీదేవి డ్యాన్సులకు భారీ పారితోషికం?

ఐదు పదులు పైబడిన శ్రీదేవి ఇప్పటికీ తనొక జగదేక సుందరిగానే ఫీలవుతూ ఉంటుంది. కుర్ర హీరోయిన్లతో పాటు ఆఖరికి తన కూతుళ్లతో కూడా పోటీ పడి, అవకాశం దొరికినప్పుడల్లా అందాల ప్రదర్శన చేసేస్తూ ఉంటుంది. ఆ మధ్య ఎప్పుడో బాలీవుడ్‌లో ఓ సినిమా చేసి మంచి సక్సెస్‌ను అందుకుంది. దాంతో అప్పటినుంచీ శ్రీదేవికి డబ్బు పిచ్చి మరీ ఎక్కువైంది అంటున్నారు బాలీవుడ్ జనాలు. శ్రీదేవితో సినిమా చేయాలంటే కొన్ని కోట్లు చేతిలో పెట్టవలసి రావడంతో ఆమెతో సినిమా అంటే అక్కడి దర్శకనిర్మాతలు భయంతో పారిపోతున్నారట! ఇక సినిమా ఛాన్సులు రావడం కష్టం అనుకుందేమో ఫంక్షన్లలో డ్యాన్సులకు ఓకే చెప్పేస్తోందట!

తాజాగా ఓ బడా వ్యక్తి ఇంట జరిగిన పెళ్ళిలో డ్యాన్సులు చేయడానికి భారీ మొత్తం పుచ్చుకుందన్న వార్తలు వినిపిస్తున్నాయి. మొదట స్టేజి మీద శ్రీదేవి సందడి చేసినప్పుడు సరదాకి చేసిందని అందరూ అనుకున్నారట కానీ, ఆ తరువాత వరుసగా మూడు నాలుగు పాటలకు డ్యాన్స్ చేసేసరికి చూస్తున్న వారికి అసలు సంగతి అర్థమయిందట! ఆ ఫంక్షన్‌కి శ్రీదేవి డ్యాన్స్ చేయడానికే వచ్చిందని! డ్యాన్స్ చేసినందుకు గానూ శ్రీదేవికి భారీ మొత్తం ముట్టిందని అంటున్నారు.



## రాజకీయాల్లోకి లారెన్స్?



పరిచయం అక్కర్లేని పేరు అది. డ్యాన్స్ డైరెక్టర్‌గా, దర్శకుడిగా, నటుడిగా, హీరోగా, తమ్ముడిగా ఇలా ఏ పాత్రలోనైనా ఇట్టే ఇమిడిపోయే వ్యక్తి లారెన్స్! లారెన్స్‌లో ఇన్ని కళలతో పాటు దయాగుణం ఎక్కువే అంటారు అతని గురించి తెలిసిన వాళ్లు. మొన్నటికి మొన్న తమిళనాట జల్లికట్టు ఉద్యమ సమయంలో అనారోగ్యంతో బాధపడుతున్నా, తన వంతు సహకారం అందించాడు. అప్పుడు లారెన్స్‌ను చూసి ఎంతోమంది స్ఫూర్తి పొందారు కూడా! ఇదంతా గతం. ప్రస్తుతానికి వస్తే లారెన్స్ రాజకీయాల్లోకి రాబోతున్నాడన్న వార్త బలంగా వినిపిస్తోంది. జల్లికట్టు ఉద్యమమే లారెన్స్‌ను రాజకీయాలవైపు నడిపించిందన్న వార్తలూ వస్తున్నాయి. కాకపోతే అతగాడు ఏ పార్టీలో చేరతాడనేది తెలియడం లేదట!

## ధనుష్ తల్లిదండ్రుల గోల!



బెల్లం చుట్టూ ఈగలు ముసిరినట్టు కోలీవుడ్ హీరో ధనుష్ తమ కొడుకంటూ ఓ వృద్ధ జంట ఇటీవల తమిళనాడులోని కోర్టును ఆశ్రయించారు. ఆ దంపతులు అంతటితో ఆగకుండా తమ కొడుకు నుంచి తమకు భరణం ఇప్పించాలని కూడా కోరారు. అసలు విషయం ఏమిటంటే ధనుష్ వారి కొడుకు కాదట! ధనుష్ తన అసలు తల్లిదండ్రులకు సంబంధించిన సాక్ష్యాలు కోర్టుకు సమర్పించడంతో పాటు ఆ వృద్ధ దంపతులు ఎవరో తనకు అస్సలు తెలియదని విన్నవించాడట! దాంతో కోర్టు మరిన్ని ఆధారాలు సమర్పించవలసిందిగా ఆ వృద్ధ దంపతులను ఆదేశించింది. ధనుష్ తల్లిదండ్రులమంటూ తల్లిదండ్రులు కోర్టు కెక్కడం ఇది రెండవసారి.



## అతిగా నష్టపోతున్న కుర్రాడు

అతి ఎప్పుడూ మంచిది కాదు అంటూంటారు పెద్దలు. రాజ్‌తరుణ్ విషయంలో ఇది నూటికి నూరుపాళ్లు నిజమయింది. వరుసగా మూడు సక్సెస్‌లు అందుకున్న తరువాత రాజ్‌తరుణ్‌లోని అతి త్వరగానే బయటకు వచ్చేసింది. దాంతో తన దగ్గరకు వచ్చిన కథలో లోపాలు వెతకడం మొదలెట్టాడు. ఇటీవలే విడుదలైన 'నేను లోకల్', 'శతమానం భవతి' సినిమాలు ముందు ఇతగాడి దగ్గరకే వెళ్లాయట! కానీ కథలో మార్పులు చేర్పులు చేయండంటూ అతి చేయడంతో దర్శకనిర్మాతలు అతగాడికి ఓ నమస్కారం పెట్టి వచ్చేశారట! కట్ చేస్తే ఆ రెండు సినిమాలు పెద్ద హిట్‌గా నిలిచాయి. రాజ్‌తరుణ్ అలా ప్రవర్తించి ఉండకపోతే కొత్త సంవత్సరంలో వరుస రెండు హిట్లు తన ఖాతాలో వేసుకునేవాడు. మినిమమ్ గ్యారంటీ హీరో అన్న ట్యాగ్ తగిలించుకునేవాడు.

# 'నేను' యూనివర్సల్ హీరోయిన్ని

## -కీర్తి సురేష్



**అందం+అభినయం కలిపితే అది కీర్తి సురేష్ అవుతుంది. తొలి సినిమాతో సినీ అభిమానుల్లో చెరగని ముద్ర వేసి మలి సినిమాతో తనూ లోకల్ అయిపోయింది కీర్తి. ఇప్పుడు తను పూర్తిగా 'లోకల్' అమ్మాయిని అయిపోయాననీ, ఇక నుంచి తెలుగు సినిమాల మీద దృష్టి ఎక్కువ పెడతానంటున్న కీర్తి సురేష్‌తో...**

**రెండో సినిమా నాని లాంటి ఎనర్జిటిక్ హీరోతో చేయడం ఎలా ఉంది?**

మా అక్క రేవతి ముందే చెప్పింది. తను చాలా ఎనర్జిటిక్, తనతో చేసేటప్పుడు జాగ్రత్తగా చేయమని హెచ్చరించింది. తను చెబుతుంటే నానిగారి గురించి కొద్దిగా ఎక్కువ చెప్పినట్టుంది అనిపించింది కానీ, సెట్‌లో తనని చూసిన తరువాత అక్క చెప్పింది నూటికి నూరుపాళ్ల నిజమేనని అనిపించింది. తను తెలుగు సినిమాలు బాగానే చూస్తుంది. అందుకే నానిగారి గురించి చెప్పగలిగింది. గతంలో లేనివిధంగా ఈ సినిమా చేస్తున్నప్పుడు ఎన్నో సందేహాలు వచ్చేవి. అవన్నీ నానిని అడిగేదాన్ని. వేటికీ విసుక్కోకుండా ఓపికగా జవాబు చెప్పేవారు.

**మొదటి సినిమాకీ, రెండవ సినిమాకీ దాదాపు సంవత్సరం గ్యాప్ వచ్చినట్టుంది?**

'నేను శైలజ' సినిమా చేసిన తరువాత మాలీవుడ్, కోలీవుడ్‌లలో ఒప్పుకున్న సినిమాలు చేయడానికి వెళ్లాను. అవి పూర్తవుతున్న సమయంలో 'నేనూ లోకల్'లో అవకాశం వచ్చింది.

**మీ పేరెంట్స్‌కి దూరంగా ఉంటున్నట్టున్నారు?**

అమ్మా, నాన్న, అక్క రేవతి త్రివేండ్రంలో ఉంటారు. నేను మా గ్రాండ్‌మదర్‌తో చెన్నైలో ఉంటున్నాను. అమ్మా, నాన్నా నెలకోసారన్నా ఏదో ఒక పనిమీద చెన్నై వస్తుంటారు. కలుసుకుంటూనే ఉంటాం. నేను వెళ్లేది తక్కువే!

**ఓ సినిమా ఎలా ఒప్పుకుంటారు?**

సినిమాలో నా పాత్ర ఎంత ముఖ్యమో, కథ, మిగతా విషయాలూ అంతే ముఖ్యం. నేను చేయబోయే సినిమా, పాత్ర ప్రేక్షకులకు కనెక్ట్ అవుతుందా? లేదా? అన్నది చూస్తాను. వాళ్ల కోణంలోంచి ఆలోచించి ఓకే చెబుతాను. నా సినిమాలు ఆలస్యం కావడానికి ఇది ఒక కారణం కావచ్చు.

**భాష ఇబ్బందిగా లేదా?**

తెలుగులో ఇప్పటివరకూ చేసిన సినిమాల్లో హీరోల నుంచీ టెక్నీషియన్ల వరకూ దాదాపు అందరికీ తమిళం బాగా వచ్చు. దాంతో తెలుగు డైలాగులను తమిళంలో చెప్పేవారు. సీన్ అర్థం చేసుకుని నటించేదాన్ని. ఏవైనా డౌట్లు వచ్చినా తమిళంలోనే క్లియర్ చేసేవారు. ఇప్పటి వరకూ భాషాపరమైన ఇబ్బందులు ఎదురు కాలేదు. ఇప్పుడిప్పుడే ఎదుటివారు చెబుతున్నది అర్థం అవుతోంది. చిన్నచిన్న పదాలు నేర్చుకుంటున్నాను. ఉదాహరణకి 'చాలా దూరమా', 'బాగా వచ్చిందా' లాంటి పదాలన్న మాట. యూనిట్ సభ్యుల నుంచే ఈ పదాలు నేర్చుకున్నాను.

**కీర్తి గ్లామర్‌కి దూరం అంటారు! ఎంత వరకూ నిజం?**

నా దృష్టిలో గ్లామర్ అంటే అందంగా కనిపించడం. అంతే తప్ప చిట్టి పొట్టి డ్రస్సులు వేసుకుంటే గ్లామర్ అనిపించుకోదు. అలాంటి గ్లామర్ నాకవసరం లేదు. మోడ్రన్ డ్రస్సులకైతే అభ్యంతరం లేదు. కాక పోతే మోడ్రన్ డ్రస్సులకన్నా నాకు సంప్రదాయ దుస్తులే ఎక్కువగా నప్పుతాయి.

## డ్రెస్ డిజైనింగ్?

నాలో దాగి ఉన్న ఫ్యాషన్ డిజైనర్ ఎప్పుడూ బయట పడుతూనే ఉంటుంది. నా సినిమాల్లో నా దుస్తులు, వాటి డిజైన్లు అన్నీ నేనే చూసు కుంటాను.

## బయటవారికి డిజైన్ చేసే ఉద్దేశం ఉందా?

లేదు. నేను అంత పర్‌ఫెక్ట్ కాదు. ఫ్యాషన్ డిజైనింగ్‌లో ముందు ఉత్సాహంగానే చేరాను కానీ, ఆ తరువాత దాన్ని కంటిన్యూ చేయలేక పోయాను. నా స్నేహితులకేమో ఈ కోర్స్ అంటే ప్రాణం. అందుకే వారు ఎప్పుడూ చదువుకుంటూ ఉంటే, నేను ఆ టైములో వేరే పనులు చేసే దాన్ని. చదువుకన్నా భోజనమంటేనే నాకు చాలా ఇష్టం. కాలేజీలో క్లాసులన్నా మిస్ అయ్యేదాన్నేమో! భోజనాన్ని మాత్రం మిస్ అయ్యేదాన్ని కాదు. ఇప్పుడు ఆ రోజులు తలుచుకుంటే భలే నవ్వొ స్తుంది.

## 'నేను' పదం బాగా కలిసి వచ్చినట్టుంది?

ఇదేదో కొత్త విషయంలాగా ఉంది. సిని మాల విజయానికి పదాలు కలిసి వస్తాయా? అలా అయితే అది నిజమే కావచ్చు.

తెలుగులో చేసిన రెండు సినిమాల్లోనూ ఆ పదం ఉంది. అవి రెండూ మంచి విజయం సాధించాయి. బహుశా ఆ పదం నాకు కలిసొచ్చి నట్టుంది.

## స్విమ్మింగ్‌లో ఛాంపియనట?

ఇప్పుడు కాదు. స్కూల్ రోజుల్లో. అప్పుడు చేసిన స్విమ్మింగ్ ఇప్పుడు బాగా పనికొస్తోంది. ఇప్పుడుకూడా రోజులో కొద్దిసేపు స్విమ్మింగ్ మాత్రమే చేస్తాను. వ్యాయామాలు అవీ చేసే టైము నాకు దొరకదు.

## పవన్‌కల్యాణ్‌తో చేయబోతున్నారట?

అవును. పవన్‌కల్యాణ్, త్రివిక్రమ్‌గారి కాంబినేషన్లో వస్తున్న సినిమా చేయబోతు న్నాను.



## ఈ సినిమాలో గ్లామర్‌గా కనిపిస్తారా?

అవన్నీ ఇప్పుడే చెప్పేస్తే థ్రిల్ ఉండదు. షూటింగ్ మొదలైన తరువాత ఎటూ ఆ విషయాలన్నీ ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంటాయి కదా!

## బయట అభిమానులను కలవడం తక్కువ అంటారు నిజమేనా?

సోషల్ మీడియా అందుబాటులోకి రాన ప్పుడు బయట అభిమానులను తరచూ కలిసే వారు. ఇప్పుడు ఆ అవసరం లేదు. ఎప్పుడంటే అప్పుడు సోషల్ మీడియా ద్వారా అభిమాను లను పలకరించవచ్చు. అలాగే నా విష యాలు వెంటవెంటనే వారికి చేరిపోతుం టాయి. ఇక ప్రత్యేకించి బయట కల వడం ఎందుకు?



## మీ సిస్టర్‌లాగా తెర వెనుక కాకుండా తెరముందు కని పించడానికి కారణం?

చిన్నతనంలోనే అంటే హైస్కూ లులో చదువుతున్న సమయంలోనే మా కెరీర్ ఎలా ఉండాలి? అన్నది నిర్ణయించేసుకున్నాం. మాది సినిమా కుటుంబం కనుక అక్క తెర వెనుక, నేను తెర ముందు కనిపించాలి అని డిసైడ్ అయిపోయాం. అదే విషయం మా మదర్‌కి చెబితే, ముందు స్టడీ పూర్తి చేయండి అన్నది. చదువులు పూర్తయ్యాక ముందు మేం అనుకున్న కెరీర్లలోనే స్థిరపడ్డాం.

## ఈ రంగంలోకి వచ్చిన తరువాత కష్టపడిన సందర్భం?

అస్సలు లేదు. నా జీవితంలో సినిమా కష్టాల్లేవు. మొదట్లో చిన్న చిన్న సమ స్యలు ఎదురయ్యేవి. కొద్దిగా కంగారుగా అని పించి మా ఫాదర్ సలహా తీసుకునేదాన్ని. ఇప్పుడు ఆ అవసరం రావడం లేదు. సినిమాల పరంగా నాకెదురయ్యే సమస్యలు నేనే పరిష్క రించుకోగలుగుతున్నాను. అయినా సినిమా మీద ఇష్టంతోనే వచ్చాను. ఏదీ కష్టంగా అనిపించడం లేదు. ఇప్పటివరకూ ఫుల్ హ్యాపీ! భవిష్యత్తులో కూడా ఇలాగే ఉంటానని అనుకుంటున్నాను.

## చదువుకునే రోజుల్లో మరిచిపోలేని సంఘటనలు..

చాలానే ఉన్నాయి. చెన్నైలో ప్యారిస్ అనే ప్రాంతం ఉంది. అక్కడ సమోసాలు రుచిగా ఉంటాయి. కొన్నిసార్లు క్లాసులు ఎగ్గొట్టి నా స్నేహితులతో కలిసి వెళ్లి తినేదాన్ని. కాలేజీకి ఆటోలోనే వెళ్లి వస్తుండేదాన్ని. ఆటో వారితో బాగా బేరమాడేదాన్ని. ఐదు పదిరూపాయలకు కూడా బేరమాడుతుంటే కొందరు నన్ను చూసి ఆపకుండా వెళ్లిపోయేవారు. ఇప్పుడదంతా తలుచు కుంటే భలే నవ్వొస్తుంది.

-చిన్ని

ఇంటర్వ్యూ



# మన చిత్రాల్లో అవకాశాలు మనవాళ్ళకే దక్కాలి

## -సత్యప్రియ

**సూపర్‌స్టార్లతో నటించిన బహుభాషా నటి సత్యప్రియ. నాటి ముఖ్యమంత్రి జయలలిత చేతులమీదుగా 'కలైమామణి' సహా ఎన్నో అవార్డులు పొందిన నటి.**

**ముంబయి నుంచి నటుల్ని రప్పించడం విచారకరం, టాలెంట్ ఉన్న నటులు మనలో ఎందరో ఉన్నారు, మన చిత్రాల్లో అవకాశాలు మనవాళ్ళకే ఇస్తే బాగుంటుందంటున్న సత్యప్రియ ఇంటర్వ్యూ....**

విజయనగరంలో పుట్టాను. మా నాన్నగారు భాగవతుల నాగేశ్వరరావు. అమ్మ సీతారత్నం. అమ్మానాన్న నాకు పెట్టినపేరు సత్యవతి. వీటూరి గారు నా పేరును సత్యప్రియగా మార్చారు. ప్రాథమిక విద్య, హైస్కూలు చదువు అరటిచెట్టు బడిలో, మున్సిపల్ స్కూల్లో పూర్తిచేశాను. మహారాజా ఉమెన్స్ కాలేజీలో పియుసి, బిఏ, ఆంధ్రా యూనివర్సిటీలో ఎం.ఏ చదివాను.

### రంగస్థలంపై తండ్రి వారసత్వం

మాకు ఒక హోటల్ ఉండేది. నాన్నగారు ఆ హోటల్ చూసుకుంటూనే నాటక బృందం స్థాపించారు. అప్పట్లో 'నవప్రపంచం' నాటకం వేసేవారు. ఆ నాటకాన్ని అందరూ అభినందించేవారు. నేను కూడా ఎంతో ఆసక్తిగా గమనించేదాన్ని. నటుడు సాయికుమార్ తండ్రి పి.జె.శర్మగారు, ప్రముఖ నటులు రాధాకుమారి, రమణమూర్తిగారు కూడా ఈ బృందంలో ఉండేవారు. అవన్నీ చూడటం వల్ల డైలాగ్స్ ఎలా చెప్పాలి? హావభావాలు ఎలా పలికించాలి? అనే విషయాలపై చిన్నప్పటి నుంచే నాకు అవగాహన ఏర్పడింది.

### నృత్య, నాటక ప్రదర్శనలు

పదేళ్ళ వయసులోనే నాట్యం నేర్చుకోమని అమ్మానాన్న ప్రోత్సహించారు. ఇంట్లో ఒక నాట్య కళాకారిణి ఉండాలనేది నాన్నగారి అభిప్రాయం. అలా మాస్టర్ సంపత్‌కుమార్‌గారి దగ్గర కూచిపూడి , 'మద్రాసు మాస్టారు' సి.రామ్మూర్తిగారి దగ్గర భరతనాట్యంలో ప్రావీణ్యం సంపాదించాను. ఎన్నో ప్రదర్శనలిచ్చి స్టేజ్ ఫియర్ అధిగమించాను. సంగీత కళాపరిషత్ ద్వారా అన్ని జిల్లాల్లో ప్రదర్శనలిచ్చి ఎన్నో అవార్డులు పొందాను. సోలో డాన్స్ జూనియర్స్ విభాగంలో అవార్డు నాకే దక్కటం కూడా అప్పట్లో మరిన్ని ప్రదర్శనలకు దోహదపడింది. ఆంధ్రా యూనివర్సిటీ స్టాఫ్ నాటకంలో రాజనర్తకి పాత్ర పోషించాను. దాంతో యూనివర్సిటీలో మంచి పేరు వచ్చింది.

### సుకుమార్ ఆర్కెస్ట్రా

ఆ రోజుల్లో 'సుకుమార్ ఆర్కెస్ట్రా' ఎంతో పాపులర్. ప్రముఖ గాయకుడు జి.ఆనంద్ కూడా అందులో ఉండేవారు. శ్రీకాకుళంలో ప్రసిద్ధి చెందిన ఆ ఆర్కెస్ట్రా వారు నా రాజనర్తకి పాత్రచూసి వారి స్టేజీ డ్రామాలో నటించమన్నారు. ఆ అవకాశంతో నాకు మరింత పేరు వచ్చింది. అలా అటు నాట్య ప్రదర్శనలు, ఇటు నాటక ప్రదర్శనలు చేస్తూ వచ్చాను.

### కమల్‌హాసన్‌తో

ఆంధ్రాయూనివర్సిటీలో డాన్స్ ప్రోగ్రాములు ఇస్తుండగా, ప్రసాద్ అనే ఆయన 'వార్ విడోస్ వెల్ఫేర్ ఫండ్' సేకరణకు వివిధ రాష్ట్రాల నుంచి నాట్య కళాకారుల్ని ఎంపిక చేసి ప్రోగ్రాములు ఏర్పాటు చేశారు. తెలుగు, తమిళ రాష్ట్రాల నుంచి నన్ను, కమల్‌హాసన్‌ను ఎంపిక చేశారు. అలా మేము కలిసి నాలుగైదు ప్రదర్శనలు ఇచ్చాం. బీహార్‌లో ప్రోగ్రామ్స్ చేశాం. వీటిల్లో స్నేక్‌డాన్స్, శివపార్వతి నృత్యం, లావణ్య నృత్యాలకు ఎంతో మంచిపేరు వచ్చింది. మా నృత్యాన్ని జనం ఆదరించారు. మా నాన్నగారికి ఒంట్లో బాగోలేదని నేను వెళ్ళినప్పుడు నా లావణ్య నృత్యం కూడా కమల్‌హాసనే చేయడం నేను మరచిపోలేదు. ఆ తర్వాతికాలంలో 'మనిదరిల్ ఇత్తనై నిరంగళ్' చిత్రంలో కమల్ భార్యపాత్రలో నేను నటించాను. ఇదే చిత్రాన్ని 'పట్నంపిల్ల'గా తెలుగులోకి డబ్బింగ్ చేశారు. ఇప్పటికీ కమల్ ఎప్పుడైనా కనిపించినప్పుడు స్నేక్‌డాన్స్ చేద్దామా? అంటాడు నవ్వుతూ.

### హిందీ చిత్రంతో సినీరంగ ప్రవేశం

ఆంధ్రాయూనివర్సిటీలో చదువుతున్నప్పుడే హిందీ చిత్రంలో అవకాశం వచ్చింది. ఒకవైపు హిందీ ఉద్యమం, మరోవైపు సినిమా అవకాశం వల్ల ఎం.ఏ చదువు మధ్యలో ఆపేశాను. ముంబయి నుంచి మా ఊరు వచ్చిన నిర్మాత నా ఫొటోలు తీసుకెళ్ళి కబురుపంపింతే ఆగమేగాలమీద ముంబయి వెళ్ళాను. 'బాలక్‌ధ్రువ్' చిత్రంలో సురుచి పాత్ర పోషించమన్నారు. ఆ సినిమా పూర్తికాగానే విజయనగరం తిరిగి వచ్చాను. ఈ సినిమా చూసిన పాత 'దేవదాసు' చిత్ర నిర్మాత డి.ఎల్.నారాయణ గారు నన్ను మద్రాసు పిలిపించారు. కె.విశ్వనాథ్ దర్శకత్వంలో నాతో సినిమా నిర్మాణానికి నిర్ణయించుకున్నారు. కానీ దురదృష్టవశాత్తూ ఆ

చిత్రం ఆరంభానికి ముందే ఆయన గుండెపోటుతో హఠాన్మరణం చెందారు.

### బ్రతుకేపండుగ

ఈ లోపు దర్శకులు పి.సి.రెడ్డిగారు 'బ్రతుకే పండుగ' సినిమాలో ముగ్గురు కొత్త హీరోయిన్ల కోసం అన్వేషిస్తుండగా, నిర్మాత పి.వి. రమణయ్య గారికి నేను తారసపడ్డాను. అలా నన్ను ఆ సినిమాలో ఒక హీరోయిన్‌గా ఎంపిక చేశారు. 1976లో విడుదలైన ఆ చిత్రం బాగా ఆడింది. తర్వాత 'జన్మజన్మలబంధం', 'ఇల్లు-వాకిలి', 'ఆడవాళ్ళ అపనిందలు'... ఇలా వరుసగా ఎన్నో సినిమాల్లో చేశాను.

### తమిళంలో యాభై చిత్రాలు

ప్రముఖ తమిళ దర్శకుడు వి.సి.గుహనాథన్ గారి సినిమాతో తమిళచిత్రరంగ ప్రవేశం చేశాను. జన్మజన్మలబంధం సినిమా చూసిన తమిళ నిర్మాత పి.ఆర్.ఓ ఒకరు, గుహనాథన్‌గారికి నా గురించి తెలియజేయడంతో ఆయన నన్ను పిలి పించి 'మంజల్ ముఘమే వరుఘ' చిత్రంలో హీరోయిన్‌గా అవకాశమిచ్చారు. గుహనాథన్‌గారికి, నాకు కూడా అదే మొదటిచిత్రం. దీనికి విపరీత మైన ప్రెస్ పబ్లిసిటీ లభించడంతో నాకు మంచి పేరు వచ్చింది. తర్వాత తమిళంలో దాదాపు యాభై వరకు చిత్రాల్లో నటించాను.

### కన్నడ చిత్రం

తెలుగు, తమిళ భాషల్లో ఊపిరిసలపకుండా నటిస్తున్న సమయంలోనే ఒక కన్నడ చిత్రంలో అవకాశం లభించింది. కన్నడ నిర్మాత ముకుంద్ పరిచయమయ్యారు. ఆయన నిర్మించిన 'బెసుగే' చిత్రంలో హీరోయిన్‌గా, ఆ తర్వాత మలయాళ చిత్రాల్లో కూడా నటించాను. ఈ రెండుభాషల్లో ఎన్నో చిత్రాలు చేశాను.

### కుటుంబం

నా భర్త పేరు ముకుంద్. కన్నడ చిత్ర నిర్మాత. మొట్టమొదట ఆయన 'బెసుగే' చిత్రంలో హీరోయిన్‌గా నేను నటించడమేకాదు, ముకుంద్ గారితో నా వివాహం కూడా అదేసమయంలో అంటే 1979లోనే జరిగింది. మాకు ఇద్దరు పిల్లలు. అబ్బాయి రవిసిద్దార్థ. అమెరికాలో ఉద్యోగం. అమ్మాయి లక్ష్మీప్రియదర్శిని. బ్రిటన్‌లో ఉద్యోగం.






### పెళ్ళి తర్వాత ఎనిమిదేళ్ళు విరామం

పెళ్ళయ్యాక ఎనిమిదేళ్ళు నటనకు దూరంగా ఉన్నాను. తర్వాత 'పుదియపాదై' చిత్రంలో తమిళ దర్శకుడు పార్తిబన్ దర్శకత్వంలో అవకాశం ఇచ్చారు. బిజీగాలేని ఆర్టిస్టు, ఒక టిపికల్ ఫేస్ అవసరం కావడంతో సుందరరాజన్ అనే ఆయన నన్ను తీసుకెళ్ళి పార్తిబన్‌కు పరిచయం చేశారు. విచిత్రం ఏమిటంటే పార్తిబన్ నా అభిమానట! అలా నా అభిమాని దర్శకత్వంలో ఒక పాత్రలో నటించడం నాకెంతో సంతోషం కలిగించింది. ఆ పాత్రలో నటిస్తే నా భర్త, పిల్లలు ఏమనుకుంటారు? అనే ఉద్దేశంతో మొదట నావల్ల కాదన్నాను. కానీ ఆయన ధైర్యం చెప్పడంతోపాటు నా భర్త కూడా అంగీకరించడంతో నటించాను. అందరూ గుర్తుంచు కోదగిన మంచిపాత్ర అది. 1989లో ఈ చిత్రం విడుదలైంది. పార్తిబన్‌గారు, నా కాంబినేషన్‌లో ఈ చిత్రం సూపర్‌హిట్టై నాకు మంచిపేరు రావ డంతో మళ్ళీ నటిగా బిజీ అయ్యాను. తెలుగులో కూడా మంచి అవకాశాలు వచ్చాయి.

### అగ్ని

నాగార్జున, శాంతిప్రియ నటించిన రాఘ వేంద్రరావుగారి 'అగ్ని' చిత్రంలో నటించాను. 1989లో విడుదలైంది. బాషా చిత్రంలో రజనీకాంత్ తల్లిగా, రోజా చిత్రంలో అరవిందస్వామి తల్లిగా, శివరామరాజు చిత్రంలో జగపతిబాబు మేనత్తగా... ఇలా మళ్ళీ ఎన్నో తెలుగు, తమిళ, మలయాళ చిత్రాల్లో నటించాను. రోజా, అగ్ని, సూర్యవంశం, బాషా ఆణిముత్యాల్లాంటి చిత్రాలు. ఎవరే అతగాడు, లాహిరి లాహిరి లాహిరిలో చిత్రాలు కూడా నాకు రెండుకళ్ళు లాంటివి. నా కెరీర్‌లో ముఖ్యంగా ఈ రెండు చిత్రాల్లో విశ్వనాథ్‌గారికి జతగా నటించాను.

### ఫ్యామిలీ ఫ్రెండ్ రజనీకాంత్

రజనీకాంత్ మా ఫ్యామిలీ ఫ్రెండ్. పెళ్ళికాక ముందునుంచే ముకుంద్‌గారికి ఆయన బాగా తెలుసు. కలకత్తాలో తమిళ-హిందీ ఆర్టిస్టుల మధ్య క్రికెట్ మ్యాచ్ మేము నిర్వహించినప్పుడు రజనీకాంత్, సంగీత, మంజుభార్గవి లాంటి వాళ్ళంతా వచ్చారు. 'పణకారం' చిత్రం నుంచీ రజనీతో నాకు పరిచయం. కష్టసుఖాల్లో రజనీ కాంత్ మాకు ఎంతో ధైర్యం చెప్పేవాడు. ఒక సారి రజనీకాంత్‌కి రాఖీ కట్టాను. ప్రతి సంవ త్సరం వెతుక్కుంటూమరీవచ్చి రాఖీ కడతానని పకపకా నవ్వుతుంటే మాకు హాయిగా అనిపిం చింది. 1995లో నా భర్త మరణించినప్పుడు కూడా రజనీకాంత్ నాకు ఎంతో మనోధైర్యానిచ్చాడు. మా అబ్బాయి, అమ్మాయి అమెరికాలో ఎం.ఎస్, ఆర్కిటెక్చర్ కోర్సులు పూర్తిచేసి స్థిరపడ్డారు. అన్ని విషయాల్లో నాకు రజనీకాంత్ చేదోడువాదోడుగా ఉండేవాడు. కొంతకాలం అమెరికాలో ఉండి వచ్చాను. అక్కడ ఉండాలనే కోరిక లేదు. ఈ మధ్యే తిరిగి చెన్నై వచ్చాను.

### బుల్లితెరపై

టీవీ సీరియల్స్ ద్వారా బుల్లితెర ప్రేక్షకులకు కూడా సుపరిచితురాలిని. తమిళ టీవీ సీరియల్ కోలంగల్‌లో నటించాను. ఆ సీరియల్‌కిగాను ఉత్తమ నటిగా అవార్డు అందుకున్నాను. తెలుగులో ఈ సీరియల్‌నే ముత్యాలముగ్గుగా డబ్‌చేశారు. ఇది సూపర్‌హిట్ సీరియల్. తెలుగులో ఎన్నో టీవీ సీరియల్స్ చేశాను. 'శ్రీమతి' సీరియల్‌లో ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం నాకు భర్తగా నటించారు. మా కాంబినేషన్‌ను జనం ఆదరించారు. 'పెద్దన్నయ్య' సీరియల్‌లో సూపర్‌స్టార్ కృష్ణగారికి పిన్నిగా నటిం చాను. ఇలా ఎంతోమంది ప్రముఖులతో విజయ వంతమైన సీరియల్స్‌లో నటించాను.

### ముంబయి నటుల దిగుమతి విచారకరం

సినిమా పరిశ్రమలో మార్పు సహజం. కానీ భాష తెలిసినవారు లేరు. గతంలో భాషతెలిసిన వారు ఎక్కడున్నా వెతికిమరీ అవకాశాలు ఇచ్చే వారు. ఇప్పుడు ముంబయి నుంచి నటుల్ని పిలి పించడం ఎక్కువైంది. దానివల్ల తెలుగు పరి శ్రమలో స్థానికంగా ఉన్న నటులకు అవకాశాలు తగ్గిపోయాయి. ఇది విచారకరం. ఎంతో టాలెంట్ ఉన్న నటులు తెలుగు చిత్ర పరిశ్రమలో ఎందరో ఉన్నారు. వారికి అవకాశాలిస్తే బాగుంటుంది. కాకపోతే టీవీ అవకాశాలవల్ల కొంత ఊరట కలి గించదంతే. గుహనాథన్, పార్తిబన్, మణిరత్నం ఈ ముగ్గురూ చిత్ర పరిశ్రమలో నాకు గురుతుల్యులు.

-కె.హరనాథ్

సెల్: 97035 42598

# ఇవన్నీ నిజాలే!

## తల్లిపిలిస్తే వెళ్ళిపోయాడు!

A 17వ శతాబ్దంనాటి ఫ్రెంచి నటుడు ఛాంప్ మెస్లే. అతడి తల్లి మరణించి ఎన్నో ఏళ్ళు గడిచిపోయింది. ఒకరోజు హఠాత్తుగా తల్లి మెస్లే కలలో కనిపించి నా దగ్గరకు రా అని పిలిచింది. మర్నాడు స్నేహితులకు ఈ కల విషయం చెప్పి చర్చిలో ప్రార్థనలు చేసి బైటకువచ్చి కుప్పకూలి మరణించాడు మెస్లే!

•••

A గానకోకిల, భారతరత్న ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి. వివిధ సంస్థల సహాయార్థం కచేరీల ద్వారా ఆమె సేకరించిన సొమ్ము ఉజ్జాయింపుగా 47 లక్షలు పైనే అని తేలింది. -శ్రీమతి డాలీరజ్నీ

•••

A పియర్స్ పళ్ళు చైనాలో క్రీస్తుపూర్వం 1134 నుండే సాగులోకి వచ్చాయి. పైన కోలగా, కింద వెడల్పుగా ఉండే ఈ పళ్ళలో దాదాపు మూడువేల రకాలున్నాయి.

•••

A విజయనగర సామ్రాజ్యంలో కొన్ని ప్రాంతాల్లో ప్రబలిన అవినీతి, అక్రమాలను ఒక నాటకంగా మలిచి మహారాజు వీరనరసింహ రాయలు ఎదుట ప్రదర్శించారు కూచిపూడి నాట్యకళాకారులు. ఆయన అర్థం చేసుకుని అధికారులను కఠినంగా శిక్షించి, ఆ కళాకారుల్ని ప్రోత్సహించాడు.

•••

A ఇండోనేసియా సుమత్రాదీవుల్లో ఉండే శవపుష్పం (అమోర్ఫో పల్లాస్ టైటానమ్) అరుదైనదీ, అతి పొడవైనదీ. 12 నుంచి 24 అడుగుల ఎత్తువరకు ఎదిగే ఈ పుష్పం బరువు 80 కిలోలు. మనం భరించలేనంత భయంకర దుర్గంధం వెలువరిస్తుంది.

•••

A ఆస్ట్రేలియా టాస్మానియా దీవుల్లో మాత్రమే కనిపించే టాస్మానియన్ డెవిల్స్ జంతువును చూస్తేనే మనకు దడపుడుతుంది, భయంకరమైన దాని అరుపుతో గుండెలు జారిపోతాయి. లోహాన్ని కూడా అది కరకర నమిలేస్తుంది.

•••

A 1936లో విమానం నడిపిన మొట్టమొదటి భారతీయ మహిళ సరళ థక్రాల్ (Sarla Thakral).

•••

A మనదేశంలో ఇంటర్నెట్ ఎప్పుడు ప్రారంభమైందో తెలుసా? 1995 ఆగస్టు 15వ తేదీన. కానీ బ్రాడ్‌బ్యాండ్ విధానం వచ్చేవరకు అంటే పదేళ్ళవరకు అది వేగం పుంజుకోలేదు!

•••

A మొఘల్ చక్రవర్తి అక్బర్ దగ్గర 1000 చిరుతపులులు ఉండేవి.

-చిన్నారి

# సుధామ పదగారడి-301

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| h | 1 | 2 | | h | 3 | 4 | | 5 |
| 6 | h | | h | 7 | h | | h | |
| 8 | | h | 9 | | | 8 | h | |
| | h | 10 | h | | h | h | 11 | h |
| h | 12 11 | | | h | 13 | 14 | | 15 h |
| 16 | h | 15 | h | 17 h | h | h | h | |
| 18 | | h | 19 | | | 19 h | 20 h | |
| h | h | 21 | h | | h | 22 | h | |
| 23 | | | | h | 24 | | | h |

## ఆధారాలు

**అడ్డం**

1. సలీం అనార్కలీకి (3)
3. లైలా మజ్నూకి (4)
8. ఇది గీసుకుని అందులోనే బ్రతుకుతారు కొందరు, కొండ (2)
9. .... కనలేని నా జాలి తెలిసి (త్యాగరాజకీర్తనారంభం) (4)
12. ఇది కూడా సుఖమే కాదా, నిరతము చింతన మధురము కాదా అన్నాడు కవి (3)
13. లౌ లెటర్ (4)
18. బొడ్డు (2)
19. ముద్దు (3)
20. భారతీయ స్త్రీకి అలంకార వస్త్రం (2)
23. సినిమా పరిభాషలో ముద్దు ఆంగ్లపదంగా (4)
24. ప్రేమించిన వాడికి పార్వతి పిలుపు సినిమాలో (3)

**నిలువు**

2. ఉపాయం (2)
4. సరియైనది, తగినది (3)
5. పిసినారివాడు (3)
6. ఇంగ్లీష్ ఆవుతో మొదలైన ఆలింగనం (3)
7. బింకము (3)
10. ఆలుమగలు ఆడుకుంటూ వుండాల్సిందే! (3)
11. ఓ మెచ్చుకోలు, ప్రశంసాపదం (2)
14. మనస్సు, హృదయం మనది ఆద్యంతం (2)
15. ఇది ఎడారి పంట (4)
16. సలీంకు మూడూ అడ్డం ఎవరు?(4)
17. ఆకాశం, వస్త్రం (3)
21. ఈమెకు ఒకటీ అడ్డం మజ్నూయే! (2)
22. అత్తకొడుకు (2)

## పదగారడి-300 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 300 | మూ | డు | వం | ద | లు | 300 | క | 300 |
| కిం | పు | 300 | 300 | వ | 300 | వ | స | తి |
| 300 | రం | గు | 300 | నం | దా | 300 | వు | 300 |
| సం | 300 | హా | యి | 300 | రు | చి | 300 | అ |
| తో | య | ము | 300 | ర | ణం | 300 | నా | భి |
| షం | 300 | ఖం | 300 | మా | 300 | సె | 300 | మ |
| 300 | సె | 300 | చే | ప | 300 | వ | సం | తం |
| క | ల | లో | 300 | తి | ను | 300 | పం | 300 |
| న్య | 300 | లో | భి | 300 | సి | వం | గి | 300 |

Printed and Published by VEMURI RADHAKRISHNA,Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey
No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on

# వారంటే ఎక్కువ ఇష్టం

## -అమైర్ దస్తూర్



**అమైర్ దస్తూర్....పెద్దగా పరిచయం అక్కర్లేని హీరోయిన్. ఒకే ఒక్క డబ్బింగ్ సినిమాతో తెలుగువారికి పరిచయమైంది. ఇప్పుడు 'కుంగ్ ఫూ యోగ' సినిమా ద్వారా ప్రపంచవ్యాప్తంగా అభిమానులను సంపాదించుకోనుంది. త్వరలో విడుదల కానున్న ఈ సినిమా విశేషాలు అమైర్ మాటల్లోనే....**

### త్వరలోనే విడుదల కాబోతున్న 'కుంగ్ ఫూ యోగ' గురించి...

ఇక్కడ ఈ సినిమా విడుదల కాలేదు కానీ, చైనాలో ఆల్‌రెడీ విడుదలై అక్కడి రికార్డులను తిరగ రాస్తోంది. మన దగ్గర ఏప్రిల్ మొదటి వారంలో విడుదల కాబోతోంది. అందరికన్నా ఎక్కువ ఆత్రుతగా నేను ఎదురు చూస్తున్నాను. మనవారికి కూడా ఈ సినిమా బాగా నచ్చుతుందన్న నమ్మకం నాకుంది.

### సినిమాలో అవకాశం ఎలా వచ్చిందంటే...

ఆడిషన్ టెస్ట్‌కి వెళ్లినప్పుడు ఇదొక హాలీవుడ్ సినిమా అని నాకు తెలియదు. వెళ్లిన తరువాత తెలిసింది. అది వేరే విషయం. దాదాపు నెలన్నర తరువాత ఇందులో హీరో జాకీచాన్ అని తెలిసి ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగింది. ఎక్కువ సంతోషం కలిగించే మరో సంగతి కూడా అప్పుడే తెలిసింది. ఈ సినిమాలో దిశా కూడా చేస్తోందనీ! తనూ నేనూ పూరీ గారి ఏజెన్సీలో కలుసుకున్నాం. అప్పటి నుంచి ఇద్దరం మంచి స్నేహితులం అయిపోయాం. అయితే ఇద్దరం ఒకే సినిమాలో చేయబోతున్న సంగతి ముందు తెలియదు. ఆ తరువాత తెలిసి తెగ సంబరపడిపోయాం. ఇప్పుడు మా స్నేహం మరింత బలపడింది.

### నా పాత్ర గురించి చెప్పాలంటే...

సినిమా మధ్యలో వస్తాను. కానీ నా పాత్రఎంటర్ కావడంతోనే కథ మలుపు తిరుగుతుంది. ఇండియా యువ రాణుల్లో నేను కూడా ఒక యువరాణిని. ట్రెజర్ హంట్ నేపథ్యంలో సాగే సినిమా కథ ఇది.

### జాకీచాన్‌తో పనిచేయడం ఎలా ఉందంటే...

చిన్నతనం నుంచీ ఆయన సినిమాలు చాలా చూశాను. మొదటి రోజు భయం వేసిన మాట నిజమే! తన మాటలతో నా భయం పోగొట్టారు. ఆయన మంచితనం గురించి చెప్పాలంటే ఓ సంఘటన చెప్పక తప్పదు. యుద్ధ సన్నివేశాలు షూట్ చేసే సమయంలో కాలికి దెబ్బ తగిలింది. నొప్పితోనే చేస్తానని చెప్పినా ఆయన వినలేదు. రెండు రోజులు షూటింగ్‌కి సెలవు ఇచ్చి ఆ తరువాత చేశారు. అంత భారీ సినిమాలో రెండు రోజులు సెలవు అంటే మాటలు కాదు. కానీ ఆయన డబ్బు కన్నా మనిషికే ఎక్కువ విలువ ఇచ్చారు. ఇది చాలు ఆయన ఎలాంటి వ్యక్తో చెప్పడానికి.

### సోనూసూద్ ఎలాంటి వారంటే...

మొదట్లో ఆయన్ని చూసి చాలా సీరియస్‌గా ఉంటారేమో అని భయపడ్డాను. కానీ అదంతా నా భ్రమ అని కొద్దిసేపటికే తేలిపోయింది. చాలా సరదాగా ఉంటారు. నేను ప్యూర్ వెజిటేరియన్‌ని. ఆ సంగతి తెలుసుకుని చైనాలో వెజిటేరియన్ ఫుడ్ దొరికే ప్లేస్‌లు తెలుసుకుని అక్కడినుంచి ఫుడ్ తెప్పించేవారు. ఆయన హెల్ప్ లేకపోతే తిండికి అల్లాడిపోయేదాన్నేమో! ఫుడ్‌కి ఇబ్బంది పడలేదంటే అదంతా ఆయన చలవే!

### ఎలాంటి సినిమాలు చేయాలనుందంటే...

నా మొదటి ఛాయిస్ దక్షిణాది సినిమాలకే! దక్షిణాది సినీ ప్రేక్షకులంటే నాకు ఇష్టమే కాదు, గౌరవం కూడా! అందుకే ఇక్కడే ఎక్కువ సినిమాలు చేయాలనుంది. చాలా మంది అడుగుతున్నారు. కానీ ఇంత వరకూ వేటికీ ఓకే చెప్పలేదు. చాలా వరకూ డ్యాన్సులకే పరిమితమయ్యే క్యారెక్టర్లు వస్తున్నాయి. నటనకు అవకాశం ఉన్నవి రావడం లేదు. గ్లామర్ అవసరమే కానీ, గ్లామర్‌డాల్‌గా ముద్ర పడితే కెరీర్ ఎక్కువ కాలం కొనసాగించడం కష్టం కదా! అందుకే నటనకు అవకాశం ఉన్నవి కూడా చేయాలని ఉంది.

-దేవి



